## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016333

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భేతాళకథలు

గ్రంథకర్త

మద్దూరి శ్రీరామమూర్తి



సరస్వతీగ్రంథమండలి
రాజమహేంద్రవరము

# వి ష య సూ చి క



## ద్వితీయ భాగము



---

# భేతాళకథలు



## ఉపక్రమణిక

విక్రమార్కభూపాలుఁ డఖండవైభవంబున భూవలయంబును బరిపాలించుచుండ నొక్క సంయమీంద్రుడు ప్రతిదినంబునను నొక్క ఫలమును గొని యాతని యాస్థానమున కరుదెంచి విధిదృష్టవిధానంబున నాతని నాశీర్వదించి తా గొనివచ్చిన ఫలము నాతనికిఁ గానుకగా సమర్పించి వెడలుచుండెడివాఁడు. విక్రమార్కుఁ డనుదినం బా ఫలముల తన శయనాగారమునకుఁ గొనిపోయి యొకచో నుంచుచుండెను. పట్టమహిషియు భూపాలుఁ డా ఫల మెప్పుడు భుజింప నపేక్షించునో యను వెరవున భుజింపక యొకచో భద్రపఱచుచుండెను గాని భూపాలు డా ఫలము నెన్నడును భుజింప నపేక్షించి యుండలేదు. ఇట్లుండ నొక్కనాఁ డా మునిపుంగవుఁడు ఫల మొసంగి వెడలిన పిమ్మట యొక బిత్తుకుఁడు తన పెంపుడు వానరముతో వచ్చి కరుదెంచి భూపాలునితో "దేవా! ఈ మర్కట మొసరించు వినోదముల గాంచి తమరు నన్ననుగ్రహింప వేడుకొనుచున్నాఁడను." అని వినయవిధేయతలతో విన్నవించ భూపాలుఁ డందుల కనుమతించెను. బిత్తుకుఁ డా వానరమును పెక్కుగతుల నాడించి యట నున్న సభ్యుల నపరిమితానందనాబ్ధిమగ్నుల గావించెను. విక్రమార్కభూపాలుఁడు గూడ నపరిమితానందభరితుఁడై తన కరంబున నున్న ఫల మా మర్కటమున కందించెను. ఆ మర్కట మద్దానిని భక్షింపవలయునను కోరాశతో విఱువగా నందుండి యొక యమూల్యరత్న మిలాతలంబున బడియెను. విక్రమార్కుఁ డా రత్నముఁ దీసి పరీక్షించి యయ్యది యించుమించుగా

నొక లక్షవరాలు విలువ సేయునదిగా నిశ్చయించి; కడుంగడు నాశ్చర్యంబున నంతఃపురంబునకుఁ జని ప్రియాంగనఁ జేరబిలచి "ప్రియా! సుమా రొక నెలదినంబులనుండి యనుదిన మొక ఫలంబును గొనివచ్చి యీ శయనాగారమున నుంచుచుంటిని. ఆ ఫలము లేమయ్యెనో యెఱింగియుంటివేని వచింపు" మని బలుక నామెయు భూపాలుని కిట్లనియెను. "ప్రతిదినంబునను ఫలమును దీసి భద్రముగా నొకచో నుంచుచుంటిని. తమ రే యవసరంబున వాటిని గూర్చి ప్రశ్నింతురో యని వానిని భక్షింప సాహసింపనైతిని." అని బల్కి యాఫలముల నైచియుంచిన సువర్ణమందరమును దెరచి చూపెను. విక్రమార్కుఁడామె యట్లొనరించినందుల కెంతయో సంతసించి యా ఫలములలో నొక ఫలమును దీసి విచ్చెను; తోడనే యందుండి మరియొక యమూల్యరత్నము భూమిపై బడియెను. విక్రమార్కుఁ డపరిమితాశ్చర్యమున నింకొక ఫలమును బరీక్షింప నందు గూడ యమూల్యరత్న ముండెను. క్రమక్రమముగా విక్రమార్కుఁ డన్ని ఫలములను గూడ బరీక్షించి యన్నిటియందును రత్నము లుండుట జూచి యాశ్చర్యమగ్నమానసుఁడై యుండెను.

నాటిరేయి విక్రమార్కుఁడు తన మనంబున నిట్లు వితర్కింపఁ సాగెను. "ఈ జడదారి యనుదిన మిట్లొక యమూల్యరత్నగర్భితఫల మొసంగుట జూడ ఈతఁ డెద్దియో నావలన గాగల కార్య ముండుటచే నన్ను ప్రసన్నుని జేసికొన గోరియున్నట్లు దోచుచున్నది. కానియెడ నిట్లొనర్పవలసిన యగత్య ముండదనియే నా యభిప్రాయము. అయినను ఈతఁడు జడదారి యరిషడ్వర్గాదుల జయించి మోక్షసామ్రాజ్యలక్ష్మి జేకొన తపోనిష్ఠాతత్పరత మెలంగు నీ జడదారికి నావలన దీరగల కార్య మేముండును. గాన నిరపేక్షతో జనుదెంచి యాశీర్వదించి ఫల మొసంగుచున్నటుల నే దలంపవలయును గాని యన్యథా దలం

చుట కెట్టి యవకాశమును గాన్పింపదు......అని యేమేమో దల పోసి మరునాఁ డా సంయమీంద్రుని పోనీక నిల్పి యాతఁ డొనర్చు కృత్యమునకు గారణంబరయ నిశ్చయించుకొనియెను. తన్నిశాశేష మోటులనో వేగించి యరుణోదయంబున మేల్కాంచి కాల్యకరణీయం బుల దీర్చుకొని యథాకాలమునకు సభాస్థలంబున కరుదెంచి సంయ మీంద్రుని రాకకై నిరీక్షించుచుండెను.

నిర్ణీతసమయమున కా సంయమిపుంగవుఁడు సభాస్థలి కరుదెంచి విక్రమార్క భూపాలున విధివిధానంబున నాశీర్వదించి ఫల మొసంగెను. భూపాలుఁ డా ఫలమును గూడ విచ్చి జూచెను. అందునను యమూల్య రత్న మొకటి విరాజిల్లుట దిలకించి—సంయమీంద్రునితో నిట్లనియెను. "దేవా! పెక్కుదినములనుండి ఫలముల నొసంగుచుండ నుపేక్షించితిని కాని గతదినంబున తమ రొసంగిన ఫలమును విచ్చినంతనే యొక యమూల్యరత్నము గానుపించెను. అందులకే నాశ్చర్యము నొంది తమ రీవర కొసంగిన ఫలముల గూడ బరీక్షింప ప్రతిఫలమునందునను యొక్కొక రత్న ముండుటచే నాశ్చర్యమగ్నమానసుండ నైతిని. తమ రనుదిన మిట్లేల రత్నగర్భితఫలముల నొసంగుచుంటిరో యింతవరకు గనుగొననేరని నా యపరాధంబు మన్నింపవలయును; నావలన నెద్దియో యొక మహాత్కార్యము సాధింప దలంచిన ట్లనుమానించు చున్నాడను గాన తమ యభిమత మెద్దియో వచింపవలయును. తమ రెట్టి కార్యము సాధింప నియోగించినను సాధించుటకు సిద్ధముగా నున్నాడను." అని వినయవిధేయతలతో బలుక నా జడదారి యధిక సంతోషమొంది భూపాలవరేణ్యున కిట్లనియెను.

"రాజోత్తమా! నీ యనుమానమే నిక్కువము. నీవలన నొక కార్యమును సాధింప నెంచియుంటిని. నీవు ప్రసన్నుడ వగుటకే యి ట్లనుదినంబును ని య్యెడ కరుదెంచుచుంటిని. నా పూర్వజన్మసంచితార్థ

మున నేటికి నీవు ప్రసన్నుఁడవై వలయు కార్యము దీర్చెదనంటివి. పరమానందభరితుఁడ నైతిని. నే నొక జన్న మొనరింప సంకల్పించు కొంటిని. ఆవనమున కీవు సంరక్షకుఁడవై నిలువవలయును. ఇందుల కంగీకరింతు వేని రాగల కృష్ణచతుర్దశినాఁటి రాత్రి యరుదెంచు నంతకు నీ వీ గ్రామోపకంఠమున గల రుద్రభూమి కరుదేరవలయును."

ఆతని పల్కు లాలించి యసహాయశూరుం డగు విక్రమార్కుఁడు సంతసంబున నాఁటికి తా నరుదెంతునని వచించి యా సంయమీంద్రుని సమయోచిత గౌరవపురస్సరముగా వీడ్కొల్పి పంపెను.

విక్రమార్కుఁడా మునిచంద్రుఁడు వచించినట్టుగా కృష్ణచతుర్దశి నాఁటిరాత్రి గ్రామోప కంఠమున నున్న ప్రేతభూమికిఁజని; యట వివిధవస్తు సంభారములతో సన్నద్ధుఁడై సవన ప్రారంభ సంసిద్ధుఁడై తన రాకకై నిరీక్షించుచున్న జడదారి గాంచి యతి భక్తిమై నమ స్కరించెను. ఆ జడదారియు ఆతని రాకకు సంతసమందెను. విక్రమార్కుఁడా మునిపుంగవుని కిట్లనియెను. "దేవా! తమ యజ్ఞనమునకు విఘాతమాపాదించువారెవ్వరు? వారెచ్చట నివసింతురు? వారే రూపమున నరుదెంచు చుందురు. నేనిట యొనర్పవలసిన కార్యమేమో సవిస్తరముగా వచింపరే" అని పలుకుచున్న భూపాలునకా మునిచంద్రు డిట్లనియెను. "ఓయీ ఈ నడుమ పెక్కుసార్లు సవన మారంభించితిని గాని యది నిర్విఘ్నముగా గొనసాగి యుండలేదు. ఈ రుద్రభూమి కుత్తరముననున్న యొక వట వృక్షముపై నివసించుచున్న భేతాళుఁ డెల్లపుఁడు నాయొనర్ప బూనిన జన్నమునకు విఘ్న మాపాదించు చుండును. ఇపుఁడు నీ వచటికేగి యాతనిబట్టి తెమ్ము. ఇచ్చటి గొని వచ్చితివా యాతని నిముష మాత్రమున మంత్రబద్ధుని గావింపగలను. తదుపరి జన్నము నిర్విఘ్నముగా బరి సమాప్తి నొందును. ఆతఁడు శవాకృతిదాల్చి యుండును; గుర్తించి తీసికొనిరమ్ము. త్రోవలో

నాతనితో మాటలాడినయెడల నాతఁడు నీపట్టు దప్పించుకొని మరల వట వృక్షమును జేరుచుండును. గావున మౌనవ్రతమూని యాతని గొని రావలయును." అని మునిబల్కిన విని నిముషమాత్రంబున భేతాళుని గొనివత్తును. సవన ప్రారంభమునకు సంసిద్ధుఁడై యుండుఁడని బల్కి యుత్తరాభిముఖుఁడై చనియెను.

సంయమీంద్రుఁడును విక్రమార్కునివలన దాను సాధింపదలచిన కార్యము సాధింపనౌను గదా యను సంతసంబున ప్రతి నిముషమును విక్రమార్కుని యాగమన మాకాంక్షించుచు నిరీక్షించి యుండెను.

గాఢాంధకార బంధురంబుగ నున్న యా నిశా సమయంబున విక్రమార్కుండు వక్ర పరాక్రమంబునఖడ్గమాత్ర సహాయుఁడై యుత్తరాభిముఖుండై చని చని యొక వట వృక్షశాఖలఁ దగుల్కొని శవాకృతిం బొంది యధోముఖుండై వ్రేలాడుచున్న భేతాళుఁ బొడగాంచి నిర్భీత చేతస్కుఁడై వృక్షం బధిరోహించి భేతాళునిపట్టి బంధించి మూపునం దిడుకొని వృక్షావరోహణ మాచరించి యా భారంబును మోవజాలక నాయాసపడుచు యతి యున్నతావున కభిముఖుఁడై నడచుచుండెను.

---

# వజ్రమకుటుని కథ.



భేతాళుఁడు విక్రమార్కుని భుజంబున నధివసించి పెక్కువిధముల నాతని మౌనవ్రతమునకు భంగ మొనరింపవలయునని ప్రయత్నించియు విఫల ప్రయత్నుఁడై భూపాలుఁజూచి కనికరించువాని చందంబున "రాజా! ఎట్టి దుర్ఘట కార్యమున కీవు పూనుకొంటివి. విలాసముగా ఛత్రమ్మునైన ధరింప నగత్యము లేని భూపాలుఁడవే యిట్టియెడ నొక మనుజునకుఁగాదు నలువురకైనను మోయుట కసాధ్యమైన నన్ను నీ వొక్కరుండవే మోయ నెలసివచ్చినది. ఎంతో శ్రమపడుచుంటివి. ఇంతకును విధి వ్రాత దప్పింప నెవ్వని తరంబు. అయినను శ్రమ నివారణార్థ మొక చక్కని కథ చెప్పెద నాకర్ణింపుము." అని పలికి యీ క్రింది కథ చెప్పుట కుపక్రమించెను.

తొల్లి *గౌరీకృతంబను పురీవరంబున ప్రతాపముకుటుండను భూపాల తిలకుం డఖండవైభవంబున భూవలయమును పరిపాలించుచుండెను. అతనికి వజ్రమకుటుండను కుమారుఁడు గలఁడు. వజ్రమకుటుఁడు సర్వ విద్యా పరిపూర్ణుఁడై సంప్రాప్త యౌవనుఁడై యనవరతంబు మంత్రి సూనుఁడగు సుబుద్ధి యను నాతనితో గలిసి మెలసి వర్తించుచు నొక్క నిముషమైన నాతని నెడబాయ లేకుండెను.

---

*వారణాశీ పురంబని కొన్ని ప్రతులయందు గలదు. కథా సరిత్సాగర మందును గూడ గౌరీకృతంబనియే గలదు. "భేతాళ పంచ వింశతి" యను పద్యకావ్యమున గూడ గౌరీకృతంబనియే గలదు.

ఇట్లుండ నొక్కనాఁ డా యిరువురు స్నేహితులును సముచిత పరివారులై మృగయావినోదార్థమై సమీప వనంబుల కరిగిరి. ఇరువురును యొకరినొకరు దీసిపోకుండునట్లుగా మృగంబుల సంతోకాలయంబున కనుపుచు పెక్కు విధంబుల విహరించుచు నెట్టకేలకొక్క వనీవరాహముఁ బొడగాంచిరి. భూపాలుఁ డద్దాని సమయింప సమకట్టి నొక్క బాణ మా వరాహముపై విడచెను. అయ్యదియు యేటుదిని దుస్సహముగా బాధింపబడుచు తిరిగి వారిపై బడుటకు భయమొంది ప్రాణములఁ దక్కించుకొన నెంచి పరుగిడ మొదలిడెను. రాకుమారుఁ డెట్లైనను దాని వధింపవలయునను యుత్సాహమున వెంబడించెను. మంత్రిసూనుఁడును యాతని కంగరక్షుగా నుండుటకై వెన్నంటెను. పరివారములో గొందఱు కొంతవరకు వెంబడించిరిగాని వారి వారువములతో సమముగా దమ వారువములు బోజాల కున్నందున వెనుకకు మరలవలసిన వారైరి.

వజ్రమకుటుఁడును సుబుద్ధియు యపరాహ్ణకాలంబు దనుక నాపందిని వెన్నాడిరి ; కాని యావనీవరాహము లతానికుంజములలో దూరి తప్పించు కొనెను. అంత రాకుమారుఁడు విషాదమున వెనుదిరిగి జూచి సుబుద్ధి తన్ననుసరించుటకు కొంత సంతసించి యాతని సమీపించి వరాహంబు దిరోహితమైన వృత్తాంత మెఱిఁగించి వెండియు నిట్లనియె "ఓయీ! యధికమగు దాహముచే పీడింపబడు చున్నాడను. సమీపమున నెందైన జలాశయమున్నదేమో పరికింపవలయును. మన కంటె నెక్కుడుగా మన హయములు డస్సియున్నవి. అయ్యవిఁ గూడ విశ్రాంతి దీసికొనినగాని తిరుగప్రయాణమున కుపయుక్తములుగావు." అనుటవిని సుబుద్ధి నలుదెసలబరికించి తూర్పు దెసనుండి జలవిహంగము లరుదెంచుట దిలకించి యా దెస నెద్దియో సలిలాశయముండునని యూహించి యా దెస గుఱ్ఱముల బోనిమ్మని రాకుమారునకు జెప్పెను.

ఇరువురును అట్లు తూర్పుగా కొంతదవ్వేగునప్పటికి నొక చక్కని కమలాకరమును బొడగాంచిరి. ఇరువురును ఆ కాసారతోయముల స్నానమాడి దప్పిక దీర్చుకొని వారువములకు నీరిడి వాని నొకచో గట్టి శ్రమవాయ నొక లతానికుంజమున గూర్చుండిరి.

ఇంతలో నొక్క కన్యాలలామ సఖీజనపరివృతయై యక్కాసారంబు డాయం జనుదెంచెను. ఆ కన్యామణి సఖులతో జలకేళి సవరించి, కురు లార్చుకొనుటకై తీరమున గల నొక చలువరాతిపై గూర్చుండెను. ఆమె చెలికత్తె లింకను జలంబుల క్రీడించుచుండిరి. లతానికుంజమున గూరుచున్న వజ్రమకుటుండా లతాంగిని గాంచి పంచబాణవంచితుండై యామెవంకనే గనుగొనుచుండెను. ఆమెయు వజ్రమకుటుని గాంచి మోహాయత్తచిత్తయై, యాతఁడు జూచుచుండ కొన్ని శృంగార చేష్ట లొనరించెను. ఇంతలో నామె చెలికత్తెలును జలకేళి చాలించి గృహోన్ముఖులగుటకు సంసిద్ధులై యుండిరి. ఆమెయు వజ్రమకుటుని జూచుచు గూరుచున్న చెలు లనుమానింతురను భయంబున విధిలేక చెలులతో గూడ గృహాభిముఖయై నడువసాగెను. వజ్రమకుటుఁడామె చెలులతో జనుచు, నెడనెడ తన వాల్చూపుల దన్ను దిలకించుచు నరుగుచున్న నామెపైననే చూపుల నిలిపి యామెదిరోహితయగు వర కాదెసకే జూచుచుండెను. వజ్రమకుటుఁడా లతాంగిపోయిన వలనే జూచుచు యామెను గూర్చియే దలపోయుచు కొంత కాలము వేగించెను.

ఇంతవరకా లతానికుంజమున శ్రమవాయ నిద్రించుచున్న సుబుద్ధి మేలుకాంచెను. రాకుమారుండును దన మనోగతం బాతని కెఱుగ జేయ నిష్టములేక, యాతనితో నేమియుఁ జెప్పక గృహాభిముఖుల మగుటకుఁ బ్రయాణముగమ్మని బల్కెను. తదనంతరం బాయిరువురును బయనమై నిరపాయంబుగ దమ పురంబు జేరుకొనిరి. నాటినుండియు

రాకుమారుని మనోదర్పణమున దారుణీమణి ప్రతిబింబించుటం జేసి యితరేతర వ్యాపారంబులం బ్రసక్తిలేక తన యునుంగు జెలికాఁడగు సుబుద్ధితోనైన సరిగా మాటలాడక స్వప్నగతి నాతని నావలికి సాగనంపి యెల్లప్పు డొంటిగా నుండ కాలముపుచ్చుచుండెను.

ఇట్లు రాకుమారుఁ డా రాజనందనం దలఁపోయుచు, నామె శృంగారచేష్టల కేమైన నర్థ ముండునా యని విచారించుచు, ఆమె వియోగమున కచ్చెరువొందుచు బాహ్యప్రపంచమును మరచి నిద్రాహారంబుల సరకుగొనక కృశించుచుండెను. ఇట్లు కతిపయదినంబులు జరిగిన పిమ్మట మంత్రిసూనుం డొకనాఁ డేకాంతమున రాకుమారునితో నిట్లనియెను. "ఓయీ! నీ నడవడియం దపరిమితమగు మార్పు జూపట్టెను. మృగయావినోదార్థ మరణ్యముల కేగి వచ్చిననాటినుండియు ఆప్తమిత్రుడనైన నాతోనైన సరిగా మాటలాడవు. ఆహారనిద్రావిహారముల సరకుసేయక నొంటిగా గూర్చుండి యేదో విచారించుచుండెదవు. పరికించి చూడ నీ మనం బొక్క లతాంగిపై దగుల్కొనినట్లు దోచుచుండెను. నిక్క మెఱింగించిన నీకా తరుణీమణి నొనగూర్చి నీ కపరిమితామోద మొనగూర్చెదను." అని పెక్కు విధముల బల్కిన మంత్రిసూనునకు భూపాలసూనుఁ డిట్లనియెను. "మిత్రమా! నా యవస్థ యేమని వక్కాణింతును. ఇతరులు విన్న పరిహసింతురేమో యను సంశయముచే నా మనోగతం బెవరికిని దెలుపక నా పరితాపభారము నడంచుకొనుటకు ననేక విధముల బ్రయత్నించుచుంటిని గాని యా నా ప్రయత్నములే యప్రయత్నములుగా నీకు నా మనోగతి నెఱింగించుటకు బోధకమగు నట్లొనర్చెను. ఇంకను దాపరిక మొనరింప నేల వినుము. నాఁ డా వనమధ్యమున కాసారతీరమున నొక్క లతానికుంజమున విశ్రమించియుండ నీవు నిద్రించితివి. నేను నలుదెసల బరికించుచుండ నొక కన్యాలలామసఖీజనపరివేష్టితయై జను

దెంచి యా కాసారమున జలకేళిసవరించి తీరమునగల చలువరాతి తిన్నెపై గూర్చుండి కురు లార్చుకొనుచుండెను. త్రిజగన్మోహనమైన యామె రూపము నా హృదయము నాకర్షించినది. ఆమెయు నను గాంచి కొన్ని శృంగారచేష్టలొనరించి విధిలేక చెలులతో నరిగినది." అని పల్కి వెండియు నాలతాంగి యొనర్చిన శృంగారచేష్టల నాద్యంతముగా వివరించిన మంత్రిసూనుఁ డించుకసేపాలోచించి మిత్రున కిట్లనియెను. "మిత్రమా! చింతింపకుము. యామె శృంగారచేష్టల రూపంబున తన వృత్తాంత మాద్యంత మెఱిఁగించుటయెగాక తనను నీపై గూర్మిగలదనియు, తన వెనువెంట నిన్నరుదెమ్మనియు సూచించినది. విను మాలతాంగి యొనర్చిన శృంగారచేష్టల వివరణము. తామరపూవును చెవిదోఁపుటచే కర్ణోత్పలుఁడను భూపాలు దేశంబున నుంటిననియు, ఆ దనుజముచే దంతసంఘట్టన మాచరించుటచే దాను దంతఘాతకుఁ డను మంత్రిసత్తముని కుమార్తెననియు, పద్మమును తన పాదములక్రింద నుంచుటవలన తన నామధేయము పద్మావతి యనియును, ఆ పద్మమును తన యురస్సీమనానుటచే నీవే తనకు ప్రాణనాథుఁడవనియును, పద్మమును యీడ్చుటచే తన వెనువెంట రావలసినదనియును చెలులతో నరుగుటచే గూఢముగా నన్నుగనయ నలయుననుటయుగాని యన్యముగాదు గావున విచారము నక్కఱ యుండుము. నీ కాంతారత్నమును లభించు మార్గ ముపదేశించెదను. అని యూరటబల్కి, మరల మృగయావినోదవ్యాజమున బయలుదేరి కర్ణోత్పలుని పురీవరంబగు రత్నావతి కరుగవలయు" నని వక్కాణించెను.

వజ్రముకుటుఁడును సంతోషితస్వాంతుఁడై తన జనకునికడ ననుజ్ఞ గైకొని, రహస్యముగా కొంత రొక్కంబు చేజిక్కించుకొని సుబుద్ధితోడను మఱికొంత పరివారముతోడను విపినభూముల కేగి—పరివారమును

తప్పించుకొని సుబుద్ధితోఁ గలసి యొక గూఢమార్గంబున రత్నావళీపురం బునఁ జేరుకొనియెను.

ఆ పురీవరంబున నొక చోట భుజించి నాఁటికాయాసముదీర విశ్రమించి నాఁటి సాయంకాలమున పురీవరంబునఁ దిరుగుచు నొక వృద్ధాంగన మంత్రి యంతఃపురంబునకుఁ దరచుగాఁ బోవుచుండునని యెఱింగిరి. ఆ దినావసాన సమయమున నాజరఠగృహమున కేగి. నాటిరాత్రి నావృద్ధాంగనకుఁ గొంతద్రవ్యమిచ్చి యచ్చటనే భుజించి విశ్రమించిరి. నాఁడు మొదలుగఁ గొన్ని దినంబుల వఱకచ్చటనే యుండి యావృద్ధురాలికి ధన మొసంగుచు క్రమక్రమముగా నామెను తమవలలోఁ వైచుకొనిరి. ఆవృద్ధురాలు వారొసంగు ద్రవ్యమునఁ గాంక్షించి వారేమి చేయుమని నను చేయుటకు సంసిద్ధురాలై యుండెను. ఇట్లుండ నొకనాఁ డామెకు మంత్రికుమారుఁ డొక దీనారమొసంగి దంతఘాతకమంత్రి కుమార్తె యగు పద్మావతికి తమరాక నెఱిఁగింపుమని యాజ్ఞాపించెను. ఆ వృద్ధాం గనయు ద్రవ్యమునఁ గాంక్షించి పద్మావతివలన గూడ నధికము ద్రవ్యము లభింపగలదను నమ్మకముతోఁ నామెకడ కేతెంచి యామెతోఁ రహస్యముగా నోలతాంగీ! నీ వానాఁడు కాసారము వెంట నేపురుషునిగాంచి శృంగారచేష్టల పద్మముతోఁ నొనరించి యుంటివో యా రాకుమారుఁ డరుదెంచి నీ కటాక్షము నాశించి నా గృహమున నున్నాఁడని వచించెను. అంత పద్మావతి తన పదివేళ్ళకును కర్పూర ములలఁదుకొని దాని రెండు గండభాగములందునను ముద్రలుంచి పొమ్మని సాగనంపెను. ఎంతో బహుమానము లభించునను యాశతోఁ నరు దెంచిన యా వృద్ధాంగన బహుమానము లభింపనందులకు పెద్దగా చింతించి గృహమున కరుదెంచి రాకుమారున కిట్లనియె. "అయ్యా! నిక్కముగా నా కరుణాసునకు సమయందు సుకృప యుండునని భావించి యిట్టి శుభవార్త గొంచుబోయిన నాకు విశేషబహుమా

తనకు బహుమానము లభింపదని చింతించుచు గృహాభిముఖి యయ్యెను.

రాకుమారుఁడును మంత్రిసూనుఁడును గూర్చుండి యున్న సమయమున నామె దాపోయివచ్చిన తెరంగును పద్మావతి చేసెలును తేటతెల్లముగా నెఱింగించెను. అంత రాకుమారుఁడామె చేసెల నర్థమెఱుంగక చింతించుచుండ మంత్రిసూనుఁ డించుకఁ దడవాలోచించి "మిత్రమా! విచారింపకుము. ఆమె పుష్పవతియై యున్నది. అకారణముననే యామె వెనుకఁ దిరిగి నాకు మూఁడువేళ్ళతో గుర్తించెను. సరోవర్ణన సూచకంబుగ నాలతాన్విలక్షణముతో గుర్తించెను" అని యూరడఁ బల్కెను.

*　　　　*　　　　*　　　　*

మూఁడు దినంబు లరిగిన పిమ్మట మంత్రిసూనుఁ డావృద్ధాంగనకుఁ గొన్ని దీనారముల నొసంగి మరల పద్మావతి చెంతకుఁబోయి రమ్మని పంపెను. పద్మావతి యావృద్ధాంగన యరుదెంచుటతోడనే యెదురుగాఁజని తోడ్కొని సముచితాసనంబుల నామె నాదరించి వినోదముగా కొంత తడవామెతో ప్రసంగించి యామెతో నిట్లనియెను. అవ్వా! నీ వరుదెంచిన మార్గమున బోవలదు. అట నొక మదపుటేనుఁగు కట్లు విదలించుకొని యల్లరిచేయుచున్నదట కావున నీ మార్గమున బోయిన సుఖముగా నింటికి బోగలవని బల్కి యామె నొకపెడమార్గమునఁ బంపి యావృక్షమధిరోహించి ప్రహరీగోడదాఁటి పొమ్మనియెను. అవృద్ధాంగనయు బహుమానము దొరకనందుకు చింతించుచు బహుమతి దొరకకున్నను వెనుకటివలె పద్మావతిచే ప్రహారములు తగులకుండుటకుఁ గొంత సంతసించుచు గృహంబున కరిగెను.

మంత్రిసూనుఁడును రాకుమారుఁడును, యావృద్ధాంగన యరుదెంచుచుండుటగాంచి యుపాయమును గనిపెట్టియుండుటచే నీమె పద్మావతి చెప్పినోయని మాత్రము పలుమారు పలికిరి. తాను దానిని గమనించి పద్మా

పతి తన్నావరించిన దనియును తన్ను తానేగిన మార్గమున గాక వేరొక (రజ్జుమార్గమున గ్రిందకు దింపి) మార్గమున గృహమున కంపియుండెననియు దెల్పెను. తనవృత్తాంత మాలించియు నెమ్మనదాయెనే యని రాజకుమారుడు మరల విచారించెను. అంత మంత్రిసూనుఁడు ఓయీ విచారింపకుము. ఆలతాంగి నీకత్తైమె పరులెవ్వరేని యీవృత్తాంతము విన్న నగుబాటు సేయుదురని తలంచి బహిరంగముగా నిను రమ్మని చెప్పలేదు; కాని నీయం దపరిమితానురాగము గలిగి యుండుటచే నిన్ను యెట్లయినను దన సౌధమునకు రప్పించుకొనదలచి, బహిరంగముగా నరుదెంచిన నెవ్వరైన గనుగొందురేమో యను భయంబు చెందున నిగూఢముగా రమ్మని సూచించుటకై యీ వృద్ధాంగనను రహస్యముగా దనమేడపై నుండి రజ్జుమార్గమున దింపినది. ఇంతియగాక బహిరంగముగా రావలదనియు, నిగూఢమార్గముననే రావలయుననియు ఆ మార్గమును నీకు దెలుపవలయు ననియు నా వృద్ధురాలిని నృత్యోపరోహణ మాచరింపి బొమ్మని నియోగించెను. ఇదే నాపల్కుయదార్థ మీవృద్ధురాలివలననే దేటతెల్లము గాగలదు. "అనిపల్కి" అవ్వా! నీవు వృక్షమున్నునుండి ప్రహరీదాటి యేసందులోనికి, దిగితివో యట జనసంచారము సుస్వల్పమై యుండునుగదా యని ప్రశ్నించెను. ఆ సందు జనసంచారము పగలు తక్కువగా నుండుననియు రాత్రిభాగమున నట జనసంచారమిసుమంతయు నుండదని వచించెను. తదుపరి మంత్రిసూనుఁడు దామెవలన నా సందు గుర్తుల దెలిసికొని రాజకుమారున కిట్లనియెను. నే బోయి యద్దానిని జూచివత్తును యీ రాత్రి నిన్నచటికి దోడ్కొని బోయెద చింత దక్కియుండుమని వచించి వెడలి పోయెను. రాజకుమారుఁడు తనకిట్లు మహోపకార మాచరించిన యా వృద్ధురాలిని బహూకరించెను.

నాటి నిశాసమయమున మంత్రిసూనుఁడు తాను గుర్తించుకొని

వచ్చిన వీధికి రాజకుమారుని దోడ్కొనిపోయి యొక వృక్షమును జూపి యా వృక్షావరోహణ మాచరించి ప్రహరీ దాటమనియు అటనే గొంత కాలమునకొరకు నిరీక్షించియుండి లోనికిఁ దోడ్కొని పోవుదు రనియు జెప్పి పంపెను.

* * * *

రాకుమారుఁడు సుఖంబుగ బద్మావతీ లతాంగి యంతఃపురంబు ప్రవేశించి యామెతో యిష్టాలాపవినోదంబుల బెద్దయుం బ్రొద్దు గడపెను. వేకువ యైన తోడనే నిలయంబున కేగవలయునని యత్నించుచుండ పద్మావతి వారించి "నాథా! తమ వియోగమున నింత దనుక కృశించి కృశించి యున్నినాళ్లకు మిమ్ము గలసికొంటిని. ఇక మిమ్ము విడచి నిముష మైనను నివసింప నోర్వను. నా యంతఃపురంబుననే తమ కొక రహస్యాగారము నేర్పాటు చేసియున్నాను. అందు తమ రున్న యెడల తమ కెట్టి కొరంతయు గలుగకుండ జూచుటయే గాక యవకాశము లభించినప్పు డెల్ల తమతోడనే యుందును. ఇందులకు తమ రవశ్యము సమ్మతింతురని దలంతును." అని సప్రేమంబుగా బల్కుటయు నాతఁడు తన ప్రియురాలి కెదురాడనేరక యచ్చటనే నిలిచిపోయెను. అనుదినమును ప్రియురాలి మాట కెదురాడనేరక యచ్చటనే రహస్యమందిరముననే నిలచియుండెను. క్రమ క్రమముగా గొన్ని దినములకు వజ్రమకుటుఁడు తాను వజ్రమకుటుఁడ ననియును మంత్రిసూనునితో తాను పద్మావతికొరకై యరుదెంచి జరతాంగన యింట వసించియుండుటయును, మంత్రిసూనుఁడు తనకు పద్మావతి సాంగత్యలాభ మొనగూర్చె ననుమాటయును మరచి పద్మావతి ప్రేమలతాపాశబద్ధుఁడై యితరమెఱుఁగక వర్తించుచుండెను.

రాకుమారుఁడు బద్మావతిఁ గలసిన నాటినుండి యారుమాసముల వరకు నిరీక్షించి యింతవరకును రాకుండుటచే నాతఁడు తన్ను మరచి

యుండినట్లుగా నిశ్చయించి యెట్లైనను ఆతనికి దనవృత్తాంతము దెలుపవలయునని నిశ్చయించి యొకకమ్మ వ్రాసి యా వృద్ధాంగన చేతికొసంగి రాకుమారున కందజేయుమనియు అట్లొనర్చినచో మంచి బహుమాన మొసంగుదు ననియును జెప్పెను. సంతసంబున నా వృద్ధురాలా చీటిని రాకుమారున కందజేసెను.

రాకుమారుడా చీటి యందిట్లుండుట విలోకించెను. "మిత్రులను, తల్లిదండ్రులను, గురువులను, పితృసమానులను మరచి వర్తించువారల నమ్మియుండరాదు." అనియున్న చీటిని జూచి యందలి భావమును గుర్తెరిగియు నది యెవ్వనిచే బంపబడియుండెనో గుర్తింపనేరక మిన్నకుండెను. తదుపరి గొన్ని దినంబు లరిగినపిమ్మట నొక్కనాడు బద్మావతితో జతురంగమాడుచుండగా నాతని మంత్రి యొక బంటుచే గొట్టివేయబడుటకు సిద్ధముగా నుండెను. ఆ సమయమున నాతడు వేరొక యెత్తు వేయుటకు ప్రయత్నించుచుండగా బద్మావతి "నాథా! మీ మంత్రిమాట దలంపరు. మంత్రిలేని చతురంగబలమంతయు వ్యర్థముగదా!" అనెను. ఆపల్కు లాలించినతోడనే — సుబుద్ధి యాతని జ్ఞప్తికివచ్చెను. తోడనే యాతడు హాహా! ఎంతపని "ఎంతపని జేసితిని" అని పలుకుచు సోఫాపై వ్రాలెను. బద్మావతియు యందులకుగల కారణ మూహయలేక "నాథా! యేమిది. ఇట్లైతి రేమి" అని ప్రశ్నించెను. అంత నాతడు తాను మంత్రిసూనునితో సచ్చాటి కరుదెంచు టాదిగాగల సర్వవృత్తాంతమును వివరించెను. వెండియు నాతడు "తపస్వినీమణీ! నీవొనరించిన శృంగారచేష్టల కన్నిటి కాతడే నీయునికి మెలకింగించుచు నీ సాంగత్యము నాకు లభింపజేసెను. అట్టి బుద్ధివైభవముగల మంత్రిసత్తము నీయూరనే యుంచి యాతని మాటనే మరచి ప్రవర్తించుచుంటిని." అని పల్కెను. ఆ పల్కులవిని పద్మావతియు యది యనుచితమనియు, నేడేగి మంత్రి

సనియు జెప్పి నాటి వేకువజామున నాతని రహస్యమార్గమున పురము లోని కంపెను.

* * * * *

సుబుద్ధి మిత్రునియాగమన మపేక్షించుచు ఇంకను, యాతఁడు జాగొనరించిన ముందు మున్దెట్టి యనర్థము లుత్పన్నమగునో యను భయంబున దల్లడిల్లుచుండెను. అట్టిచో నొకనాడు వజ్రమకుటుఁడు వేకువనే యరుదెంచి సుబుద్ధి పదములపై వ్రాలి మన్నింపవలయునని వేడుకొనెను. సుబుద్ధి యాతఁడు నిరపాయంబుగ వచ్చుటకు సంతస మంది "మన్నించుటకు నీవొనర్చిన దోషమేమున్నది. కానిమ్ము కోటలోని విశేషము లెట్లున్నవి. అటనున్న దినములలో నీయునికి యితరుల కెవ్వరికిఁ దెలియకుండెనే, ఇన్ని దినములకు నా సంగతి జ్ఞప్తికెట్లు వచ్చినది." అని యనేకములుగా నాతని బ్రశ్నించెను. రాకుమారుఁడు తాను నిరపాయంబుగ గోటలో నుంటిననియు, చతురంగమున తనమంత్రిపోవనున్న సమయమున బద్మావతి మంత్రిమాట ముందు జూడుఁడని హెచ్చరించుటచే సుబుద్ధి జ్ఞప్తికి వచ్చుటయు, మున్నగాగల విషయంబుల గొన్నిటిని దెల్పెను.

అనంతర మిరువురును గొంతతడ విష్టాగోష్ఠిలోనుండి కాలోచిత కృత్యముల నేర్చుకొనిరి. మంత్రిసూనుఁడు గోరుటవలనను, పగటిపూట నంతఃపురంబు ప్రవేశించుటకు వలను గాకుండుటచేతను రాకుమారుఁ డచ్చటనే యాదినము గడుప నిశ్చయించుకొనెను. అట పద్మావతియు తన మనంబున నిట్లు దలపోయ సాగెను. "నిక్కమున నీరాజపుత్రుఁడు మేధావి. చాకచక్య సంపన్నుఁడు, పరేంగితజ్ఞాన ధురంధరుఁడు కాని నాపైనగల ప్రేమానురాగము లధికమగుటచే యితర మెఱుంగనేరక నా శృంగారచేష్టల మంత్రిసూనునకు దెలిపి యాతని సహాయమున నిచ్చటి కరుదెంచెను. ఉపాయంబున నాతని నిక్కడకు బంపినవాఁడు

క్షణములో మరల నేదో యుపాయంబున నీతని నిచ్చటినుండి దోడ్కొని పోవగలఁడు. ఈతనిబాసి యొక్క నిముషమైన నిలువ జాలను. కావున మంత్రికుమారు నీతనినుండి వేరుచేయవలయును. ఇంతటి స్నేహము గలవారల విడదీయుట సులభసాధ్యము గాజాలదు. గావున నుపాయాంతరమున మంత్రిసూనుని మట్టుబెట్టుటయే సరియైన మార్గము. అట్లైనచో నా జీవితేశ్వరుని బాసి యుండవలసిన యగత్య ముండదు." అని వితర్కించుకొని కొన్ని విషభక్ష్యముల దయారుచేసి యొక చేటికను బిలచి "చేటీ! నీకార్యసాధన కళానిపుణత్వము జూప సమయ మాసన్నమయ్యెను. ఇవే విషభక్ష్యములు. వీనిని మన గృహంబున కరుదెంచుచుండు వృద్ధురాలి గృహంబున నా మనోహరుఁడును మంత్రిసూనుఁడును గలరు. వారిలో మంత్రిసూనున కివి యొసంగి నావిభు నిచ్చటికి దోడ్కొని రావలయును. ఈవిషభక్ష్యముల నా మంత్రిసూనుఁడు భుజించిన నేను నాజీవితేశ్వరునితో హాయిగా నిచ్చటనే చిరకాలముండనచ్చును. కావున నెట్లైన నీ కార్యము సాధింపుము. అట్లొనర్చిన నిన్ను మిక్కిలిగా బహూకరింతును. అని బల్కి యామెచే నావిషభక్ష్యముల మంత్రిసూనునకుఁబంపెను.

వజ్రమకుటుఁడును సుబుద్ధియు వినోదముగా మాటలాడునపుడు చేటిక విషభక్ష్యములతో నచ్చటి కరుదెంచి మంత్రిసూనున కయ్యవి సమర్పించి రాకుమారునితో నిట్లనియెను. "దేవా! తమరాక గోరి మా పద్మావతీ కుమారి యాహారంబు గొనక నిరీక్షించు చున్నది. తమ్ము నా వెనువెంట దోడ్కొని రమ్మని నియోగించెను. తదుపరి తమయాజ్ఞ" అని మిన్నకుండుటయు మంత్రిసూనుఁ డిట్లనియెను. తన్వీ! నీ వేగి యామెతో మా మిత్రుఁ డరుదెంచు చుండెనని వచింపుము. నీ వెనుకనే యాతఁడును త్వరలో రాగలఁడు." అని బల్కి యామెను బంపివేసెను.

"మిత్రమా! పద్మావతితో నేనామె శృంగారచేష్టల కర్థముజెప్పి నట్లు వచించితివా లేదా?" అని మంత్రిసూనుడు ప్రశ్నించెను. రాకుమారుడు "వచించితిని! ఇందు దోసగేమున్నది." అని మరల ప్రశ్నించెను. "ఏమున్నది ఏమియును లేదు. నీవట్లు వచించుటచేతనే యిప్పుడీ భక్ష్యములు నా కొరకై నిర్దేశింపబడి పంపబడినవి. నీవు వీని నుపయోగింపరాదని యా చేటిక సూచించి వెడలిపోయెను గమనించితివా!" అని యెను.

అనంతర మిరువురును యిట్లు ప్రసంగించిరి.

రాకుమా—ఎట్లు సూచించినది.

మంత్రి—నీకొరకాహారము గొనక పద్మావతి నిరీక్షించుచున్నదని.

రాకు—అయినచో—

మంత్రి—అయిన నేమున్నది. వీనిని భుజింపక పద్మావతితో భుజింప రమ్మనిగదా! ఆమె యింగితము.

రాకు—అయిన దప్పేమున్నది.

మంత్రి—మిత్రమా! యింకను గ్రహింపలేవా? ఇవి విషపూరితములు.

రాకు—నమ్మజాలను. నా యనుంగు ప్రేయసి నా మిత్రునకు విష భక్ష్యములు బంపజూచునా? బంపునా?

మంత్రి—పంపినది. నీ యనుంగు ప్రేయసియే గావచ్చును.

రాకు—పంపినదే యనుకొనుము. అద్దానివలన ప్రయోజనమేమి?

మంత్రి—ఎంతయో ప్రయోజన మున్నది.

అని పల్కుచు మంత్రిసూనుడు అందున్న భక్ష్యములలో నొక్కదాని నెత్తి సమీపమున దిరుగాడుచున్న నొక శ్వానమున కద్దానిని బడవైచెను. ఆ శునకమద్దాని భక్షించి విలవిల దన్నుకొని క్షణమాత్రమున మరణించెను.

మంత్రి—మిత్రమా! గంటివా నా పల్కుల యధార్థము. ఇద్దాని వలన ప్రయోజనమా! వినుము. నిన్న దనకడనుండి యెట్టులైనను విడదీసి మనపురంబునకు దోడ్కొని పోగలనను భయంబున నను మట్టుబెట్ట సంకల్పించు కొనియెను.

రాకు—ఇందుల కామెను దగినట్లుగా శిక్షింపవలయును.

మంత్రి—ఆమెపై గినియకుము. ఆమె నీపై గల మోహంబున నిట్లాచరింప సాహసించెనుగాని యామెకు సహజముగ నాపై క్రోధములేదు. ఆమెను మనమెట్టులైనను దక్కించుకొని యామెతో మన పురంబునకుం బోవలయును. అందులకొక చక్కని యుపాయంబుగల దాలింపుము. అని యాతని కేకాంతమున నద్దియో బోధించి పద్మావతి సౌధమునకు బోయిరమ్మని బంపెను.

రాకుమారుడు పద్మావతిం జేరి యిష్టాలాపవినోదంబుల బెద్దయు ప్రొద్దుగడపి యామెచే నధికముగ బుష్పాసవమును ద్రావించెను. ఆమైకమున నామె యొడలెఱుంగక నిద్రించుసమయమున తాను గుప్తముగా దాచియుంచిన చిన్నత్రిశూలమును పైకిదీసి యామె జఘనప్రదేశమున నద్దానిని గ్రుచ్చి యద్దాని నూడదీసి యామె మెడయందున్న నొక యమూల్యరత్నహారమునుం జేజిక్కించుకొని సింహద్వారమార్గమున వెడలిపోయెను.

రాకుమారుడు మంత్రిసూనుని గలసికొని యావృద్ధురాలిగృహంబు విడచి నా యర్ధరాత్రంబుననే నెచ్చటికో వెడలిపోయిరి. మరునాడుదయమున మంత్రిసూనుడు తన వేషమును మార్చుకొని యొకజడదారి యయ్యెను. రాకుమారుం డాతని శిష్యుడయ్యెను. వారిరువురును సమీపారణ్యములనుండి పురము ప్రవేశించువారివలె మరల పట్టణము బ్రవేశించి యెవ్వరితోడం బలుకక రుద్రభూమి సమీపంబునం గల యొక వటవృక్షము నీడను దమనివాస మేర్పరచి నాలుగైదు దుంగల గొట్టి

వాటి కగ్ని దరిగొల్పి హోమగుండముగా నేర్పరచిరి. వేయేల నాయిరు వురును యాస్థలమును దమవేషముల కనుగుణ్యముగా నుండునట్లుగాం నొనరించిరి. అనంతరము మంత్రిసూనుండు తనజోలినుండి రత్నహార మును వెలికిదీసి రాకుమారున కిడి. "ఓయీ! నీవీహారమును గొని యంగడివీధికిం గొనిపోయి యత్యధికమగు వెలజెప్పి యెవ్వరికిని యమ్మక హారముయొక్క వృత్తాంతమును వెల్లడిసేయుము. నిన్నెవ్వరేని నిర్బం ధించినయెడల నీకీహార మెచ్చట లభించినదని యెవ్వరైన ప్రశ్నించిన యెడల మా గురువుగారిద్దాని నొసంగి యమ్ముకొని రమ్మని జెప్పిరని మాత్రమే వచింపుము. రాజభటులెవ్వరేని నిను భూపాలునియొద్దకు గొనిపోయిన యెడల నా తనివిగూడ నిట్టులే వచింపుచు ఆతండా హారములయొక్క వృత్తాంతమాద్యంతము కనఁగొన నా సమీపమున కరుదెంచునటు జేయుము." అని జెప్పిపంపెను.

వజ్రమకుటుండా హారమును యంగడివీధికి గొనిపోయి యమ్మజూ పెను. పెక్కురాతని కాషాయాంబరముల దిలకించి యట్టి యమూల్య మైనహారమీతని కెట్లువచ్చి యుండునని మూలోచింపసాగిరి. మరికొంద రీతండు మెచ్చుటనో దొంగతనమునర్చి యప్పుడు లభించిన యీహార మును యిప్పుడమ్మ జూపుచుండెనని దలంచిరి. మరికొంత తేతం డేమహా రాజునకో నమ్మికగుదురి జ్యోతిషము జెప్పుటవలననో లేక వైద్యవి ద్యాప్రవీణత జూపియుండుట వలననో బహుమానముగా నొసంగి యుండెనేమో యని దలంచుచుండిరి. మంచి దలంచువా రరుదుగా నుందురనుట వింతగాదు. నిక్కముగ నెవ్వనికైన నొక్కమారుగా ధనము లభింప, ప్రజలు దాని నిజస్థితి నరయక, నరయుట కూహింప కేదో యొక నేరమాతని యందారోపణ మొనరించి యేజూదమున నో దొంగతనముననో ధనము గణించెనేగాని వాని స్వప్రయోజకత్వము సన్మార్గమును వినియోగించి ధనమును సంపాదింపలేదని పలుకుచుం

డుట సహజము...క్రమక్రమముగా నాతఁడెచ్చటనో దొంగతనముగా హారమును గొనివచ్చి నట్లా నోటినుండి యానోటికి ప్రాకెను. రాజభటులకు గూడ నీవృత్తాంతము దెలియవచ్చెను. అంత గొందరు రాజభటులాతనికడ కరుదెంచి "ఓయీ! బిచ్చగాని పగిదినున్న నీకీహారమెచ్చట లభించినది; పరికింప మహారాజాంతఃపురములలో నుండదగిన హారమును నీ వమ్ముటకు యత్నించుట జూడ నిన్ననుమానింపవలసి వచ్చుచున్నది గావున రాజుసన్నిధికిఁ రమ్ము." అని బల్కుచు యాతని దమ వెంట భూపాలునియొద్దకుఁ గొనిపోయిరి.

"భూపాలుడాతనిజూచి నీకీహార మెట్లు లభించినది." అని ప్రశ్నించెను. అంత నాతఁడు దేవా! ఇయ్యది మా గురువుగారి కెట్లు లభించినదో నాకు దెలియదు. వారియ్యది నా కొసంగి నమ్ముకొని రమ్మని బంపినారు. త్రికాలజ్ఞులగు వారల కియ్యది యెట్లు లభించినదో కించిదజ్ఞుఁడనగు నే నెట్లు దెలియజాలుదును ?

భూపాలతిలకుం డగు కర్ణోత్పలుఁడా తని పల్కు లాలించి "ఓయీ నీ గురువుగారెవ్వరు వారెచ్చటనుండిరి? వారిని నాకుఁ జూపింపగలవా?" యని ప్రశ్నించెను. అంత యతివేషమున నున్న వజ్రమకుటుఁ డాతని కిట్లనియెను. "దేవా! రెండుదినములకు బూర్వమే మే మీగ్రామమున కరుదెంచినారము. ఈ పురంబునకు ప్రాగ్దిశయందు గల రుద్రభూమి సమీపమున నున్నవట వృక్షముచెంత బసదిగియుంటిమి. గురువుగారు నిష్ఠాగరిష్ఠులగు కతమున పురము ప్రవేశింపరు. అందుచే నీ హారము నమ్ముకొని రమ్మని నన్ను నియమించినారు. తమరు నాతో నరుదెంచినచో వారిని జూపగలను." వినయవిధేయత లుట్టిపడ బల్కు నాతని వచనంబు లాలించి విమలాంతః కరణుండగు భూపాలతిలకుండు ఆతని పల్కులనిక్కముగా భావించి యాతనితో వటవృక్షమును జేరబోయెను.

కర్ణోత్పలుఁడా వటవృక్షము చెంగట హోమగుండము చెంతగూ

ర్చుండి హోమమాచరించుచున్న సుబుద్ధిని బొడగాంచి నిక్కంపు యోగిగా దలపోసి సండప్రమాణము లాచరించెను. తపోనిష్ఠయం దున్న వానిపగిది నా తేడు మాటలాడక సమీపమునను న్న వ్యాఘ్రా జినముపై కూర్చుండుడని కనుసన్న జేసెను. వజ్రమకుటుఁడయ్యది గమనించి భూపాలునితో "దేవా! గురువులవారు యోగసమాధిలో నున్నారు యించుక తడవీవ్యాఘ్రాజినముపై గూర్చుండుము. ఇంతలో హోమము పూర్తికాగలదు. అప్పుడు తమతో సావకాశముగా మా ట్లాడగలరు." అని బల్కి యాతని నొకవ్యాఘ్రాజినముపై గూర్చుండ జేసెను. తదుపరి కొంతతడవున కాహోమమును పూర్తిగావించి సుబు ద్ధిభూపాలపుంగవుని సమీపమున కరుదెంచెను.

భూపాలుఁడాతని ప్రవర్తనమంతయు దిలకించి యెంతయు సంత సించి దనమనంబున నిట్లు భావించుకొనియెను. ఈ తని శిష్యుఁడీతఁడు త్రికాలవేదియని వక్కాణించు చున్నాడు. ఈ తని ప్రవర్తనముగూడ యందుల కనుగుణ్యముగానే యున్నది. ఇట్టివాని కేమహారాజొసంగి నను యిట్టిహారమొసంగి యుండవచ్చును. అని భావించుకొని తానరు దెంచిన కార్యమును మరచి కొంతతడవు వేదాంతప్రసంగము గావించి చూచెను. అంత సంతుష్టహృదయాంతరంగుఁడై లేచి నిలువబడి మరల నమస్కరించి తన కోరడ కనుమతింపవలయునని మునిపుంగవుని వేడు కొనియెను. అంత నాజడదారియు ఆతని గాంచి చిరునవ్వున "ఓయీ! ఒక సందియముతో నరుదెంచి యది నివారించు కొనకుండ పోవుచుం టివి. నీ మనమున నిచ్చట దోచినది మాత్రము సత్యముకాదని వచిం పగలను. సావధానుఁడవై గూర్చున్న యెడల నీ కా హారము లభించిన యుదంతమంతయు వివరింపగలను." అనిబల్కెను. ఆపల్కు లాలించి యా హారముయొక్క వృత్తాంత మాలింపవలయునను కుతూహలమున మరల గూర్చుండెను. అంత యోగి యిట్లని జెప్పెను.

"ఓయీ! గతదిన మర్ధరాత్రమున యొక కన్యకామణి యీ హార మును దాల్చి యీ సమీపమున నున్న ప్రేతభూమి కరుదెంచి యచట యొకశవమును గోతినుండి పెకలించి భక్షించు చుండెను. ఇంతలో నొక నక్కలగుంపు ఊళలవైచుచు నామెను సమీపించి యా శవఖండముల లాగుకొని పోయెను. శవమాంసమును దిని మత్తిలియున్న యా మానిని యొడలెఱుంగ జాలక సమీపమున కరుదెంచి జపమాలికతో నున్న నా చేయి బట్టుకొని లాగెను. ఇంతయోగ భంగమగుటచే నేను మేలుకాంచి సమీపమున నున్న యీ త్రిశూలముచే నామెను బొడిచితిని; యది యామె జఘనప్రదేశమున దగిలి యుండునని దోచుచున్నది. ఆమెయు పెద్దపెట్టున రోదన మొనరించుచు వెడలిపోవ నుంకించెను. ఆమెను నిలిపి యామె వృత్తాంతమాద్యంతము నెఱుంగుటకై యామె మెడపట్టుకొన బోయితిని. అంతటామె సులువుగా దప్పించుకొనియెను గాని యామె మెడలోని యీ హారము మాత్రము నాచే జిక్కవడెను. ఆమెయు హారముకొరకు నిలచిన తనగుట్టు బట్టబయలగు ననుభయంబున రోదన మాచరించుచు పురంబులోనికి పారిపోయెను. తదనంతరము దివ్యదృష్టిని బరికించి చూచితిని. యీ మానిని యనుదిన మొక రక్కసిచే నావేశింపబడి యిట్లొనర్చు చున్నదనియును; అనుదినమును శవము లభింపకున్న నే మనుజునినైన వధించి భక్షించు చుండుననియును, ముందు ముందు కొలదికాలములో పట్టణమునంతయు ధ్వంసము చేయగలదనియును తెలియవచ్చెను."

అని బల్కిన యమ్మునిని వాక్యముల నాలించి యాహార మాగ్రామ నివాసులదే యని దెలియుటచే నయ్యది పరిశీలనతో దిలకింపసాగెను. కొంతవడి పరీక్షించి యయ్యది దనయమాత్యుండగు దంతఘోషకమంత్రి కుమార్తెయగు పద్మావతికి చిన్నతనమున దాను బహుమానముగా నొసంగినదిగా దెలిసికొనియెను. తదనంతర మాతండా మానితో నిట

నియెను. "అయ్యా! ఈమానిని వలన మా పురంబున కనర్థము రాకుండ జేయగల మార్గమెద్దియైన యున్నయెడల నెఱిఁగించి నన్ను కృతార్థుని జేయవలయును. అని వేడుకొనెను. "ఓయీ! నీ పురంబును గాపాడుట కొక్కటే మార్గము గోచరించు చున్నది. యామెను సమీపమందెక్కడను గాక దూరమగు నరణ్యభూముల డించిరావలయును. అట్లైనచో నీ పురంబు రక్షింపబడును." అని మానిచెప్పగా విని భూపాలుఁడా తని యనుజ్ఞ గొని చనియెను.

మరునాడు భూపాలుఁడు మరల చనుదెంచి మానిపుంగవునితో నయ్యా! ఆ మానిని దంతఘాతకమంత్రి కుమార్తె యా జఘనముపై త్రిశూలపుగుర్తుండెను. ఆమెను యడవి లోడించిరమ్మని యాజ్ఞాపించితిని. రేపటి సూర్యోదయమున నామెను యీ పురంబున కుత్తరముగా బదియోజనముల దూరమున నున్న యడవిలో డించిరమ్మని నియమించితిని. అని వచించి గొంతతడవు వేదాంతగోష్ఠియందు గడపిచనియెను.

వేకువజామున నే మిత్రులిరువురును గలసి బయనమై గ్రామమున కుత్తరమున నున్న యరణ్యముఁ బ్రవేశించి రాజభటులు పద్మావతిని దోడ్కొని వచ్చుచుండుట గాంచి యొక మరుగు ప్రదేశమున దాగియుండిరి. రాజభటులామెను యరణ్యమధ్యమునడించి తరలిపోయిరి. వారి వెనువెంటనే గూఢముగా వెంబడించుచున్న మిత్రులిరువురును యామెను గలసికొని యామె భయంబు వాపి యామెను దమపట్టణమునకు దోడ్కొని చనిరి.

దన కుమారీమణి విధివశంబున బ్రహ్మరక్కసునిచే నావేశింపబడి పురంబు నాశనము చేయుచున్నదని—యామెను యడవి లోడించి వచ్చిరని వినినతోడనే దంత ఘాతకుఁడు పుత్రికావియోగ దుఃఖమున మరణించెను. అతని సతీమణి సతీతిలక మగుటచే యాతనితో సహగమన మాచరించెను.

విక్రమార్క భూపాలా! వింటివిగదా యీ చక్కని కథ ఆ యిరువురిని జంపినదోష మెవ్వరిది? రాకుమారుడా పాపఫల మనుభవింపవలయునా! పద్మావతియా లేక మంత్రిసూనుఁడా లేక మరెవ్వఁడది యనుభవింపవలయును? ఈ ప్రశ్నమునకు త్తరము దెలిసియు దెలుపకున్న నీశిరంబు వేయి వ్రక్కలగును. అని శపించి యడిగిన విక్రమార్కుఁడు తనకు దెలిసినది దెలుపకున్న శాపోపహతుఁడనగుదునను భయంబున నాతనితో నిట్లనియెను. "ఓయీ! కాముకులు కార్యసాధనమునకై యెక్కుమార్గము లవలంబింతురు. ఇటగూడ రాకుమారుఁడా మెను దక్కించుకొన నిట్లొనరించెను గాని యన్యమెఱుంగడు— గాన నాతఁడు నిర్దోషి, పద్మావతియు మంత్రిసూనుఁడును గూడ నిర్దోషులే యగుదురు. యుక్తాయుక్త విచారజ్ఞానసూన్యుఁడై చెప్పుడు మాటలవిని కండ్లారజూడకుండ పద్మావతికిట్టి శిక్షవిధించిన యా కర్ణోత్పలభూపాలుఁడే వారిరువురజంపిన పాపఫల మనుభవింపవలయును. అనుటయు నాతని మౌనవ్రతమునకు భంగమగుటయు భేతాళుఁడా విక్రమార్కుని పట్టువదలించుకొని తన యథాస్థానమగు మఱ్ఱిచెట్టును జేరెను.



# సుమదనక

విక్రమార్కుఁడు మరల నావటవృక్షమును సమీపించి యతిప్ర యాసముతో మరల నద్దాని నధిష్టించి శవాకృతినున్న భేతాళుని బట్టుకొని భుజముపై వైచుకొని యధిక శ్రమంబున జడదారిం జేర వలయునని త్వరితగమనంబున నడచుచుండ భేతాళుఁడు రాజా! శ్రమ వాయ కథజెప్పెద నాలింపుము. అని యీ క్రిందికథ యిట్లు జెప్ప నారంభించెను.

తొల్లి అంగదేశమునందు ధనవంతుఁడగు ధనగుప్తుఁడను వైశ్య శిఖామణి గలఁడు. ఆతఁడు విదేశములతో వ్యాపారము జరిపి యపరి మితమైన ధనంబులగూర్చి యుంచెను. కాని చిరకాలము దనకు సంతతి కలుగనందున చింతించి వివిధవ్రతము లాచరించి కొన్ని దినంబు లును దానధర్మాధికార్యము లాచరించి గొన్ని దినంబులును గడపెను. గాని సంతానము గలుగలేదు. గొన్ని వత్సరములట్లు సంతాన వాంఛతో గడపినపిమ్మట నా గ్రామమున కరుదెంచిన యొక యోగి పుంగవు నాశ్రయించి యాతనివలన సంతానగోపాలమను మంత్రరాజము నుపదేశము పొంది విధివిధానంబున నా మంత్రమును ప్రతిదినంబును జపించుచుండెను.

ఇట్లు గొన్ని దినంబులు గడచిన పిమ్మట నాతని తపఃప్రభావము వలననో యనునట్లు యాతని భార్యకు నెల దప్పినది. ఆ వైశ్యసతి నవమాసములును గడచినపిమ్మట నొక్క శుభదినంబున నొక బాలికా మణినిని ప్రసవించెను. పుత్రోదయము గలుగునని గంపెడాశతో నిరీ క్షించుచున్న ధనగుప్తునకు బుత్రికా జననమువలన మరికొంత విచా రము గలిగెను కాని యాతని యాప్తులందరును కుమారుడైననేమి

కుమార్తె యైననేమి—యని పెక్కు తెరంగుల బోధింప దన విచారము మరచి సంతసమున వర్తించుచుండెను. పలువురు జ్యోతిష్కులు ఆ బాలికామణి జాతకమును విమర్శించి యామెవలన నుభయకులములును తరించుననియు, సత్కీర్తివంతము లగుననియు, ఆమె గొప్ప పతివ్రత యగుననియు వచింపసాగిరి. ఆపల్కులు ధనగుప్తున కెంతయో సంతసము గూర్చెను. తమ సంతతి వృద్ధిలోనికివచ్చి యుభయ కులగౌరవముల నిలుపుట మాత్రమేగాక యా కులగౌరవములకు అట్టిటు దనరాని సద్యశము గూర్చుననిన విని యానందింపని జననీజనకు లుందురా ?

చిరకాలమునకు గల్గిన సంతానమగుటచే ధనగుప్తుడు — తన కుమార్తెయగు సుమదనపై నింతింతనరాని వాత్సల్యముగల్గి యామె నతిగారాబమున బెంచుచుండెను. దినదినాభివృద్ధినొందుచు నాకన్నియ శుక్లపక్షపాకరునిమాడ్కి యత్యంతదర్శనీయయై యుండెను. ఆమెకయిదు వత్సరముల ప్రాయమరుదెంచినంతనే ధనగుప్తుడామెనొక విద్వాంసునికడ విద్యాభ్యాసమునకై యప్పగించి యామెకెట్టి కొరంతయు గలుగకుండ కంటికి రెప్పవోలె గాపాడుచుండెను. విద్యాభ్యాసమునకై ప్రవేశించిన కొలది దినములలోననే యామె జదువను వ్రాయను నేర్చెను. క్రమక్రమముగా నచిరకాలంబున నామె కావ్యముల ముగించి నాటకముల బరిశీలించి భాషాభివృద్ధి నందుటయేగాక గణితము మున్నగువానియందు గూడ నుత్తీర్ణ రాలయ్యెను.

రూపమునకా రతీదేవిని మించియున్నది. విద్యల కావాక్సతి ననుకరించు చున్నది; సుగుణములకా భూజాతతో తులదూగుచున్నది. గానమునకాలోకమున సాటిలేనిదై యున్నది. వేయేల ? ఆమె మూర్తీభవించిన శృంగారదేవతయే యని యెల్లరు దలంచు చుండిరి. ఇట్లుండ యామె సంప్రాప్త యౌవ్వనవతియై యున్న జూచి ధనగుప్తుడు వివిధ

దేశములందు గల వైశ్యకుమారుల రూపపటంబుల దెప్పించియు దగు వారివలన వారి వారి గుణప్రవర్తనాదికము లాలించియు దనకుమార్తె కనువైన వరునికై వివిధప్రయత్నము లొనరించెను.

ఎట్టకేలకా ధనగుప్తుఁడు దన కుమార్తె నవంతీపురమందున్న యొక వైశ్యశిఖామణి కుమారుఁడగు సముద్రదత్తున కొసంగి పరిణయము గావించి యాతని దనయింటనే యుంచుకొని యా నూతన దంపతుల సౌఖ్యమున కెట్టి కొరంతయు గలుగకుండ నరసి రక్షించుచుండెను. ఇట్లుండ నొక్కనాడు సుమదన తన మందిరప్రాంతమున నున్న యొక యుపవనంబున కరిగి యందు ద్రిమ్మరుచు నానావిధ ప్రసూనముల సేకరించుచు నందందు విరిసిన పూలగుత్తులపై ప్రవాలి ఝుంమని రొద చేయుచున్న గండుతుమ్మెదపంక్తుల దిలకించి యానందించుచు, కడు పారి ఫలముల నారగించి యధికానందంబున నవ్యక్తమధురస్వనంబున నొండొరులతో సరససల్లాపము లాడుకొనుచు నొక వృక్షమునుండి యింకొక వృక్షమున కెగురుచున్న చిలుకలగుంపుల దిలకించుచు నెడ నెడ వికసితానూనసౌరభంబుల వెదజల్లు పూమంజరులుగల నికుంజముల చెంతగల చంద్రకాంతశిలావేదికలపై విశ్రమించి సౌరభయుక్తములగు వాయువుల నాఘ్రాణించి సంతోషమందుచు, సూర్యాస్తమయమైన సంగతి గమనింపక కనుచీకటి పడునంతవరకా మందయాన యందందు మందగమనంబున దిరుగుచు విహారించుచుండెను.

ఆమె రూపలావణ్యాదుల దిలకించి యామెను మోహించి యామెతో మాటలాడి యైనసంతుష్టి నొందవలయునని దరి వేచియున్న ధర్మదత్తుఁడనువా డామె యుపవనంబున నున్నటులెఱింగి రహస్యమార్గమున నందు ప్రవేశించి యొక నికుంజముమాటున కనుచీకటి పడువరకు వేచియుండి సుమదన కాలాతీతమైనది, యిలు సేరవలయు నని దలంచి గృహోన్ముఖురాలగు సమయమున నామె యెదుటబడి

యామెతో నిట్లనియెను.

"ఓ తరుణీమణీ! ఆశ్చర్యపడకుము. నేను నీవెఱింగినవాఁడనే గాని యన్యుఁడను గాను? నీకు హానిసేయవలయునను యభిప్రాయమున జనుదెంచితినని తలంపకుము. నన్నన్యథా భావింపక నాపల్కులాలించి నా ప్రశ్నములకుఁ దగిన యుత్తరమిమ్ము. నీవు ప్రత్యుత్తర మీయకున్నంతమాత్రమున హాని సేయుదునని తలంపకుము. ఇంకి నే నరుదెంచినపని వినుము. నేను చిరకాలము క్రిందటనుండియు నిన్ను ప్రేమించుచుంటిని; నిన్ను నాకర్పింపవలసినదిగా నీ జనకునకు దగువారిచే జెప్పించితిని. అతని సమక్షమునకు బోయి యడిగితిని గాని స్వగ్రామవాసినగుటచే "తన పెరటిచెట్టు మందు" వలె నీజనకుఁడు నా ప్రార్థనల నిరాకరించెను. అంతట నీపైగల మోహమును మరల్చుకొనవలయునని వివిధప్రయత్నము లాచరించితిని. దేశాటనమునకు బోయితిని. వేయేల చేయగలయత్నము లనేకము లొనరించితిని కాని నీపైగల మోహ ముపశమింపలేదు సరిగదా యంతకంతకధికమయ్యెను. ఎట్టి సుందరీమణులను గాంచినను వారు నీ కాలిగోటితోనైన సరిపోల్పదగినవారుగా గాన్పింపలేదు. ఇంక నా కెందును యుపశాంతి చేకూరదని దలంచి కొలది దినములకుబూర్వమే యీ గ్రామమున కరుదెంచితిని. తన్వీమణీ! ఇట నాయవస్థ నేమని జెప్పుదును. కనులకు నిద్ర రాదు. నోటికి నాహారము రుచింపదయ్యెను. మిత్రుల యూరడింపు వాక్యములు నాచెవి కెక్కుటలేదు. నీ మనోహరాకార మెప్పుడైన గన్పడునేమో యను దలంపున మీ యింటిగవాక్షముపై చూడ్కుల బరపి నిత్యమును జూచుచుండుటవలన దిక్సూచివలె నా నేత్రము లితరమును గననొల్లవు. నీతో మాటలాడుటకేని యవకాశము లభింపదాయెగదా! యింక నాజీవితమేటికని పలుమారు దోచుచుండెను. తుదకొకటి రెండుసార్లు ఆత్మహత్యకొడిగట్టి సంసిద్ధుడనై యంతలో

జీవించియున్న నీముఖారవింద సందర్శనలాభ మొనగూడును గాని చనిపోయిన నట్టి యనకాశము లభించుట కిసుమంతయు వీలుండదు గదాయని దలబోసి యాత్మహత్య జేసికొనన్నతిని.

నీపైననే ప్రాణములన్నెదుగూడ నిలిపియున్న నన్ను రక్షింపుము. నా జీవముల నిలువఁబెట్టుము ఇంతకంటె యధికముగా నిన్నేమియు గాంక్షింపను. ఒక్కసారి నీ వాలింగనమొసంగి సమాదరింపుము. అంత టితో సంతుష్టినొంది జీవముల నిశ్చింతతో విడతు; అంతియే కాని మరలమరల నిట్లరుదెంచి నినుప్రార్థించుచుందునని దలంపకుము. ఆద రించినను, నిరాదరణము జూపినను, నాకు మరణమే శరణ్యము గాని యన్యములేదు. వేయేల ఇప్పుడు,నన్నాదరింతువా? లేక నీచరణసరోజ ములచెంత, నీ నేత్రాంజముల నెదుట, యీకత్తితో నాహృదయాంత రాళమును భేదించుకొని మరణింపుమందువా? అని బలుకుచు దన మొలయందు గుప్తముగా దాచియుంచిన బాకును వెలికిదీసి చూపెను.

ఆ లతాతన్వియు దనమనంబున నిట్లు దలపోసెను. నీతనికోర్కె కను మతించినచో మానభంగ మగును. మానభంగమున కొప్పుకొనని యెడల నిష్కారణ మొకజీవి నావలన జీవముల గోలుపోవును. యేమి సేయుదును యని పెద్దయుంబ్రొద్దు చింతించి యాతనికిట్లనియెను. "అయ్యా! తొల్లి తమరు నన్ను ప్రేమించినట్లెఱుంగుదును. తమ ప్రేమకు దగిన ఫలము లభింపమి చింతాక్రాంతచేతస్కులై యుంటి రని గూడ నెఱుంగుదును. విధాత లిఖించిన వ్రాత ననుసరించి మనకు దాంపత్య మొనగూడకయ్యెను. గావున పరమేశ్వరుఁడే మనకు యననుకూలుఁడై యుండెగదాయని దలపోసి యూరటచెంది యుండ వలెగాని యన్యథా చరింపగూడదు. అట్లూరటజెందక దానిపైననే వ్యామోహముబెంచి నిరంతరము నిద్రాహారముల పరిత్యజించి చింతిం చుట బుద్ధిమంతుల లక్షణము గాదు కాని నాకొక్క సందేహము

తోచుచున్నది. తమరు ప్రాజ్ఞులు. యితరుల యనుభవములో నున్న నన్నాసించుట తమవంటివారికి దగునే. ఎంగిలికూడు నాసించుట, ఒకరనుభవించి విడచిన కాంత నాసించుట మున్నగునవి యనుభవమున కనర్హములని పెద్దలు నక్కాణించుట మీరు వినియుండలేదే. అట్టిచో తమరు నను వాంఛించుట నీచకృత్యముగాదే! మాంసాస్థి చర్మనిర్మితమై యఖిలహేయములకు పుట్టినిల్లై యుండు యీదేహముయొక్క పైపై మెఱుంగులుగల చర్మసౌందర్యము, చర్మవర్ణము బట్టి మోహించి వ్యామోహమునబడి దారితెన్నుగానక పాపకార్యాచరణమునకు వెనుదీయకుండుట గడుంగడు శోచనీయముగదా ?" అని యేమేమో బల్కుచుండ నతఁడు "తన్వీ! పాపపుణ్యముల గణింపజాలను. నీపైనగల మోహమును మరల్చుకొనజాలను. యే లతాంగిని తాను ప్రేమించియుండెనో యా లతాంగినిగాక యధిక సుందరాంగుల గూడినను యాతనికి సుఖంబొనగూడునా ? వేయేల తా వలచినది రంభ యను వాక్యముల నాలించియుండలేదా ? మరియును తాను మనసార వరించిన సతీమణితోడి సాంగత్య మొక క్షణమైనను నయ్యాదియేకల్పకమై కాముకులకు దోచునను టాలింపవే. నీ విట్లు నిను గోరుట నీచకార్యమని బల్కుచుంటివి. నీచమో నీచతరమో నీచతమమో విచారించగల బుద్ధి నశించినది. వేయేల పలుమాటల కవకాశములేదు. ననుమరణింపుమందునా ? యభిమతమీడేర్తువా ?"

అని దెంపుతలంపు బల్కుచున్న నాతని కెట్టి యుత్తరమును జెప్పజాలక యా లతాంగి "అయ్యా ! నేనిప్పుడు నా విభుని యాధీనములో నుంటిని గాన యాతని యనుజ్ఞగొని నీ యభిమత మీడేర్తును. అంతవర కోరిమి వహించియుండుము" అని వచించెను. అంత ధర్మదత్తుఁడు "తన్వీ ! యిది యేటిమాటలు. నీవిభుం డిందుల కనుమతించునా ? యెన్నటి కనుమతింపఁడు. తన భార్యను పరునితో గవయుటకు తనం

తట తానె పంపునంత వెంగళి యెంతైన నుండునా ? ” అని బల్కెను. అయ్యా ! తమరు సందియమందకుఁడు. ఆతఁడు లోకములోని పూరుషులవంటివాఁడుకాడుచాలనుదారస్వభావముగలవాడు. తన మూలమున నొక జీవి మరణించుట కెన్నడిచ్చగింపడు. ఆతని నెట్టులైన నొడబరచి తమ చెంతకు రేపదిన మర్ధరాత్రమున నరుదెంతును. నాకింక నిట తడవు మసలుటకు వీలులేదు గావున నాకింక సెలవొసంగుడు. ” అని సవినయముగా నాతని నొడంబడజేసి గృహోన్ముఖురాలయ్యెను. ధర్మదత్తుఁడును గృహోన్ముఖుఁడయ్యెను.

నాటి రాత్రి సుమదన దన విభునితో ధర్మదత్తుని వృత్తాంతమంతయును దెలిపి దనకు గర్తవ్యమెద్ది యని ప్రశ్నించెను. సముద్రదత్తుఁడును సంకోచింపక ప్రియా ! ఆతని యభిమతంబు దీర్చవలసినదే కాని నీవు రేపటిదనుక నేలగడవుపెట్టితివి. రేపటివఱ కాతఁ డోర్చి యుండగలఁడా ! అని బల్కి నాఁడామెతో వినోదముగాగడపి మరునాఁడర్ధరాత్రమున నామె కడకు బోయిరమ్మని చెప్పి నిద్రించెను.

నేటిరేయి సుమదన నాగృహంబున కరుదెంచి నన్ను మరుక్రీడల దేలించునుగదా ! యింక నా జన్మము సార్థకమైనది. అట్టి రూపలావణ్యవిలాసములుగల విలాసినితో గడపిన క్షణమైనను జాలఁదే ఈ యభిలాషము దీరుటచే నింక మరణమునకు సంసిద్ధుఁడనై యుందును. అలతాంగి యరుదెంచినంతనే మనసుదీరయాలింగన మాచరించి యాలతాతన్వియధరామృతముఁదనివిదీరగ్రోలియానందపరవశుండ నగుదును గదా ? అని యేమేమో దలపోయుచు కొంతతడవు వేగించెను. అంతకు సుమదన రాకుండుటచే యాతని మనంబున సంకోచ బీజము మొలక లెత్తినది. తా నరుదెంచెదనని వచించి రాకుండునా ! ఏల రాకుండును తన భర్త మిక్కిలి మంచివాడనియును, ఆతని నెట్లైన సమ్మతింపజేసి తప్పక వచ్చెదనని ధైర్యముతో బలికియు రాకుండునా ? ఎంత భ్రాంతిపడుచుంటిని. తానెంత మంచివాడైనను

తన భార్య నొరునొద్దకు బంపునంతటి యవివేకియుండునా?

ఈ సంగతి యామె భర్తతో జెప్పుటయే తడవుగా నామెను బంధించుటో లేక వెలుపలకు రాకుండునట్లొక గృహమున నుంచి తాళము వైచుటో జరుగును గాని యన్యథా జరుగుటకు వీలువేదు... కటకటా! మోసపోతిని. మొన్న నాలతాంగి చేజిక్కినప్పు డామెను మరి కొంతవరకు ప్రార్థించియో వెరపించియో లేక బలిమినో బట్టి సుఖింపక పోవిడిచితినిగదా నాయట్టి యవివేకియుండునా?......... అని చింతించుచుండెను.

అట సుమదన భర్తయానతి శిరసావహించి యాతనికి వలయు పరిచర్యలొనరించి యాతని నిద్దురపుచ్చి ధర్మదత్తుని యభిమత మీడేర్ప వలయునను సంకల్పమున రహస్యమార్గమున నిలువెడల ధర్మదత్తుని గృహాభిముఖయై నడువసాగెను. అట్లు కొంతదూర మరుగునప్పటికి కొందరు దొంగలామె నడ్డగించి తన్వీమణీ! నీయొడలిపైగల భూషణముల నిట మాకర్పించి బొమ్ము. లేనియెడల నీకత్తిచే నీకుత్తుకను త్తరించి యాసొమ్ముల గైకొందుము. అని యదలించిన విని సుమదన యేమియు దోచక కొంతప్రొద్దు చింతించి యాచోరుల కిట్లనియెను. అన్నలారా! కొండొక కార్యార్థమై పోవుచున్నాను. మరల నీమార్గముననే రాగలను. మరలి వచ్చునపుడు మీరు కోరినట్లుగా నాభూషణముల నన్నిటిని మీకొసంగి పోయెదను. ఇప్పటికి నను బోవిడువుడు. మరల శీఘ్రకాలమున వత్తును?' అని బల్కిన విని యాచోరనాయకుడు "నీవు మరలివత్తువను నిశ్చయమేమి. నీవురాకున్న చో మేమేమి చేయగలము. మాకు పెక్కు మాటలతో నిమిత్తములేదు వస్తువుల నిచ్చుటపెట్టి కదలుము." అనియెను. అంత నామె "సోదరా! నీకంత సందియమెందులకు మీలో నొకరిద్దరు నావెనువెంట రండు. నేనొక గృహమున కేగి మరల శ్రీఘ్రకాలమున యిలువెడలి చనుదెంతును. అప్పుడు మీరు నాభూషల గైకొనవచ్చును. నాభూషణముల

మీకొసంగి నేనచటి కరిగినచో నాకార్యము విఫలత్వ మొందగలదు.” అని వినయవిధేయతలుట్టిపడ బల్కిన పల్కులాలించి యాచోరనాయకుఁడు—“బాలా! నీవు బల్కినటులనే మాలో నొక్కరుడు నీవెంట నరుదెంచును. నీకార్యము దీరినపిమ్మట మావానితో నిచ్చటికరుదెంచి నీభూషణముల మాకర్పించి పొమ్ము.” అని నియమించెను. అంత నా సుమదన సంతుష్టాంతరంగయై ధర్మదత్తుని గృహంబు జేరెను. చోరుఁడా సమీపంబుననే నిలచియుండెను.

ధర్మదత్తుఁడు తనడాయఁ జనుదెంచిన యాబిబ్బోకవతిఁగాంచి యామెను దావలచినట్లును, ఆమెను దాను వాంఛించి రమ్మని బలవంతపరచినట్లును అందులకై యామె విభుననుజ్ఞగొని యరుదెంచినట్లును యేమరుపాటున దలంచి యామె సత్యమునకును ఆమె విభుని త్యాగమునకును వారి ధర్మపరాయణత్వమునకును మనంబున ఘనంబగు సంతసమొందె యిట్టి ధర్మదేవతాస్వరూపురాలైన యామెకు మానభంగ మొనరింప నిచ్చగింపక తన మోహమును ప్రేమగా మార్చుకొనియెను. ఆమెను బొడగాంచినంతనుండియు ఆమెయందు సోదరిభావము జనించెనుగాని యన్యభావ మాతని దలంపున లేకుండెను. తన సమీపంబున కరుదెంచుచున్న యామెనుగాంచి “సోదరీ! వచ్చితివా! తుచ్ఛుఁడనై ఐహికవాంఛాపరాయణాయత్తచిత్తుఁడనై దుర్మదాంధుడనై కన్నుమిన్నుగానక పరకాంతవగు నిన్నాశించితిని. మహాపాపమార్జించితిని. ఈ ఘోరదురితాంధకారపంకమధ్యంబునుండి వెలువడనేరక యెన్ని జన్మములు కష్టింపవలయునో గోచరించుటలేదు. అయినను ధర్మదేవతామూర్తులరగు మీ దంపతుల యనూనకరుణాకటాక్ష లవలేశమే నన్నీ నరకకూపమునుండి పునరుద్ధరింపగలదు. నేడు నీమూర్తిఁగాంచినంతనే నా మనంబు పరమేశ్వరాయత్తమై మరలనేరకున్నది. కట్టా! సోదరీ! నీవిట తడయుటచే నీవిభుఁ డెంత కోపగించునో లెమ్ము పయనముగమ్ము. నీపతి చెంత డించివచ్చెదను

అని బల్కెను. ఆ పల్కులాలించి యామె యాతనికింతలో నింత వైరాగ్య మెట్లు కలిగియుండెనాయని విస్మయంబుదోపగా నాతఁడు తన మనంబుపరీక్షించుటకో లేక తానరుదెంచుట కాలసించినందులకో-యిట్లనుచుండెనేగాని యితరంబుగాదనితలంచి అయ్యా! నే నరుదెంచుట కించుకయాలస్యమైనది. యందులకు క్షమింపవలయునుగాని యీరీతిగా గోపగించుట పాడిగాదు. తమ యభిమతమీడేర్చి త్వరిత గతి రావలసినదిగా నావిభుఁ డాజ్ఞాపించియున్నాఁడు. ఇట నాలసించిన యెడల విభున కాగ్రహపాత్రురాలనగుటయేగాక పదుగురకంటగూడ బడవలసివచ్చును." అని యేమో బల్కుచుండ ధర్మదత్తుఁడు "తన్వీ నాకు నీపై సోదరీ వాత్సల్య ముదయించినది. ఇంక నీ విచట నుండవలసినదిలేదు. నేటికి దైవ మిట్లు పుణ్యమార్గమును నాకు జూపి రక్షింపనెంచియుండుటవలననే నిన్నటిదినమున నిన్నటు ప్రార్థింప జేసియున్నాఁడు." అని బల్కుచు దన గృహంబునఁగల పసుపు కుంకుమల నొసంగి గొన్ని భూషణములనిచ్చి గృహంబున కేగుమని త్వరపెట్టెను.

ఆమెయు చేయునదిలేక అధర్మదత్తుడు ధర్మపదానువర్తి డగుట కెంతయు సంతసించి తన రాకకై వేచియున్న చోరునితో గలసికొని యాతని వెనువెంట చోరులు తన్ను గలసికొనిన స్థలమున కరుదెంచెను. చోరు లీవరకే యచ్చటి కరుదెంచి యామె రాక నిరీక్షించుచుండిరి. చోరనాయకుఁ డామెను గాంచి తన్వీమణీ! నీ సందర్శన మాచరించు టచే నేడు మాకు మిక్కుటమగు ధనము లభించినది. ఇంతటి ధనము మాకు నెలదినములు చౌర్య మొనరించినను లభింపదు. కాని మాకు నీ యొడలిపై గల భూషణములతో నిమిత్తము లేదు. నీ యిచ్ఛవచ్చి నటు బోవచ్చును. మరియు నీకు సంతోషపూర్వకముగా మరికొన్ని భూషణములను బహుమానముగా నొసంగుచున్నాడను." అని బల్కుచు మరికొన్ని భూషణముల నొసంగి యొక చోరునితో

"నోయీ! నీ వీమెను యీమె గృహంబున డించి రమ్ము" అని జెప్పి పంపెను.

సుమదన చోరుఁడు దనవెంట రా స్వగృహంబున కేగి తనరాక గోరి నిరీక్షించుచున్న విభుఁడగు సముద్రగుప్తునిఁ డాయం జని జరిగిన యావ ద్వృత్తాంత మామూలముగా నెఱిఁగించి చోరు లామెకు బహుమాన ముగా నొసంగిన భూషణముల గూడ జూపెను. ఆమె వర్తన మంత యును ప్రచ్ఛన్నముగా నుండి దిలకించియున్న సముద్రగుప్త డత్యధికా నందము నందెను.

రాజా! వింటివిగదా యీకథ. ఇందు సుమదన, ధర్మదత్తుఁడు చోరులు సముద్రగుప్తుఁడు వీరిలో నెవ్వరు గుణాధికులు యెవ్వరి త్యాగము మెచ్చవచ్చును వివరించి చెప్పుము. చెప్పకున్న యెడల వెనుకటి శాపమే." యని భేతాళుఁ డనుటయు విక్రమార్కుఁడు ఓయీ! సుమదన త్యాగమంత గొప్పది గాదు. మనసార గోరి తన్నర్థించిన యాతని కుపకార మొనర్చు టొక గొప్ప గాదు ఏల నందువా! ఆమెకు గూడ నాతనిపై మక్కువ జనించి యట్లొనర్చినను యొనర్పవచ్చును. ధర్మదత్తుఁడు జ్ఞానమార్గమున బడి యామెతో భోగింపక విడచినను విడుచుగాక యందులకై యాతని నభినుతింప దగదు. తమ కపరిమితధనంబు లభ్యమగుటవలన చోరులు సంతృప్త హృదయులరై యామెను విడచిన విడతురుగాక అందులకై వారిని నుతింపవలసిన పనిలేదు. సముద్రగుప్తుఁడే ఇం దభినుతింప నర్హుఁడు తన భార్య నితరులు కోరినంతమాత్రమున కొంకు జంకు లేకుండ బం పుట కెవ్వఁడు సమ్మతించును, అట్టియెడ సముద్రగుప్తుఁడు తన భార్య యగు సుమదనను యితరునియొద్దకు బంపెను గావున నాతని త్యాగమే యభినుతింపవలయును." అని బల్కెను. ఆ పల్కు లాలించి భేతా ళుఁడు విక్రమార్కుని పట్టు విడిపించుకొని యథాస్థానమున కరిగెను.



# హరిస్వామి కథ.



విక్రమార్కుఁడు మరల భేతాళుని పట్టుకొని దీసికొనివచ్చుచుండగా భేతాళుఁడు ఓయీ ! శ్రమనివారణార్థము కథజెప్పెద నాలింపుమని బల్కుచు నీక్రిందికథ యిట్లు జెప్పసాగెను.

తొల్లి దేవస్వామి యను విప్రపుంగవునకు హరిస్వామి యను కుమారుఁ డొక్కఁడు గలఁడు. హరిస్వామి సర్వవిద్యాపరిపూర్ణుఁడై నవయౌవ్వనుఁడై చక్కని యనుకూలవతి యగు భార్యతో సుఖించుచుండెను. ఇట్లు గొన్ని దినంబులు స్వేచ్ఛావిహారంబులు సలుపుచు విహరించుచు నొక్కనాఁడు దన ప్రేయసితో విహరించుచు శరత్కాలచంద్రామృతముఁ గ్రోలుచునుప్పరిగపై క్రీడించి పెద్దయుంబ్రొద్దుగడపి మైమరచి యాదంపతులు నిద్రించిరి. గగనచరుండగు నొక్క గంధర్వుఁడాదంపతులగాంచి యాలతాతన్వియగు మోహించి చిత్తవిభ్రాంతుఁడై మన్మథుఁడు డెండంబును సంపడింప తమిపై పఁజాలక యాతన్వీమణిని బట్టుకొని గగనమార్గంబునజనియెను.

గత దినంబున బెద్దయుంబ్రొద్దు నిదురలేకుండ మన్మథక్రీడల దేలి నిదురజెందియుండుటచే దినకరకిరణసంస్పర్శనము దన దేహమునకగు పర్యంతము నిద్రించిన యాహరిస్వామి మేల్కాంచి తన భార్య చెంత లేకుండుటచే నామె యింతకుమున్నె మేల్కాంచి కాలోచితకృత్యముల దీర్చుకొనబోయియుండునని భావించుకొని దానును ప్రాతఃకాలోచితవిధుల నిర్వర్తింపనుప్పరిగనుండి క్రిందకుదిగెను. అనంతరము తన భార్యజాడ గృహంబున గాన్పింపకుండుటచే నామె యెచ్చటికేగియుండునాయని సంశయాకులచిత్తంబున దాసదాసీజనంబులబిలిచి వారల దన భార్యపోకడనుగూర్చి ప్రశ్నించెను. వారందఱును యామె యుప్పరిగ

పై నుండి యింతదనుకను రాలేదనియును, రాత్రి నిద్దురలేమిచే యింకను నిద్రించుచుండుననని భావించియుంటిమనియును దెల్పిరి. హరిస్వామి వారి మాటల విశ్వసింపక యుప్పరిగపై భార్యలేకుండుటెఱిఁగినవాఁడు గావున పలువుర నలుదెసలకును వెతుకబంపెను. కాని యిసుమంత యును లాభము గాన్పింపదయ్యెను. ఆ లతాతన్వివియోగమును సహింపజాలక యామెకై విలపించుచు క్రమక్రమము నున్మత్తుఁడై యన్నపానంబుల సరకుగొనక యామె నన్వేషింపుచు పురీవర గ్రామారణ్యముల దిరుగసాగెను.

హరిస్వామి యిట్లు భార్య నన్వేషించుచు నొక్కనాఁడు గడుం గడుబడలి యాకలిబాధచే పీడింపబడుచు నొక్క విప్రపుంగవుని గృహంబున కరుదెంచి తన దీనచరిత్రమంతయు విన్నవించి తనకా దినంబునకు భోజనముపెట్టుమని ప్రార్థించెను. ఆ విప్రపుంగవుడు జాలి పడి భార్యను బిలచి యాతనికన్నంబు పెట్టుమని నియోగించెను. ఆ గృహిణియు యింటగల యన్నమాతని కొసంగి యెటకేనిగొనిపోయి భుజింపు" మని జెప్పి పంపివైచెను. హరిస్వామి అయోగిరమునుగొని యొక సరోవరముచెంతకుఁగొనిపోయి గట్టుననున్న యొక వటవృక్షము యొక్కనీడగూర్చుండి భుజింపదలచి యాయన్నపుమూట నా చెఱువు గట్టునబెట్టి కాళుసేతులు కడిగికొనివచ్చుటకై నీటిలోనికిఁదిగెను. అంత వటవృక్షశాఖలపై గూర్చుండి యొక డేగ నల్లత్రాచును భక్షించు చుండ నాత్రాచునుండి కొన్ని గరళబిందువులు—క్రింద హరిస్వామి యుంచిన యన్నమునబడియెను.

హరిస్వామి వెలికరుదెంచి గరళబిందు యుక్తమైన యన్నమును భుజించెను. తోడనే యాతఁ డెద్దియో వికారమునకు లోనై తన కాహార మొసంగిన వారింటికి బోయి "అమ్మా! విషయుక్తమగు యాహార మొసంగితివా? మరణించుచుంటినని జెప్పి మరి మాటాడ

నేరక మరణించెను.

"విక్రమార్క మహీపాలా! న్యాయాన్యాయ విచక్షణుండవుగదా? వింటివిగదా? యీకథ ఇందు సర్పము దేగహారిస్వామి యాగృహిణి ఆ గృహమేది వీరిలో హారిస్వామిని జంపిన పాప మెవ్వని బొందవల యును దెల్పుము. లేకున్న వెనుకటిపాపమేసుమీ" అని బల్కిన భేతాళునకు విక్రమార్క మహీవల్లభు డిట్లనియెను. ఓయీ! తన్న ర్థించుటచే గృహస్థధర్మపరిపాలనంబున యజమాని యన్నమిడుమని భార్యకు నియోగించెను. కాన యాతఁడనపరాధి. తన పతియాన జవ దాటక ధర్మార్థముగా యన్నము వెట్టిన యా లతాతన్వియు నిర్దోషు రాలు. తన యాహారమగు త్రాచుపామును వృక్షముపైనుండి భుజించిన డేగయు నిర్దోసి. ఖగములు దమ యాహారమును వృక్షముపై గూర్చుండియేగదా భుజించును గాన డేగనిర్దోషి. తన కాయువు మూడిమరణించిన యాసర్పము కూడ నిర్దోషియే. కావున నీవేర్కొన బడిన వారందఱును నిర్దోషులే అయినను నిజానిజంబులరయక పరుల దోషగుణంబుల నెత్తి జూపించుటయే ముఖ్యాశయము గలిగి దుర్వృత్తితో నెవ్వ రింకొకరితో నాగృహిణి హారిస్వామికి విషయుక్తమగు యాహార మొసంగి జంపినదని జెప్పుదురో వారే యీపాపమును మూటగట్టుకొందురు. సంశయము లేదు." అని విక్రమార్కుడు బల్కుటయు భేతాళుఁడు మరల పట్టువిడిపించుకొని వటవృక్షముపై జేరెను.



# వేదశర్మకథ

విక్రమార్కుఁడు మరల వటవృక్షమునుఁ జేరంబోయి భేతాళునిబట్టి బంధించి దనమూపున నిడుకొని వచ్చుచుండగా నతఁడు "వినవోయీ! నీశ్రమ నివారణార్థ మొకకథజెప్పెద నాలింపుము." అని బల్కి యిట్లీ క్రిందికథ జెప్పసాగెను.

తొల్లి వేదశర్మయను విప్రపుంగవుఁ డొక్కరుఁడు దరిద్రదేవతా పీడితుఁడై కడుంగడు నిడుము లనుభవించి సంసారసాగరమునుండి తరిం పజాలక ప్రాయోపవేశ మొనర్చి ప్రాణములు వాయుదలంపున నరణ్యా మార్గముబట్టి నడువదొడంగెను. పోవంబోవ నాతఁడు పుష్పపురమను పురీవరసమీపారణ్యముఁ బ్రవేశించి యందున్న . యొకశూన్యదేవాల యముం గాంచి నడువజాలక, యందు ప్రవేశించి యొకచో బరుండి, యాకలిచే బాధపడుచు, విలపించుచుండెను.

ఆతని దీనాలాపము లాలించి యాదేవళమునందుననే తపమా చరించుకొనుచున్న యొక మునిపుంగవుఁడు, దయాంతఃకరణహృదయుఁ డై వేదశర్మను సమీపించి "అయ్యా! నీ వెవ్వఁడవు. ఏ దేశమునుండి యెచ్చటికేగుచు నిట్లగుదెంచితివి. మనుజులాయుధము ధరించియైన నీ వనంబు ప్రవేశింప జంకుచుందురే అట్టియెడ నిర్భీతచేతస్కుఁడవై నీవెట్లురాగలిగితివి, లేక ప్రమాదవశమున దారిదప్పివచ్చితివా? చెప్పు" మనిన యాతనికి వేదశర్మ తనవృత్తాంతమాద్యంత మాతనికిఁదెల్పి యిట్లనియెను. "అయ్యా, సంసారసాగర మధ్యంబున జిక్కుకొని దరిగా నక దుఃఖించుచుండుటచే నెన్నటికేని మరణము తప్పదుకదా! ఆమర ణమిపుడొందిన నీ కష్టసముదాయము దొలగునని దలపోసి జీవములపై నాశమాని యీ వనముఁజొచ్చితిని. తెగించినవానికి తెడ్డేలింగమను

నట్లుగా నీ వనమున గల ఘాతుకమృగంబులు నాదరికైన రాజాలవయ్యెను. అందుచే నిప్పటి కిచ్చటజేరగలిగితిని" అని దీనతతో బల్కిన విని, యాజడదారి దయాంతరంగుడై యాతని కిట్లనియెను. "సంసారమున సంభవించిన కష్టముల నుపాయాంతరమున దప్పించుకొనవలయునేగాని ప్రాణత్యాగమునకై యుపాయమాలోచించుట నేరిగాదనము. గావున నా పల్కులాలించి నీ బుద్ధి మరలించుకొమ్ము." అనిబల్కి తన యోగమాయాప్రభావంబున నొక్క తరుణీరత్నమును సృష్టించి యామెచే వివిధభక్ష్యముల తయారుజేయించి షడ్రసోపేతముగ నాతనికి గుడువబెట్టెను.

వేదశర్మ సంసారకష్టముల బడలేక మరణింపనెంచెనేకాని, సంసారభోగముల తృప్తిజెంది మరణింపదలంపు లేనివాడగుటచే నా తన్వీగుణింగాంచి మోహించి విరాగుడయ్యెను. ఆ బింబోష్ఠకపతియును, యామునిపుంగవునిచే నాతని నెట్లైనను సంతృప్తిపరుప నియమింపబడియుండుటచే యందుల కనుమతించి యాతనితో నిష్ఠాలాపభోగముల ప్రొద్దుగడపెను. ఆతడును కొంతవడికి తృప్తినొంది సుఖనిద్రకు లోనయ్యెను. మరునాడు ప్రాతఃకాలమున మేల్కాంచునంత కాకన్యయు, రాత్రి తానను భవించిన పదార్థసంచయమును, అదృశ్యమయ్యెను. వేదశర్మ యెంతయుచింతాక్రాంతుడై మరల విలపించుచుండ నాయోగి మరల యాతనిడాయంజని కారణమేమని ప్రశ్నించెను. వేదశర్మ యాతనిపదకమలములపై వ్రాలి "దేవా! తమదివ్యమహిమంబు గొనియాడతరమే! మరణసంసిద్ధుడనై యున్న నన్ను వారించి గతదినంబున నన్నుబెద్దగా సంతోషింపజేసిరి. నేడయ్యావియన్నియును నంతర్హితముగుటచే మరల విచారించుచున్నాడను. గతదినంబున నాతోనున్న యామెన్మోలాడి నొనగూర్చి నన్ను సంరక్షింపుడు. లేకున్నచో నామెపై చిత్తమునిల్పి మరణించుట కనువగు

నొకదివ్యమంత్రముపదేశింపుడు.'' అని పరిపరివిధంబుల వేడుకొనియెను.

ఆ మునిపుంగవుఁడు కరుణారసచిత్తుఁడై యాతని యీప్సితార్థము సమకూర్చెను. వేదశర్మయాలలితాంగితో గలసి కొన్నిదినంబులు సౌఖ్యముగా గడపెను. అంత నాతనిమనంబున నాయోగిపుంగవునొద్ద నుండి వివిధైశ్వర్యములను, కాంతలను సృజించు మహామంత్రముపదేశము నొందవలయునను వాంఛజనించినది. అంతట నయ్యది క్రమక్రమాభివృద్ధి నొందుచుండెను. కొన్నిదినంబులవర కాతఁడు నోరుదెరచి యడిగిన నాతఁడేమనునో యని శంకించియు, మరికొన్నిదినములరుగు పర్యంతమడగిన, తనవంటి వానికా దివ్యమంత్రముపదేశింపడనియును శంకించి తనమనంబుననున్న యభిమతంబును వెలికగుపడనీయకుండెను. ఎట్టకేల కొకనాఁడు జడదారియొద్దకుబోయి యాతని తపంబునకు విఘాతమొనరించి వేదశర్మ యాతనికిట్లనియెను. "దేవా! తమ తపోభంగమునకు నాపై కోపింపకుడు. చిరకాలమునుండి నామనంబున నిమిడియున్న యొకవాంఛితంబును తమ కెఱిఁగింపక దాచియుంచు కొనజాలమిచేత తమతపంబునకు విఘ్నమాచరించితిని. నావాంఛితమేమన తాము ఏ మహామంత్రబలంబున నీ కన్యను సృజించిరో, యే మహామంత్రబలంబున నన్ననవరతంబును సౌఖ్యవారాసి నిమగ్నుని జేసితిరో, యా దివ్యమంత్రంబును నాకుపదేశింపుడు. ఏతన్మహామంత్రము నేర్చుకొన సంకల్పించుకొంటిని. ఏతన్మహామంత్రసాధనమునకై యెట్టికష్టములనైన బడయుటకు సంసిద్ధుఁడనై యున్నాను.'' అని బల్కుచున్న వేదశర్మను గనియా జడదారి "ఓయీ! ఆ మహామంత్రము సామాన్యముగా పట్టుబడదు. అధికమగు చిత్తస్థైర్యముగల వారలకుగాని యితరుల కియ్యది సులభసాధ్యముగాదు. జలంబుల గూర్చుండి ఏకాగ్రదృష్టితో జపించుచుండ నేతన్మహామంత్రాధిష్టాత దేవత పెక్కురూపముల గాన్పించి జపించువారల బుద్ధి చలింపజేయు

చుండును. అప్పు డేమాత్రము బుద్ధి చలించినను వారల కామంత్రము సిద్ధించదు. ఐహికములందు జిక్కుకొని యుండువారికి స్థిరబుద్ధి గలుగు టసంభవము. గాన కొలదికాలము గడువనిమ్ము. తదుపరి నీమనో ధైర్యమును పరిశీలించి మంత్ర ముపదేశింతును.'' అని బల్కి యూరకుండెను.

వేదశర్మయు ప్రతిదినమును తనకామంత్ర ముపదేశింపుమని వేడుకొనుచు యాయాతపంబున కంతరాయము గల్గించుచున్నందులకు యా జడదారి చింతించి వానికర్మ మెట్టులున్న నట్లగునని దల పోసి యొక దినంబున యాతని కామంత్ర ముపదేశించి కుత్తుకబంటి లోతుగల నీటియందు నిలచి యామంత్రమును పునశ్చరణ మాచరింపుమని నియోగించెను. యథోక్తముగా మంత్రమును జపించుచుండ నాతని మనంబునకు తానొక చక్కని రాకుమారిని పరిణయమాడి నట్లును, యామెతో రాజోపభోగముల నమితముగా ననుభవించుచున్నట్లును, తన కధికమగు సంతతి గల్గినట్లును, వారందరితోడను సుఖించుచుండ తనకు మంత్రోపదేశ మొనరించిన యోగిపుంగవుం డరుదెంచి తన్ను యగ్నిగుండమున నురుకుమని జెప్పినట్లును, తానందులకు నంసిద్ధుడై యుండ భార్యాపుత్రు లడ్డమువచ్చి వారించినట్లును, పుత్రవాత్సల్యతా మోహంబునను, భార్యమాటలు కెదురాడనేరక తాను సంకోచించినట్లును, పదపడి గురుధిక్కారము చేయజాలక తానా యగ్గిగుండమున బడినట్లును, దోచెను. ఇంతకు నియమిత సంఖ్యా జపంబు సంపూర్తియగుటయు వేదశర్మ వెలికరుదెంచి గురువునకు సాష్టాంగదండప్రమాణము లాచరించెను. తదుపరి దనమనంబునకు దోచినవన్నియును జెప్పెను. అంతట నామునిపుంగవుఁడు కడుంగడు చింతించి యాతని కిట్లనియెను. "ఓయీ నీకామంత్రము సిద్ధించినట్లు నిశ్చయముగ దోచినదా యట్లైన నొక కాంతామణిసి సృజింపు'' మని

యెను. వేదశర్మ మంత్రపఠన మొనరించినను కాంత సృజింపబడలేదు. జడదారియు తన యోగమంత్ర ప్రభావమున కాంతామణిని సృజింప బోయెను గాని ఫలీకృతుఁడు కాజాలఁడయ్యెను. అంత నిరువురును చింతించుచు బోయిరి.

విక్రమార్కమహీపాలా! వింటివిగదా యీచరిత్రము గురు శిష్యు లిరువురకును, ఆమంత్ర మేల యుపయోగింపలేదు. తెలిసియుం డియు దెలుపకున్న యెడల వెనుకటి శాపమేయనిన విక్రమార్కు డోయీ! చిత్తశుద్ధిలేని శిష్యున కుపదేశించినందున గురువునకామంత్ర సిద్ధి నశించినది. చిత్తశుద్ధి లేనివాఁడగుటవలన శిష్యునకామంత్రము పట్టుబడలేదు. అది కారణంబుగ నిరువురకును మంత్రసిద్ధి కలుగదా యెను. అని బలుకగా భేతాళుఁడు మరల వటవృక్షము జేరబోయెను.



# మృగాంకవతికథ



విక్రమార్కుఁడు మరల యావటవృక్షము కడ కేగి భేతాళుని పట్టుకొని బంధించి దన మూపున బెట్టుకొని వచ్చుచుండ భేతాళుఁ డాతని కిట్లనియెను. "రాజా! నీకొక చక్కనికథ శ్రమవాయ జెప్పెద నాకర్ణింపుము" అని యిట్లీ క్రిందికథ జెప్పసాగెను.

తొల్లి యంగదేశమును యశఃకేతుఁడను భూపాలవరుఁ డఖండ వైభవంబున బరిపాలించుచుండెను. ఆతఁ డమితసౌందర్యవతియైన పట్టమహిషితో గలసి నిరంతరము క్రీడించుచు స్త్రీలోలతా వ్యామోహమునబడి, రాజకార్యములపొంత బోవక సర్వవిషయములును దీర్ఘ దర్శియను మంత్రిసత్తముని యధీనము గావించి సదా యంతఃపురంబు ననే నివసించుచుండెను. ఇట్లు కొన్ని దినంబు లరుగునంతకు, ప్రజలలో గొందరు కుత్సితబుద్ధిగలవారలు మంత్రియగు దీర్ఘదర్శి పాలనంబున దమ కేమియు లాభము చేకూరనందున నాతనిపై నేరారోపణ మొనరించి దేశమునుండి పారదోలవలయునను సంకల్పంబున, దీర్ఘదర్శి రాజును దనవలలో వైచుకొని రాజ్యమును పరిపాలించుచున్నాఁడని యును, కొలది కాలమున రాజును రాష్ట్రమునుండి పారదోలి తానే రాజగుటకు ప్రయత్నించుచున్నాడనియును ప్రవాదము కల్పించిరి. అనేకు లీవిషయమునే మాటలాడు కొనసాగిరి.

క్రమక్రమముగా నీవార్త మంత్రిపుంగవునికి గూడ దెలియ వచ్చెను. రాజును స్త్రీలోలతావ్యామోహమునుండి యెట్లుద్ధరింపగలనా యని దీర్ఘదర్శి యాలోచనము చేయసాగెను. అంతటినుండి యనుదిన మును భూపాలుని సభకు విచ్చేయవలసినదని ప్రబతిమాలుకొనుచుం డెను, విశేషకార్యము లున్నవని బోధించి చెప్పుచుండెను. అందులకు

భూపాలుఁడు తాను తప్పక రేపువచ్చెదననియును, విశేషకార్యము లున్న యెడల నీవే నాకన్న బుద్ధిసూక్ష్మతచే కార్యసాధన మొనర్ప గలవాఁడవనియును బల్కుచుండు నే గాని యంతఃపురము నెప్పుడును విడువకుండెను.

ఇట్లుండ ప్రభుభక్తి పరాయణులు మరికొందరు కుత్సితులు గల్పించిన యపవాదు నిక్కముని భావించి, మంత్రిపుంగవునిపై నొక విధమగు నసూయ జనించి యొక్కనా డతిసాహసమున నాతని నిల్పి "నీవీ రాజ్య మపహరించుటకు యత్నించుచుంటివను ప్రవాదము గల్గి నది, యందులకు నీవేమి చెప్పగల"వని ప్రశ్నించిరి. అంతట మంత్రి పుంగవుఁడు వారలు విశ్వసించునట్లుగా నెంతయో వివరించి తన కట్టి యభిప్రాయములేదని చెప్పెను గాని వారలు సంతృప్తి వహించినట్లు దోపకుండుటచే నాతఁ డా రాత్రి దీర్ఘముగా నాలోచించి తీర్థయాత్ర కరుగ నిశ్చయించుకొనెను.

మరునాఁ డరుణోదయంబున మేల్కాంచి దీర్ఘదర్శి కాలోచిత కృత్యముల దీర్చుకొని తన వాంఛిత మీడేర్చుమని పరమేశ్వరు నారా ధించి భూపాలుని సమక్షమునకు బోయి తనకు తీర్థయాత్రాభిలాష జనించిన దనియును; ఆరుమాసములు సెలవీయవలసిన దనియును ప్రార్థించెను. భూపాలుఁ డందుల కనుమతించి యుంల శీఘ్రకాలమునఁ దిరిగి రావలయునని యాజ్ఞాపించెను.

దీర్ఘదర్శి ప్రభు ననుజ్ఞాతుఁడై బయలుదేరి [illegible]ముగ ననేక పుణ్యతీర్థంబుల సందర్శించి మరల పురంబునకుం బోవ సంకల్ప ములేక యొక సముద్రతీర పట్టణంబునకుఁ బోయి యచ్చోట కాపుర ముండెను. కొన్ని దినంబులా పురినుండ నాతనికి నిధిదత్తుడను వర్త కుని స్నేహము లభించెను. ఆ నిధిదత్తుడు వర్తకమునకై స్వర్ణద్వీపము నకు బోవుచు దీర్ఘదర్శినిగూడ తనతో దోడ్కొనిపోయెను. స్వర్ణద్వీ

పమున నిధిదత్తుఁడు దన వస్తుసామగ్రినంతయు విక్రయించి మెండుగా ధనమార్జించి మరల దనపురంబునకుఁ బోవ పయనమయ్యెను. మార్గ మధ్యమున నొకచో వారొక మహావృక్షమొకసముద్రమున గాన్పించెను. ఆవృక్షశాఖలపై నొక్క దివ్యసుందరీమణి కూర్చుండి హాయిగా భక్తిరస ముట్టిపడ వీణ వాయించుచుండుట వారు దిలకించిరి. దీర్ఘదర్శి యా యువతీమణి సౌందర్యవిశేషమున కెంతయో యాశ్చర్యమొందెను.

దీర్ఘదర్శి గృహంబు చేరుసరి కొక్క రాజభటుఁ డరుదెంచి యాతనికి నమస్కరించి దేవా! తమ రీ గ్రామంబున నుంటిరని యశఃకేతభూపాలచంద్రుఁ డాలించి తమ్ము వెంటనే దోడ్కొని రావలయునని బుత్తెంచిరి సత్వరము దయసేయవలయును అని విన్నవించిన, భూపాలుని పల్కుల కెదురాడిన నాతని కెట్టి కోపము గల్గునో యను భీతి పెంపునను, ఇప్పటికేని యాతడు స్త్రీలోలతావ్యామోహము నుండి వెలువడి యుండకుండునా యని దలంచియు, జన్మభూమిని సందర్శింపవలయునను యుత్సాహమినుమడింప భార్యాపుత్రులతో నా రాజ భటుని వెంట బయలుదేరి యంగ దేశమున కరుదెంచెను.

భూపాలుఁ డాతని సగౌరవంబుగ నెదుర్కొని రాచనగరులోనికిఁ దోడ్కొనిపోయి సముచితసల్లాపంబుల పెద్దయుం బ్రొద్దుగడపి యాతని కిట్లనియెను. ఓయీ! యేయే ప్రదేశములకు బోయితివి. ఏప పట్టణముల దిలకించితివి. ఎట్టి వింతలు గాన్పించెను వినిపింపుమనుట యును, దీర్ఘదర్శి యా నృపాలసత్తమున కిట్లనియెను. దేవా! తమ యనుజ్ఞ గొని కాశి గయా ప్రయాగాది యుత్తరదేశపు పుణ్యస్థలంబుల నెల్ల దర్శించితిని. అనంతరము దక్షిణముననున్న పుణ్యక్షేత్రముల దిలకింపవలయునను యుత్సాహమున బయలుదేరి శ్రీశైలము, తిరుపతి, కంచి కాళహస్తి, రామేశ్వరము మున్నగు దివ్యక్షేత్రముల

దర్శించిమరలివచ్చుచు శ్రీజగన్నాథునేవించితిని. తదుపరియొకస్నేహితుని యభిమతంబు దీర్పవలయునని యాపురంబున గొన్ని దినములుంటిని. అనంతర మాతనితో స్వర్ణదీపమునకు బోయితిని. "దేవా! తాముజెప్పిన సముద్రమురో లేదోకాని మరలివచ్చునపుడు సముద్ర మధ్యమున నొక్కవృక్షమును గాంచితిమి. ఆవృక్షశాఖలపై నొక్క లతాతన్వి గూర్చుండి మనోహరముగ వీణ వాయించుచుండెను. ఆమె స్వరూపము దిలకించిన రంభాద్యప్సరసలలో నెవ్వతియో యొక్కతె యారూపమున సాక్షాత్కరించెనా యని తలంపవలయును. అప్సరస మాట యటుంచుడు. ఈవరకా చతురాననుండు సృజించినవారిలో నెల్ల నింతచక్కని తరుణీమణి యుండదనియే నానమ్మకము. నాపల్కుల యధార్థము మీరు ప్రత్యక్షముగా దిలకించినంతనే బోధపడగలదు." అనుచు నాడు తానుగనుగొన్న లతాంగిని గొప్పగావర్ణించి చెప్పెను.

ఆపల్కులాలించినంతనే భూపాలునకా లతాంగిని జూడవలయునను యభిలాష జనించెను. తనవాంఛిత మామంత్రిపుంగవునకు జెప్పి తన్నాసుందరికడకు గొనిపొమ్మని ప్రార్థించెను. మంత్రి యందులకు సమ్మతించి యాతని దనవెంటనిడుకొని నిధిదత్తుడున్న పురంబునకు బోయెను. నిధిదత్తుడు మరల వస్తుసంభారముల కూర్చుకొని ప్రయాణమునకు సంసిద్ధుడై యుండెను. ఇంతలో దనపూర్వమిత్రు డరుదెంచుటచే నధిక సంతోషితస్వాంతుడై దీర్ఘదర్శిని యాతనితో నరుదెంచిన భూపాలునిగూడ దనతో స్వర్ణద్వీపమునకు రావలసినదని కోరెను. యశఃకేతుడును యామిత్రు లిరువురితోడను స్వర్ణద్వీపమునకు బోయెను.

స్వర్ణద్వీపమునుండి మరలి వచ్చునపుడు వారు మరల నావృక్షమును ఆలతాంగిని దిలకించిరి. భూపాలుడు తమయోడ నానమీపమునకు

బోనిచ్చెను. తోడనే యాబాలిక సముద్రములోని కురికి యంతర్హితు రాలయ్యెను. యశఃకేతుఁడుగూడనామె వెనువెంటనే యామె సముద్ర మునబడిన తావుననే బడెను. దీర్ఘదర్శియు నిధిదత్తుఁడును రాజు పోకడ కమితముగా చింతించి చేయునదిలేక దమ ప్రయాణమును సాగించిరి.

యశఃకేతుఁ డట్లు పడినతోడనే యాలలితాంగితోడ నొక సముద్ర గర్భగృహమును ప్రవేశించెను. ఆ మందిరమంతయును ద్రిమ్మరి యొక్కచో నాబిబ్బోకవతి యొక హంసతూలికాతల్పమున గూర్చుండి యుండుట దిలకించి యామెను డాయంజనుదెంచి చకితబాలకురంగ లోచనయైయున్న యామె కిట్లనియెను. "తలోదరీ! నన్నుఁ గని యించు కంతయు భీతిల్లకుము. నీ కుపకార మాచరింప సాధ్యమైనంతవరకు ప్రయత్నించి చూచెదనేగాని నీ కెట్టి యపకారమును జేయగలాడ నుకాను. నేను యంగదేశమును పరిపాలించు యశఃకేతుఁడను భూపా లుఁడను. నీవెవ్వతెవు. ఇందుండ గతమేమి. నీ తలిదండ్రు లెవ్వరు. అసమాన రూపలావణ్యపయోరాశివగు నీవు నీయెల జవ్వనమంతయు నేల యీవిధి వ్యర్థపరచుచున్నావు. నీదగు సౌందర్యవిశేష మాల కించి నిను జూడవలయునను దలంపున వేయేల నిను మోహించి యిచ్చటి కిట్లరుదెంచియుంటిని. నీ వృత్తాంతమంతయు సవిస్తరముగా దెల్పి నాయభిమత మీడేర్తువని తలంచెదను."

అని బల్కుచున్న యాభూపాలున కా యువతీలలామంబు సవిన యముగా నమస్కరించి "భూపాలచంద్రమా! కొండొక యకృత్యము నకై తండ్రి కోపంబునకు గురియై యాతనిచే శపింపబడి యిట్లున్నాను. తమ యభిమతమీడేర్చుట కెట్టి యాటంకము జెప్పుటకును తమ్ము జూచిన సుందరి యశక్తురాలగు ననుట నిస్సందియము. అట్టియెడ నే నట్లన్యథా వచింపగలను కాని నాకొక్క వ్రతముగలదు. అష్టమి చతుర్దశి ఈ రెండుతిథులయందును నా యిచ్చవచ్చిన స్థలమునకు

బోవుచుండును. ఎచ్చటికేగుచుంటినో యేమి చేయుచుంటినో దెలుప మని తమ రడుగరాదు. ఇందులకు దమ రవశ్య మంగీకరింతురుగాదె" యని విన్నవించెను. భూపాలుఁ డామెను గనుగొన్న దాదిగ మరుబే దనచే పీడితుఁడై యెట్లైన నామెను గవయుటే జన్మకు సార్థకమైనటు లెంచి యున్న వాఁడగుటచే యందుల కనుమతించి యామెను గాంధర్వ విధిఁ బరిణయమాఁడెను.

అష్టమి చతుర్దశీ తిధులయం దామె యెచటికో బోవుచు భూపా లుని దనవెంట రావలదనియును దమ శయనాగారమున కుత్తరమున నున్న దిగుడుబావిలోనికి దిగవలదనియు జెప్పుచుండెను. భూపాలుఁ డును గొన్నిదినములవరకు యటులనే యొనర్చెను. తదుపరి యొక దిన మున నామె పోవుచుండగా వెనువెంట రహస్యముగా నేగి యామె చర్యలన్నియును గని పెట్టుచుండెను. ఆమె సముద్రమునుండి యావృక్ష మధిరోహించి కొంతవరకు గాన మొనరించెను. ఇంతలో నొక మక రము యా వృక్షమును సమీపించెను. తోడనే యాబాలిక వృక్షము నుండి దిగి యా మకరమును సమీపించెను. ఆమొసలి యామెను యొక్క గుటకను మ్రింగివైచెను. యశఃకేతుఁ డిదియంతయు దిలకించి సహింపనోపక దనచే నున్న చంద్రహాసముతో నామకరమును జక్కాడి దాని గర్భమున నున్న యాసుందరిని వెలికిదీసి తనతో గృహాంతర్భాగమునకుఁ గొనిపోయెను.

పిమ్మట గొన్ని నిముషముల కా లతాంగి స్మృతి దెచ్చుకొని జరి గినదంతయు భూపాలునివలన విని యాతనికి బునరభివందన మాచ రించి "భూపాలతిలకా! తమవలన నేటికి నాశాపము దీరినది. ఇంక నాజననీజనకుల జేరబోయెద" సెలవిమ్మనిన భూపాలుఁడు "తన్వీమణీ! నీకిట్టి శాపమెట్లు కలిగెనో దెలుపుమని" బల్కెను. అంత నాసుందరీ మణి "భూపాలమౌళీ! నేను మృగాంక సేనుఁడను గంధర్వరాజ కుమా ర్తెను. మృగాంకవతియను పేర బరగుదానను. నాకు గాన మభిమాన

విద్య. అనుదినంబును విష్ణుకీర్తనల బాడుచుందును. నాజనకునకు నాయందెంతయో ప్రేమ. ఎన్నడును తనపంక్తిని నేను లేకుండ భుజించువాడుగాడు. ఇట్లుండ నొక్కనాడు విష్ణుభక్తి పారవశ్యమున మైమరచి గానమొనరించుచు సాయంకాలమగువరకును నేను భోజనమునకై గృహమునకు రామానితిని. అంతవరకును నాజనకుఁడు నిలువజాలక యొంటిగా భుజించి అధికదుఃఖమున జనించిన క్రోధము నాపుకొనజాలక "ఓసీ! దుర్మతీ! యింట నీకొరకై భుజింపకుండ కూర్చుందుననియైన దలంప కిట్లేల జాలమొనర్చితివి. ఇట్లొర్చినందులకై సముద్రమధ్యమున నివసించుచు ప్రతి పక్షమున అష్టమీ చతుర్దశలయందు మకరరూపరాక్షసునిచే కబళింపబడుచుందువుగాక" యని శపించెను. ఆశాపమునకు భీతిల్లి యాతని పదములబ్రాలి ప్రార్థింప నాతడు "నిను కాంక్షించి యెవ్వడు నీసముద్రమున కరుదెంచునో వానివలన శాపవిముక్తి కలుగునని జెప్పెను." తదుపరి యాతడు వింధ్యాద్రిపై తపమొనరింపనేగెను. "నాజనకుని సందర్శించి పెక్కుదినము లయ్యెను. ఇంక నాకనుజ్ఞ దయసేయుడు మన శయనాగారమున కుత్తరమున నున్న దిగుడుబావిలో మునిగిన తమరు సౌఖ్యముగ తమపురంబున కేగగలరు. అని విన్నవించిన" వినియాభూపాలుఁడు "తన్వీమణీ! నీతో చిరకాలసాంగత్యము లభించుననిగదా యా రక్కసుని యుక్కడంచితిని. అందులకై నీ వొనర్చునది యిటులెడబాసి వియోగానలమున నను ముంపజూచుటయా! ఇట్లనుటచే నిన్ను నీ జనకునియొద్దకు బోవకుండ నాయొద్దనే యుండుమని బల్కుచుంటినని దలంపకు. మరికొన్ని దినములు నీసాంగత్యలాభము గల్గింపుము. అంతియె చాలును. అంతమాత్రముననే దృప్తివహింతును." అనిబల్కియామెను యొక వారము దినములు తనతో నుండున ట్లొడబరచెను.

అంత నొక్కనాఁ డామెను దన శయనాగారమున కుత్తరదిశ యందున్న దిగుడుబావిచెంతకు దోడ్కొనిపోయి యిందు జలకేళి

సమరించతము రమ్మని యామెను లోనికి రప్పించి యామెతోగూడ దన పురంబును స్మరించుకొని మునింగెను. ఆదంపతు లిరువురును మరల కనుల విప్పునంతకు అంగదేశము రాజసౌధసమీపమున గల తటాక మున దేలిరి. మృగాంకవతి యట్లగుటకు చింతించి తండ్రియొద్దకు బోవ యత్నించెను గాని యాతనితో శాపము దీరినపిమ్మట నిలుచుటయే గాక యా దిగుడుబావిలో దిగుటవలనగూడ స్వేచ్ఛాగమనము ఆకాశ గమనము నశించుటచే తండ్రికడ కేగజాలదయ్యెను. భూపాలుఁ డామె నధికముగ నాదరింతునని యూరడించి దేవేరినిగా నొనర్చి యామెతో సుఖించుచుండెను.

దీర్ఘదర్శియు రేడరుదెంచిన వార్త విని యచ్చటి కరుదెంచి మరల దన పదవియందు ప్రవేశించెను. భూపాలుఁ డీవరకు దీర్ఘదర్శికైన దర్శన మొసంగుచు, రాజకార్యముల వినుచుండెడివాడుగాని మృగాం కవతిం దోడ్కొనివచ్చినదాదిగ మంత్రిపుంగవునికైన దర్శన మొసంగ డయ్యెను. అయ్యది దిలకించి దీర్ఘదర్శియాత్మహత్యగావించుకొనియెను.

విక్రమార్కభూపాలచంద్రమా యీ కథ నాలించితివి గదా? మంత్రియగు దీర్ఘదర్శి రాజ్యపరిపాలన మొనర్పజాలక మరణించెనా లేక తన కరస్థమగు రాజ్యము భూపాలుఁడు గైకొనునని మరణించెనా, లేకున్న నేయితర కారణమున మరణించెను వచింపుము. తెలిసి యుండియు దెలుపకున్న వెనుకటిశాపమే యనిన విక్రమార్కుడు ఓయీ! నీవు దెల్పిన రెండు కారణములలో నెద్దానిచేతను మంత్రి మరణింపలేదు. స్త్రీలోలతావ్యామోహముగల భూపాలునకు మృగాం కవతి వృత్తాంతమును దెల్పి యాతనికి మరింత స్త్రీవ్యామోహము గల్పించితినే, ఇందువలన గలుగు యపవాదుల భరింపజాలనే యని దలపోసి మరణించెను. అనిన విని భేతాళుడు వటవృక్షమును జేర బోయెను.



# ధర్మధ్వజుని కథ



విక్రమార్కుఁడు మరల నావటవృక్షమును జేరి భేతాళుని బంధించి మూపున బెట్టుకొని త్వరితగమనంబున నడచుచుండ భేతాళుఁడు భూపాలున కిట్లనియెను. "నీశ్రమనివారణార్థ మొక కథ జెప్పెద నాకర్ణింపుము." అని పల్కి యీక్రింది కథ జెప్పసాగెను.

తొల్లి యుజ్జయినీపురీవరంబును ధర్మధ్వజుఁడను భూపాలుఁడు పరిపాలించుచుండెను. అతని కిందులేఖ, తారావళి, మృగాంకవతి యను పేర్లంబరగు ముప్వురు రాణు లుండిరి. ఆ భూపాలుఁడా తరుణీమణులతో సుఖంబున గాలక్షేపన మొనర్చుచుండెను.

ఒక్కనాఁడు ధర్మధ్వజుఁడు వసంతోత్సములందుపాల్గొని చాలవరకు మేల్కాంచియుండుటచే సమీపముననున్న యిందులేఖ గృహంబున విశ్రమింపదలచి యామె యంతఃపురంబుజేరెను. పరమపతివ్రతాతిలకమగు నాపట్టమహిషి నాతని నెదుర్కొని కైదండయొసంగి శయనగృహమునకు దోడ్కొనిపోయెను. ధర్మధ్వజుఁ డామెతో కొంతవరకు సరససల్లాపములాడెను. ఆసమయంబున నామె కేశబంధమున శృంగారముగ నలంకరింపబడిన నల్లగలువపూవునుండి యొక దళమూడి యామె యూరుతలంబున బడియెను. ఆయాఘాతమున కామె సొమ్మసిల్లి భూమిపై వ్రాలెను. యేస్థలమున నాగలువదళముపడియెనో యచ్చట గాయమయ్యెను. ఇందులేఖ బిట్టుగావిలపించుచుండ భూపాలుఁడు తనకు నిద్రాభంగమయ్యెనను విసువుతో పరిచారకుల బిలచి యామెకు శైత్యోపచారము లాచరించి స్వస్థచిత్తను చేయుని యోగించి రెండవదేవియగు తారావళి యంతఃపురమునకు బోయెను.

ఆసాధ్వీమణియు నాతనిననేకవిధులబూజించి కొంతవడి యాతనితో గ్రీడించి శయనగృహంబున దగినవాయుప్రసారము లేదని భూపాలుఁడన తారావళి యంతఃపురంబునుండి యాతనితో నుప్పరిగ పైకరిగి యచటనున్న యొక హంసతూలికాతల్పమున భూపాలుని విశ్రమింప జేసి తనకును నిద్రవచ్చుటచే యాతని పజ్జనే తానుగూడ బరుండెను. అటకొన్ని నిమేషము లామె బరుండి నిదురరామిచే నటునిట దొరలుచుండ నామెయురస్సీమగల వసనము ప్రమాదవశమున నొసరిల్లెను. అంత పరిపూర్ణకళలతో విరాజిల్లుచున్న చంద్రునిశీతకిరణము లామె నెమ్మేనిపై బ్రసరించెను. తోడనే యామె నాశరీరమున కగ్ని సోకినట్లు మంటలెత్తుచున్నదని బిట్టుగ రోదనము చేయుచు తన పజ్జనే పండుకొనియున్న ధర్మధ్వజునకుగూడ నిద్రాభంగము గల్గించెను. ధర్మధ్వజుఁడు తన భార్యయొడలిపై చంద్రకిరణప్రసారమున నగ్నిసోకినట్లు కంది యెఱ్ఱబారియుండుట దిలకించి యనునయవాక్యముల నామె నూరడించి పరిచారికల బిలువనంపి యామెకు పరిచర్య సేయ నియమించి మృగాంకవతి గృహమునకు బయలుదేరెను.

మృగాంకవతి దన చెలువలవలన విభుం డరుదెంచుచున్న వార్త విని యాతని నెదుర్కొని విధివిధానంబున నాతని బూజించి లోనికి దోడ్కొనిపోయెను. అప్పటి కించుమించుగ నేడెనిమిదిఘుడియల రాత్రి మిగిలియుండెను. ఇంకను పక్షుల కిలకిలారావములుగాని జనుల సంచారసవ్వడిగాని లేకుండనుండెను. ప్రపంచమంతయును నిద్రాదేవి యొడిలో మందమారుతసంచారమువలన మేనులు మరచి నిద్రించుచుండిరి.

మృగాంకవతి విభునితో నొకటిరెండుఘడియలు సరససల్లాసముల దేలి, యాతనితో విశ్రమింప యత్నించుచుండ నెచ్చటనో ధాన్యమును దంపుచున్నట్లు ధ్వని యస్పష్టముగా వినవచ్చెను. తోడనే

యామె కవ్వాన నార్చి మూర్ఛిల్లెను, భూపాలుఁడనవగు శైత్యోప చారముల నెక్కింటి నొనర్చి యామెను మూర్ఛదేర్చి "తన్వీమణీ! ఇటులాకస్మికముగ మూర్ఛిల్లితి వేమన నాసాధ్వీలలామ దేవా! యేమి చెప్పుదును. దూరమున నెవ్వరో ధాన్యమును దంపుచున్నట్లు ధ్వని వినవచ్చెను. తోడనే నాయీరెండుచేతులయందును రోకలి కొట్టుటవలన నెచ్చట పుండ్లుపడునో యచట పుండుపడి యనంతముగ నన్ను బాధింపజొచ్చినవి. చూడుడని తనకరంబుల నాతనికిఁ జూపెను" భూపాలవతంసు డెంతయో నాశ్చర్యపరవశుఁడయ్యెను.

"విక్రమార్క నరేంద్రచంద్రమా! వింటివా. యాభూపాలమౌళి రాణుల చరిత్రము. ఒకతె నల్లగలువ దళముయొక్క పతనమువలన దేహమున గాయము గలదయ్యెను. వేరొకతె శీతనయూఖు శీతకిరణ ప్రసారమున నగ్నిసంతప్త దేహయయ్యెను, మరొకతె రోకటిపోటు ధ్వనుల నాలించిన మాత్రముననే కరతలంబున గాయంబులు గల దయ్యెను. ఈ మువ్వురి యందు యేరాణి యధిక సుకుమారి. ఆమె యాధిక్యమున కేమి కారణము. దెలుపుము. దెలిసియుండియు దెలు పకున్న వెనకటి శాపమే యనిన విక్రమార్కుఁడు నవ్వుచు" ఓయీ! మృగాంకవతియే యిందధిక సుకుమారి. మిగిలిన యిరువురును దమ దేహములకెదో దగులుటవలన వేదనబొందిరిగాని యీమె ధ్వని విని నంతమాత్రముననే చేతులలో గాయములు గల్గెను. ఇందువలననే యీమె యధికురాలని జెప్పవలయును." అని విక్రమార్కుడు బలుక నాతని మౌనవ్రతమునకు భంగమగుటయు భేతాళుఁడు మరల వట వృక్షమును జేరంబోయెను.



# యశోధనుని కథ



తదనంతరము విక్రమార్కుఁడు మరల వటవృక్షమునుఁ డాయంజని భేతాళునిబట్టి మూఁపుననిడుకొని వచ్చుచుండగా భేతాళుఁడు రాజా ! నీకింతటిదుర్ఘటకార్యము తటస్థించెను. పరోపకారమునకై యింతపాటుపడుమానిసిని నిన్నొక్కనినే జూచితినిగాని యింకొక్కరీవసుధపై నుండరని నిక్కముగా వక్కాణింపగలను. ఇన్నిపర్యాయములు కార్యవిఫలుఁడవైనను కార్యమునుండి విముఖుఁడవు గాకుండ నుంటివి. కానిమ్ము, శ్రమనివారణార్థమొక కథఁ జెప్పెద నాలింపుము. అని బల్కి యీక్రింది కథ యిట్లు జెప్పసాగెను.

తొల్లి గంగాతీరమున కనకపురంబను పురీవరంబొండుగలదు. సకల సంపదలతో విలసిల్లు నాపురీవరంబును సకలసద్గుణగరిష్ఠుండగు యశోధనుఁడను క్ష్మాతలేంద్రుఁడు పరిపాలించుచుండెను. ఆతని పరిపాలనంబున ప్రజలెల్ల సుఖులై యానందమయజీవితముల గడపుచుండిరి.

అప్పట్టణంబునఁగల రత్నసెట్టియను తురీయజన్ముని కున్మాదినియను పుత్రికామణి యుండెను. తనకు చిరకాలముదనుక సంతతి నిలువకుండుటచే నామెకు నామకరణసమయమున నేపేరునుబెట్టక యామె నున్మాదినియని బిలువ సంకల్పించుకొని యటులనే బిలచుచు నామె నల్లారుముద్దుగా బెంచెను. భాగ్యవంతుడగు జనకున కేకమాత్రసంతానమగుటచే నామె యల్లారుముద్దుగా బెంపబడుట కేమి యాటంకముండును. క్రమక్రమమున నామె దినదినప్రవర్ధమానయై సంపూర్ణయౌవ్వనియై యుండెను. ఆమె సౌందర్యమట్టిట్టిదని వచింపరానిది. ఉన్మాదినియని నామమాత్రమేగాని యామె తనుగాంచిన ప్రతియువకుని విరహాభరంబున నున్మాదులజేయగల సౌందర్యవతియని వక్కా

ణించినజాలదే ; రత్నసెట్టియు సర్వాంగసుందరియగు దన కుమారీ మణికీడువచ్చు సౌందర్యశాలి దమ వర్ణంబున లభింపడనియు, యట్టి సుందరీమణిని సౌందర్యహీనుఁడైన కులస్థున కొసంగుటకంటె నితర కులజున కొసంగుటయే శ్రేయమని దలంచి యగ్రజన్ములగు బ్రాహ్మ ణులామెను గైకొన సందేహింతురని దలంచి, భూపాలతిలకుఁడైన యశోధనుఁడు బాల్యమున దనయొద్ద నధికముగ చనవుగల్గి వర్తించు వాఁడగుటచే తన కూమార్తెను తప్పక పరిగ్రహించుననియు, తన మాట కెదురాడునంత యప్రాజ్ఞుడు కాడనియు దలంచి యొక్కనాడు సభాతలంబునకుఁబోయి యాతని కిట్లనియెను. "దేశమునగల యమూల్యా తరంబులగు వస్తువులెవ్వియైన భూపాలునకె వశ్యభోగములై యుండునను బుధులవాక్యాళినాలించి రూపలావణ్యాదుల లోకమున దనకీడులేక వెలుంగుచున్న నాకుమారీరత్నమును దేవరవారికి సమర్పించి ధన్యు డనుగాఁ గోరుచున్నాడను. దేవరవారందుల కనుమతింతురుగాక" అని బల్కి యూరకుండెను. భూపాలతిలకుండును ఆకన్యామణిసౌంద ర్యమునుఁగూర్చి కర్ణాకర్ణికగా వినియున్నవాఁ డగుటచే నవ్వైశ్యోత్త మునిపల్కులకలరి సాముద్రికాగమవేత్తలఁ బిలిపించి రత్నసెట్టి కుమార్తెయగు నున్మాదిని లక్షణముల బరీక్షించి తనకు దేవి యగు టకు వలయు శుభలక్షణము లామెయందు గలిగెనేని, వివాహమహో త్సవమున కఖిలంబును సిద్ధపరుప ననుజ్ఞ దయసేయుఁడని నియమించి రత్నసెట్టిని గౌరవపురస్సరముగ నింటికనిపెను.

సాముద్రికశాస్త్రజ్ఞులు, యున్మాదినిని బరీక్షించియామె సర్వశుభ లక్షణసమన్వితయై యుండుటెరిగియు, ఆమె శుభలక్షణసమన్వితయని జెప్పిన రాజామెను పెండ్లియాడితీరుననియును, అపుడు స్వచ్ఛమైన క్షాత్రకుల మపవిత్రమగుటయే కాక భూపాలుని భావిసంతతికూడ క్షాత్రతేజరహితమై యుండుననియు భావించి, యెల్లరునుకూడ బలుకు

కొని భూపాలుని సన్నిధి కేగి యాతని కిట్లు జెప్పిరి. "యశోధన భూపాలా! ఆమె సర్వాంగసుందరియేయగునుగాని లాభమేమి, కల్పవృక్షమును కాలనాగులాశ్రయించినట్లు యామె యొడలిపైన శుభ శూచికచిహ్నములున్నవి. దేవరవారాకన్యను పరిగ్రహించుట క్షేమ కరముగాదు." అని బల్కి మిన్నకుండిరి. భూపాలుడు వారివాక్యముల విశ్వసించి పరిణయప్రసంశ మానుకొనెను.

రత్నసెట్టియు యందులకెంతయో చింతించి సంపూర్ణయౌవ్వనియై యున్న కుమార్తెకికనైనను పెండ్లిసేయకున్న పదుగురు పరిహాసింతు రని దలంచి రూపలావణ్యాదులుగల్గిన బలధరుఁడను సేనానాయకుని దన కుమార్తెకనుకూలవరునిగాదలంచి యాతనితో మాటలాడి యొక్క శుభముహూర్తమున పరిణయమహోత్సవము జరిగించెను. బలధరుఁడును నున్మాదినియు సుఖంబుగ గొన్ని దినములు గడపిరి.

కొంతకాలమరిగినపిమ్మట నొక్కనా డున్మాదిని యుద్యానవనంబున బుష్పాచయమొనర్చుచు విహరించుతరి భూపాలతిలకుండైన యశోధ నుడుగాంచి, యామె సౌందర్యమున కలరి, యీామెయే రత్నసెట్టి కుమార్తెయైన నున్మాదినియని యెఱుంగక కన్యయైయుండెనని భావించి యామెపై దన యనురాగమును నిలిపెను. క్రమక్రమముగా నయ్యది మోహముగా బరిణమించి భూపాలుని నిద్రాహారవిహార విముఖునిగావించెను. ఆలతాంగిపైగల మక్కువ యెక్కువయై యుండ నాతఁడు రాజకార్యవిముఖుఁడై యేకాంతమున గూర్చుండి యాలతాంగిసోయగమునే దలంచుచు, యాసుందరి పొందెట్లుకలు గునాయని దలపోయుచు కాలముగడుపుచుండెను.

ఇట్లుండగా భూపాలుఁడు బలధరుని భార్యను గనుగొని మోహపర వశుఁడై యుండెనను వార్త యొక్కటి బయలుదేరి నూరంతయు వ్యాపించెను. బలధరునకు గూడ నీవార్త దెలియవచ్చెను. ఉదార మనస్కుఁడైన యాతఁడు తన మనంబున నిట్లు వితర్కింపసాగెను.

భూపాలుఁడు నాయిల్లాలి గాంచి మోహించినట్లు దెలియవచ్చినది. అందుల కనుకూలముగ భూపాలుఁడు రాజకార్యముల పొంతకురాక తరచుగా నేకాంతమున గూర్చుండి దనలోదానే దలపోయుచుండెను. భూపాలుని యభిమత మీడేర్పకుండ నూరకున్న యెడల సంతాన హీనుఁడైన యీ భూపాలతిలకుఁడు మరణించును. అపుడు ప్రజానీక మెల్లను రాజు లేకుండుటవలన గలుగబోవు మహానర్థముల బొందవల సిన వారగుదురు. భూపాలుని యభిమత మీడేర్చినచో కులసతిని గోలుపోవలసి వచ్చును కాని ప్రజలెల్లరు సౌఖ్యమొందుదురు. భూపా లుఁడు సంతసించును. ఇంతియేకాక భూపాలుని యుప్పాదిని వృద్ధినొం దిన యీ దేహము భూపాలున కధికామోదము గూర్చినందు ధన్యత జెందును. అని యేమేమో దలపోసి యేకాంతముననున్న భూపాలుని సమీపించి "దేవా! తమతో గొన్ని వాక్యముల జెప్పవలయునని దలంచి యిట్లరుదెంచితిని తప్పులున్న క్షమింపవలయును. నేను తమ సేవకుఁడను. తమకు సౌఖ్యమొనగూర్చునట్టి కార్యమెద్దియైనను జేయ వలసిన వాడను తమరు నాయిల్లాలిని గాంచి మోహించి యుండిరని దెలియవచ్చినది. అవశ్యము మీరామెను చేకొనవచ్చును. ఏలనందురా! నేను సేవకుఁడ నగుటచే నామె మీకు దాసి; దాసి తనయజమానున కవశ్యము సౌఖ్య మొనగూర్పవలయును గదా? గావున తమరు విచా రము దక్కి యామెను గొని సుఖంబున నెప్పటియట్లు రాజ్యమును బరి పాలింపవలయును. తమ రిన్నిదినములవఱకు సభాతలంబునకు రాకుం డుటచే యెన్నియో యవశ్యకర్తవ్యములగు కార్యము లాపుచేయబడి నవి. ప్రజలెల్లరును దమకు దోచినరీతిగా తమపై నేరారోపణ మొన రించుచున్నారు. అని వినయుఁడై బల్కెను. ఆపల్కులాలించి భూపాలు "డోయీ! ఆమె నాకు దాసియైనను పరకాంతగదా! పరకాంతను దలంచినంతనే పూరుషుఁడు నరకకూపంబున నవయవలసిన వాడేగదా? ఆమెను దిలకించి పదునెనిమిదేడుల ప్రాయముకంటె నెక్కుడు

వయస్సు గలదిగా నుండిన కన్యకామణి యని దలంచి మోహించితిని గాని వాస్తవమెఱింగిన పిమ్మట యెంతయో జింతించుచున్నాను. నేనట్టి పాపకార్యాచరణమున కొడిగట్టును. పరకాంతను కలయందైన దలంపనోపను.” అని భూపాలుఁడు బలుక బలధరుఁడు దేవా! అటులైనచో నామెను దేవళమున దిగవిడచి చనియెదను అప్పుడామె పరకాంతగాదు గావున తమ రామెను గొననగును. నయ్యది ధర్మేతర మెంతమాత్రమును గాజాలదు. అని మరల బల్కుటయు భూపాలుఁడు బలధరా! ఇంక నీవామాటల నాయెదుట బలుకవలదు. వెడలిపొమ్మని బంపివైచెను.

ఆహారగతప్రాణులైన జీవులు ఆహారములేకుండ నెన్నిదినములు జీవింపగలవు. ఆహారవిహారనిద్రలు లేక కృశించుచున్న భూపాలుఁడు క్రమక్రమముగా క్షీణింపసాగెను. ఆస్థానవైద్యులెందరో యాతనికి దగిన యౌషధమొసంగి యాతని రక్షింప యత్నించుచుండిరి. కాని వారి ప్రయత్నములన్నియు విఫలములయ్యెను. శరీర మనారోగ్యముగ నున్న వైద్యులు మాన్పగలరు గాని మనోరోగముల వారెట్లు మాన్పగలరు. భూపాలుఁడు కొలది దినములలో మరణించెను.

“తనభార్యను గోరి యామెపొందు లభింపకపోవుటచే గదా భూపాలుఁడు మరణించెను కట్టా! ఇన్నిదినములదనుక యాతని యన్నమును దిని యాతని యభిమత మీడేర్చ లేకపోయితినే” యని దలంచి బలధరుడు మరణించెను.

విక్రమార్కభూపాలా! ఈ యిరువురియందున నెవ్వరధికులు. నీకు దెలిసియుండియు దెలుపకున్నయెడల నీశిరంబు వేయి వ్రక్కలగును జుమీ యనిన విని విక్రమార్కుఁడు భేతాళునితో “నోయీ ఇందు భూపాలుడే యధికుఁడు గాని బలధరుఁడుగా”’డని బల్కెను. అంత భేతాళుఁడు మరల వటవృక్షమును జేరబోయెను.



# రూపవంతుని కథ



విక్రమార్కుఁడు మరల నా వటవృక్షము చెంతకుఁబోయి భేతాళుని పట్టుకొని బంధించి మూఁపున బెట్టుకొని వచ్చుచుండగా నాతఁడు వినుమని యీక్రింది కథ యిట్లు జెప్పసాగెను.

తొల్లి హేలావతియను పురీవరంబును రాజచంద్రుఁడను భూపాలుడు పరిపాలించుచుండెను. ఆభూపాలునకు రూపవంతుఁడనుయౌవ్వనవంతుఁడగు కుమారుడుండెను. సంప్రాప్తయౌవ్వనుఁడగు కుమారునకు వివాహ మఖండవైభవంబున గావించి సముచితపరివారమును దోడొసంగి యాతని నత్తవారింటికిఁపి కోడలిని దోడ్కొనిరా నియమించెను.

రూపవంతుడు మామగారియింట నధికాదరణంబున జూడబడుచు కొన్నిదినంబు లత్యధికసుఖంబున కాలంబుగడపి యొక్కనాడు తన మనంబున నిట్లు తలపోయసాగెను. అహా! మందబుద్ధినై యిన్నిదినంబులవర కిచ్చట గూర్చుంటిని శీఘ్రమున మరలి రావలసినదని జనకుఁడాజ్ఞాపించి యున్నమాట మరచితిని. తండ్రి కోపగించునేమోకదా యని పరిపరివిధంబుల నాలోచించి తన భార్యతో మరునాడు బయలుదేరుట కనుజ్ఞ నొసంగుఁడని మామగారిని యడుగుటకు సంకల్పించుకొనియెను.

ఆదినమున రాత్రి భోజనసమయమున రూపవంతుఁడు మామగారితో తానరుదెంచి పెక్కు దినము లైనదనియును అత్తవారింట నెక్కువ దినములున్న లోకులు నిందింతురనియును తన జనకుఁడు మరల శీఘ్రకాలమున దిరిగి రావలయునని యాజ్ఞాపించి యున్నాడనియు జెప్పి దన భార్యనుగూడ బంపవలయునని ప్రార్థించి మరుచటి దినమున ప్రయాణమున కనుజ్ఞ యొసంగుఁడని వేడుకొనియెను. అంత

రూపవంతుని మామగారు అతనితో నోయీ! నీవరుదెంచి యొకమాస మైనను గాలేదు యింతలో నింత తొందరపడియెద వేల నాలుగైదు దినములు పోనిమ్ము ఆవల మంచిముహూర్తముజూచి పిల్లను పంపించెద నుండు మనియెను.

రూపవంతుఁడును పెద్దలగు వారిమాటల కెదురాడనేరక నాలుగైదు దినంబులరిగిన పిమ్మట మరల మామగారితో నాలోచించెను. అంత నాభూపాలుఁడు శాస్త్రజ్ఞుల పిలువనంపి తన కుమార్తెను పంపుటకు ముహూర్తము నిర్ణయింప నాజ్ఞాపించెను. వారును పంచాంగములటునిటు దిరుగవైచి రేపు సోమవారము తూర్పునకు వారశూల మంగళవారము కన్నకుమార్తెను బంపకూడదుగదా! బుధవారమున నక్షత్రము మంచిదిగాదు లక్ష్మివారము చవితిగనుక వీలుకాదనియు శుక్రవార మాడుబిడ్డలను బంపరాదనియును శనివారము షష్ఠియగుటచే మంచిది కాదనియును, ఆదివారమున పిల్లకు తారాబలము చాలలేదనియును; యటులే యొక పక్షము దినములవరకును మంచి ముహూర్తము లేదనిరి. అంతట రూపవంతుఁడు చేయునదిలేక యాపక్షముదినములును యచ్చటనే యుండుటకు నిశ్చయించుకొనెను.

శాస్త్రజ్ఞులచే నియమింప బడిన యొక శుభముహూర్తమున రూపవంతుఁడు భార్యతోడను భార్యసోదరుని తోడను యుచిత పరివారము తోడను నిజపురంబునకు బయలుదేరెను. కతిపయ దినంబులకు వారొకపురంబుజేరి యచట విడిసిరి. అచ్చట వారితో ప్రసంగింప హేలావతిజేరుట కచ్చటినుండి రెండు మార్గములు గలవనియును అందొక మార్గమున బోయిన సుమారు నెలదినములు పట్టుననియును రెండవమార్గమున బోయినయెడల పదునైదుదినములలో బోవచ్చుననియును కాని మార్గమంతయును యరణ్యమగుటచే ఘాతుకమృగముల భీతి యుండుననియు జెప్పిరి. రూపవంతుఁడు శీఘ్రగమనంబున

బురంబున కేగవలయునని దలంచి తాము పెక్కండ్రై యుండుట చేతను, ఆయుధబలగ ముండుటవలనను ఘాతుక మృగములకు భీతిల్ల నవసరము లేదనియు దలంచి యరణ్యమార్గమున ప్రయాణము సాగింప పరివారమున కాజ్ఞయొసంగెను.

పగటిపూట ప్రయాణమును సాగించుచు రాత్రియగునంతకు గుడారముల వైచుకొని విశ్రమించుచు పదుగురువీరభటులు రాత్రిభాగమున కావలి యుంచుచు ఘాతుక మృగములవలన నేభయంబును బొందకుండ పయనముజేసి నేడుదినంబుల కరణ్యమధ్యమున కరుదెంచిరి. భటులెల్లరును దుర్గమమార్గముల నడచుటచే నధికాయాసమునకు లోనైరి. యెప్పటివలె గుడారములలో శయనించిరి. పదుగురు వీరభటులుమాత్రము కేల నాయుధములబూని జంతువులు రాకుండ నాటంకబరచుటకై వైచిన యగిడిమంటల సమీపమున గూర్చుండి చలిగాచుకొనుచుండిరి. కాని వారుగూడ నధికాయాసమునకు లోనయిన వారగుటచే నిదుర నాపజాలక యొక్కరొక్కరుగ శయనించిరి.

అంత నొక్క కోయవాడరుదెంచి రూపవంతుని యాతని యనంగుప్రియురాలి సోదరుని మత్తుమందుచే మూర్ఛితులజేసి తన భుజములపై వారినుంచుకొని దొడ్డొని చనియెను. యుదయమున నారాట్కుమారీ మేల్కాంచి నాథుని సోదరుని గానక పరితపించి పలువుర నలుదెసలకు వెతుకబంపెను. మృగముల వాతబడియుందురని తలంచుట కిసుమంతయును నవకాశము గలుగుటలేదు. అటులనే యైనయెడల నిరువురి శయనతలంబులును రక్తసిక్తములు గావలసినవే గాని యిట్లుండుటకు గారణ మగపడదు. వీరెచ్చటి కేగియుందురు. అరణ్యమగుటచేత నేజంతువునైన దూరమున బొడగాంచి యద్దానిని వధింపవలయునని బోవమరరదు లిరువురును బోయి యుందురా? అట్లైనను సూర్యోదయమైన నాలుగైదు ఘడియలకేని తిరిగి రావలసియుండెను.

ఇంతవరకును వీరురాకుండుటచే నేదో మోసము, నా కెఱుకకురాని మోసము నే నూహింపరానిది జరిగియుండవలెను. వారు నిరపాయంబుగ దిరిగివత్తురా ? రాకుందురా యను సందియమే నన్ను బాధించుచున్నది. వారి జాడ గాన్పింపకున్న నే నధోగతి జెందవలసినదానను గదా ?" అని యేమేమో దలపోయుచు నా రాట్కుమారి నిముషమొక యుగమువోలె గడపుచుండెను. అలతాంగి విభీతచేతస్కురాలై తన మనోహరుడును సోదరుడును సురక్షితులై తిరిగి రావలయునని యౌవనదేవత ననేకవిధముల స్తుతించెను. ఈమె యరణ్యరోదనము వినువా రెవ్వరు ?

ఆమెచే నలువంకలకును బంపబడిన మనుష్యులు పెద్దయుంబ్రొద్దు ద్రిమ్మరి యౌవనంబంతయును వెదకిరి. ఒక్కచోనున్న కాళీగుడి గాన్పింప నచటికేగిచూడ రూపవంతుడును రాకుమారుడును ఖండితశిరస్కులై పడియుండుట గాంచిరి. అచ్చటికేగిన నలువురిలో నిరువురట కాపుగా నిలచి మిగిలిన యిరువురును దమ యజమానురాలి కావృత్తాంత మెఱింగింప జవంబునపోయిరి.

రాకుమార్తె యాయుస్సేవకులవలన దన సోదరుడును విభుడును గూడ కాళికకు బలిగా నొసంగబడిరని విని మనంబున ఘనంబగు చింతనొంది యాకస్మికదుఃఖవార్తాశ్రవణంబున మూర్ఛిల్లెను. చెలికత్తె లొనరించు నుపచారములచే గొంతవడికి దెప్పరిల్లి భటులతో నోరీ ! నన్ను మీరా కాళిగుడికి దోడ్కొనిపొండు. నావిభుని కళేబరమైన దర్శించి కొంతశాంతాత్మురాలనగుదునని బల్కెను. భటులు దారిజూప కాళికాలయమునకుబోయి గర్భాలయమున ఖండితశరీరులై యున్న విభుని సోదరుని జూచి యధికముగ దుఃఖించి సమీపంబుననున్న భటులను దూరముగాబో నాజ్ఞాపించి గర్భాలయకవాటద్వారముల మూసి జగన్మాతయగు కాళికకు నమస్కరించి తల్లీ ! భక్తజనకల్పవల్లీ !

నీపాదభక్తురాలనగు నాకిట్టివిపత్తు సంభవింపజేయుట నీసంకల్పమే యని దలంతును. లేనిచో యిట్టి యపాయము గలుగకుండ నావిభుని సోదరుని వధింపశంకించువానిని వారింపకుందువే కాత్యాయనీ తల్లీ ! నావిభుని బలిగొనుటచే నాతని యర్ధదేహమగు నన్ను విడచుట భావ్యముగాదు. నాయీదేహమునుగూడ గైకొని సంతృప్తినొందుము. విభుని గోల్పోయి యత్తవారింటికే మొగముపెట్టుకొని పోవుదును. వారు మాకుమారుఁడేడని ప్రశ్నింప వారల కేమని యుత్తరమొసంగుదానను? కల్లకల్ల నావిభుడిట మృతినొందుటచే నాకత్తిల్లు సందర్శించు భాగ్యము నశించెను. సోదరుడు మరణించుటచే గృహమున కరగి నాజననీజనకుల సందర్శింపజాలను. వేయేల పతితో నరుగుటయే సాధ్వికి విధియౌను గాన నాజీవితములగూడ బలిగా గైకొనుమని బలుకుచు తనమొలయందు గుప్తముగా దాచియుంచిన బాకును వెలికి దీసి కడసారి తన విభునకు ప్రదక్షిణ నమస్కారమాచరించి కాళికాదేవికి వలగొని బాకును హృదయమునకు సూటిగాజూచి పొడుచుకొనబోయెను.

అంత జగన్మాత యగు కాళీమహాదేవి ప్రత్యక్షమై బాకుగల యామె హస్తమును బట్టుకొని "కుమారీ! సాహసమును మానుము. ఆత్మహత్యకై గడంగుట పాపకృత్యమని యెఱుంగవా! నీభక్తికే నెంతయు సంతసించితిని. నీపతియును సోదరుఁడును జీవించుట కొక్క యుపాయమున్నది. ఇటుపడియున్న మొండెములకు శిరములు దగిలించిన వారు మరల పునర్జీవితులగుదురు. అట్లు వరమిచ్చితినని బల్కి జగన్మాత యంతర్హితురాలయ్యెను.

రాకుమారీమణి యతిసంభ్రమున విభుని శిరమును సోదరుని మొండెమునకు సోదరుని శిరము విభుని మొండెమునకును, దగిలించెను. అంత నిరువురును పునర్జీవులైరి.

విక్రమార్క భూపాలా ! ఈరూపవంతుని చరిత్రమంతయు నామూలాగ్రముగ నాకర్ణించియుంటివి గాన నిట పునర్జీవితులైన వారిలో నెవ్వని నామె భర్తగా నంగీకరింపవలయును. ఎవ్వ డామెకు సోదరుఁ డగును వక్కాణింపుము. తెలిసియుండియు దెలుపకున్న యెడల వెనుకటి శాపమే సుమీ యని భేతాళుఁడన విక్రమార్క భూపాలుఁడు ఓయీ "సర్వస్యగాత్రం శిరఃప్రధానం" అని బుధులు వక్కాణించుచుండుటచే రూపవంతుని శిరముగలవానినే యామె భర్తగా నంగీకరింపవలయును" అని బల్కెను. ఆపలుకులాలించి భేతాళుఁడు మరల వటవృక్షమును జేరబోయెను.



# ఒక చోరుని కథ



విక్రమార్క భూపాలుడు మరల నా వటవృక్షముకడకు బోయి భేతాళుని పట్టి బంధించి తనమూపున బెట్టుకొని తిరిగి వచ్చుచున్న సమయమున భేతాళుఁడు వినుమా భూపాలచంద్రమా! శ్రమనివారణార్థ మొకకథ జెప్పెద నాకర్ణింపుము" అని బలికి యిట్లీక్రిందికథ జెప్పసాగెను.

ఒక వైశ్యయువతీలలామంబు తన భర్తృమరణానంతరము తన కుమార్తెను యౌవనవతియగు కుమార్తెనుగూడి యేదోయొక గొప్ప పట్టణమునకు బోవ సంకల్పించుకొని బయలుదేరెను. ఆమెయు తన వద్దనున్న స్వల్పమగు ద్రవ్యముతో నాపట్టణమున నెట్లు కాలక్షేపము చేయుదునా ద్రవ్యార్జన మెట్లు జరుగునా యని తలపోయుచు ప్రమాదవశమున త్రోవదప్పి యొక యరణ్యమార్గమున నరుగ సాగెను. అట్లు పోవంబోవ నొకచో కొరతవేయబడిన చోరుని గాంచెను. వాడును కొనయూపిరితో నుండి, మరణబాధ నందుచు శీఘ్రముగ మరణింపవలయు నను యభిలాషతో సమీపమున నెవ్వరో పోవుచున్నట్లు ధ్వనివలన గుర్తించి "ఓపుణ్యాత్ములారా! ఈదీనునిపై దయయుంచి ఒక్కపరి యిటకరుదెంచుఁ" డని యెలుగెత్తి ప్రార్థించెను.

అంత నాయువతి కరుణాయత్తచిత్తయై వానిని సమీపించెను. ఆ చోరుడు వారల దిలకించి మీ రెవ్వరు యెచ్చటికేగుచుంటిరి మీ వృత్తాంత మంతయు సవిస్తరముగా వక్కాణింపుఁ డనెను. వైశ్య యువతియు విచారమున తనభర్త కొలదికాలముక్రిందటనే చనిపోయె ననియును, తా నింటనున్న స్వల్పధనమును సంగ్రహించుకొని యేదో యొకపట్టణమునకు బోయి చిల్లరదుకాణమైన బెట్టి జీవయాత్ర సాగింప దలంచితిననియును వక్కాణించెను. అంత నా తెక్కలికాడు ద్రవ్యము

లేకుండ జీవితము సౌఖ్యముగా జరుగనేరదు. నీవద్దనున్న ద్రవ్యము సరిగా నొక నెలగ్రాసమున కేని చాలదు. అట్టియెడ మీకు జీవనోపాధి పట్టణమున జరుగు టసంభవము. నీవు నా కొక యుపకార మాచరించిన యమితమగు బంగారు లభించు నుపాయము నీకు జెప్పెదను. నీవు నాకొనర్పవలసిన మహోపకార మేమన యౌవనవతియగు నీకుమార్తెను నా కిచ్చి పరిణయము సేయుము. గాంధర్వవిధి ననుసరించి యామెహస్తమును నాహస్తమున సంతోషపూర్వకముగ నీ వుంచిన యుత్తరక్షణముననే నీకుమార్తెకు బంగార మున్నస్థలమును దెల్పెదను." అని బల్కెను. ఆవైశ్యయువతియు ధనమునం దాశ గలదై, యీకారణ్యమున నేమిచేసిన నెవ్వరు చూడగలరు, అందుచే నీదొంగవాని యభిమత మీడేర్చి బంగారమును గొందును. అని తలపోసి యాతనిహస్తమున దనకుమార్తెకర మిడి, మీరిరువురును విధి ప్రాబల్యముచే దంపతులైరని వక్కాణించెను. అంత చోరుడు వైశ్య యువతిని దూరముగా నుండుమని జెప్పి భార్యను సమీపమునకు బిలిచి యామెచెవిలో రహస్యముగా ధనమున్నస్థలమును జెప్పి యామె చెక్కిలి ముద్దుగొనెను.

పిమ్మట కొన్ని నిముషముల కాచోరుడు మరణించెను. ఆవైశ్య యువతియు కుమార్తెయు చోరుడు దెల్పినస్థలమున నున్న బంగారము నంతయు సంగ్రహించుకొని యొకపట్టణమును జేరెను. ఆవైశ్యయువతి తనకుమార్తెకు వివాహము సేయ తగిన వరున న్వేషించుచుండెను.

సౌందర్యవతియు యౌవనవతియునగు నామెను దిలకించి యొక విప్రబాలకుడామెను మోహించెను. ఆమెయు వానియందత్యానురాగము గలదై రహస్యముగా నాతనితో మెలగుచుండెను. ఇట్లు పెక్కుదినములేగెను. ఆవైశ్యబాలిక గర్భిణురాలగుటచే విధిలేక దననేరమంతయును తల్లి కెఱిగించి కర్తవ్యమునకై యాత్రత జెందుచుండెను.

అంత నాజరఠయు నొక్కరాత్రి పరుండబోవుచు దనమనంబున నిట్లని వితర్కింపసాగెను. మొట్టమొదట ద్రవ్యాశచే నాఁ డాయరణ్యమధ్యమున చోరునకు పరిణయ మొనరించితిని; కాని యది యరణ్యమున రెండవకంటివానికి దెలియకుండ నతిరహస్యముగా జరిగినందున కుమార్తెవివాహమున కెట్టి యాటంకమును గలుగదని భావించి నిశ్చింతతో నుండ గోరుచుట్టుపై రోకటిపోటుచందమున మరల నీవిప్రకుమారుని సాంగత్యమొకటి నాకుమార్తెకు గలిగినది. అంతతో సరిపోయినదియా లేదు. నలుగురినోట బడుటకై గర్భముగూడ నిలిచినది. ఇంక కులస్థులలో నెవ్వఁ డీమె నంగీకరించును. పరిణయము గావింపక యున్నినా ళ్ళిటు లుంతును. ఇప్పటికే జనులెల్లరును పరిహసించుచున్నారే. యేమిసేయుదును. ఇచటినుండి మరియొకగ్రామమునకు బోవుదమనుకొనినను వీలుగానున్నట్లు లేదు. లోకులవద్ద నధికమగు మాధనము నిలువయున్నది. ఇవుడు గ్రామాంతర మేగిన నాధనమును గోలుపోవలసివచ్చును. కానిమ్ము. పైన భగవంతుఁడే గలఁడు. ముందేమిజరుగునో ఎట్లు జరుగునో యెవ్వడు చెప్పగలఁడు. ఇప్పటి కయిదు మాసము లయినట్లుగదా చెప్పుచున్నది యని పెద్దయుం బ్రొద్దు వితర్కించుకొని శయనించెను.

ఆదినమున తెల్లవారుఝామున నామెకు స్వప్నమున నొక దివ్యపూరుషుఁడు గాన్పించెను. ఆతనిగాంచి సంభ్ర మాశ్చర్యములతో నామె లేచి వివిధోపచారముల గావించిన సంతుష్ట హృదయాంతరంగుఁడై తన్వీ! నీ యుపచారముల కెంతయు సంతసించితిని. నీకుమార్తెకై నీవు కడుంగడు చింతించుచుంటివి. రహస్యము చెవికెక్కునని భీతిల్లుచుంటివి. నీవావిషయమై భీతిల్లకుము. నీకుమార్తె యుక్తకాలమున నొక చక్కని కుమారుని ప్రసవించును. సౌందర్యయుక్తుడగు నాబాలకుని పుట్టినవెంటనే పొత్తిళ్ళలోనుంచి రాజసౌధ సమీపమున గల గుమ్మముకడ నుంచుము. నీ వచటికరుదెంచు నప్పటికి కావలి

వాండ్రు గాఢనిద్రయందుందురు. ఇట్లాచరించినందున నీకు మంచి లాభ మొనగూడును. నాపల్కుల యథార్థ మెరుంగుటకై నీకొకగుర్తు చెప్పెదను. ఆబాలకుని కుడితొడయందు శుభలక్షణ సమన్వితమగు పుట్టుమచ్చయొకటియుండును. భయ మొందక యట్లాచరింపుము. సుఖం బుల వడయుము." అని జెప్పుచు నాతం డంతర్హితుండయ్యెను. ఆమె యు నెంతయు వింతనొంది యట్లానరించుటకే సంకల్పించుకొనియెను.

నవమాసమ్పూర్తి యైనపిమ్మట నాయౌవనవతికొక చక్కని పురుషశిశువు జన్మించెను. తోడనే వైశ్యయువతి తనకా దివ్యపూరుషుండు జెప్పిన పుట్టుమచ్చ యీతనికుడితొడపై నుండుట గిలకించి సంతోషిత స్వాంతయై కుమారితో దన స్వప్నవృత్తాంత మంతయును దెల్పి పొత్తిళ్లలోనున్న యా నిసుంగును రాజసౌధమునకు గొనిపోయి ఛారాజ వాన్లు నిద్రించుచున్నందున వారిని సమీపించి బాలకు నట విడచి దూరమున నిలచి యేమిజరుగునోయని దిలకించుచుండెను. ఇంతలో ప్రభాతమగుటయు నాభటు లిరువురును మేల్కాంచి తమసమీపమున పొత్తిగుడ్డలనుండి కేరుకేరుమని యేడ్చుచున్న బాలకునిగాంచి యాతని సౌందర్యమున కబ్బురమంది యిరువురును వానిని పెంచుకొనగోరిరి. అందువలన వారిరువురకును వాక్కలహము సంభవించెను. ఆసమయమున భూపాలుడు దేవళమున కేగుటకై ద్వారము చెంత కరుదెంచి భటులిరువురును కలహించుచుండుట దిలకించి కలహకారణ మేమని ప్రశ్నించెను. తాము కలహమాడుట భూపాలుఁడు దిలకించియుండుటచే మరుగుపెట్టుటకు వీలులేదని భావించి "దేవా! ఇదే యీబాలకుని పెంచుకొనవలయునని యిరువురమును తగవులాడుచుంటి" మని బల్కుచు యాబాలుని జూపిరి. సంతాన హీనుఁడగు నాభూపాలుఁడు తనకుగూడ నాబాలుని పెంచుకొనవలయునను యభిలాష జనించుటచే తగువారిచే నాబాలకుని దన యంతఃపురమున కనిపి యిరువురి భటులకును చెరియొక వేయిమాడల నొసంగి యాదరించెను.

ఆభూపాలుని తస్వీమణి యాబాలునిగాంచి యమిత వాత్సల్యముల పెంచుకొన నిశ్చయించెను. అట్లు భూపాలునకును మహారాణికిని నత్యంత ప్రేమాస్పదుడై దినదినాభివృద్ధి నొందుచుండెను. క్రమముగా నాబాలుఁడు పదునారువత్సరముల ప్రాయమువాడై యుండునపుడు విధివిధానంబున భూపాలుఁడు మరణించెను. ఆతఁడు మరణించునపుడు తన పెంపుడుకుమారుఁడే రాజ్యార్హుడని నిర్ధారణమొనర్చి మంత్రి సామంతులకు వర్తమానమంపి వారల సమక్షముననే కిరీటాదుల నాతనిహస్తమున నుంచెను. భూపాలుని మరణానంతర మాబాలుఁడు చక్రవర్తియై యవనిబాలించుచు సుఖంబున నుండెను.

కతిపయదినంబు లరిగినపిమ్మట నాతఁడు తీర్థసందర్శనాభిలాషియై సముచితపరివారుఁడై బయలుదేరి కాశీ ప్రయాగ మున్నగునవి దర్శించి గయనుజేరి యందు పితరులకు పిండప్రదానమొనర్ప సంకల్పించుకొనియెను. తనచేత పిండము త్రివెవబోవునప్పటికి మూడు హస్తములరుదెంచి యాపిండ మందుకొననెంచెను.

విక్రమార్క భూపాలా! వింటివిగదా యీకథ ఆమూడుచేతులెవ్వరివి. వానిలో నెద్దానియందా బాలకుండు పిండముంచవలయును సవిస్తరముగా దెలుపుము. తెలిసియు దెలుపకున్న వెనకటిశాపమే యని భేతాళుడు బల్కిన విక్రమార్కుడోయీ! అందొకచేయి చోరునిది, రెండవది విప్రబాలకునిది, మూడవది భూపాలునిది. ఆతండు పిండమును చోరునిహస్తమున నుంపవలయును. చోరుడు తనభార్యతో నేకాంతమున ధనమున్నస్థలమును దెలిపి తనకు క్షేత్రజ్ఞునిచేనయినను ముక్తి కలుగునను భావముతో నీయిచ్చవచ్చినవానివలన కుమారుని గనుమని జెప్పెను. అందువలన నీతడు చోరునకు క్షేత్రజ్ఞుఁడు కావున వానిచేతనే పిండమిడవలయుననిన విని భేతాళుఁడరిగెను.



# చంద్రావలోకుని కథ



విక్రమార్కుఁడు మరల భేతాళునిబట్టి తెచ్చుచుండగా భేతాళుఁడు వినుమని భూపాలుని కీక్రిందికథ నిట్లు చెప్పదొడగెను.

తొల్లి చిత్రకూటముఁ బరిపాలించుచుండెడి చంద్రావలోకుఁ డను భూపాలచంద్రుఁ డొక్కనాఁడు సముచితపరివారసమేతుఁడై విపినభూముల కేగి వినోదముగా వీరవిహారము సలుపుచు పెక్కులగు ఘాతుకమృగంబుల జక్కాడుచుండెను. ఆతనితో నరుదెంచిన సైనికులును భూపాలునకు దమశౌర్యధైర్యస్థైర్యముల జూపదగినసమయ మాసన్నమయ్యెనని దలపోసి యొండొరుల మీరునట్లు సాటిలేని పరాక్రమము జూపుచుండిరి. వల లొగ్గియు, వేటకుక్కల నుసికొల్పియు, బైరి మున్నగు డేగజాతుల నెగురవైచియు, పెక్కువిధములగు మృగముల నంతకాలయమున కనుపుచుండిరి. భూపాలుఁడు నలుగురయిదుగురు మిత్రులతో వారువముల నెక్కి కార్ముకహస్తుఁడై విహరించుచు దనకు దవుదవ్వులనుండి వాయువేగంబున బరతెంచు నొక్క హరిణముం బొడగాంచి వింట బాణమును సంధించి యాహరిణము నేసెను. తోడనే యదియు పరుగిడుచు భూమి నంటకున్నసమయమున భూపాలునిచే విడువబడిన శిలీముఖంబున బాదములన్నియు నొక్కమారుగ ఖండింపబడినందున భూమిపై బడియెను. భూపాలుని శరసంధానకౌశలంబున కధికంబుగ సంతసించి యాతనిమిత్రు లాతని నమితంబుగ స్తుతించిరి.

ఇట్లు వీరవిహారంబు సలుపుచు భూపాలుఁడు వనమధ్యంబునఁ డాయంజని యందున్న కణ్వమహామున్యాశ్రమమును సమీపించెను. మునిచంద్రు లాశ్రమంబున నుండి శిష్యులకు తత్త్వోపదేశ మొనరించు

చుండిరని విని వారిని సందర్శింపవలయునను కుతూహలంబున పరివారంబు నట నిలిపి యాశ్రమవాసుల కెట్టియులజడియు గలిగింపవలదని శాసించి, వారునను డిగ్గి పాదచారుఁడై యిరువురుమిత్రుల వెంట గొని యాశ్రమము ప్రవేశించెను. కణ్వమహాముని యాతని బొడగాంచి సమీపమున నున్న శిష్యులతో నాతని కర్ఘ్యపాద్యము లొసంగి విధివిధానంబున సన్మానింప నియోగించెను.

భూపాలుఁడును సన్మానింపబడి మునిచంద్రులచే జూపబడిన వ్యాఘ్రాజినముపై గూర్చుండి కొంతకాలముదనుక తత్త్వోపదేశశ్రవణ మొనర్చి మునిచంద్రుని యనుజ్ఞగొని పురంబునకేగ బయలుదేరెను. ఆశ్రమప్రాంతసమీపమునగల యుపవనంబున బుష్పాపచయమొనర్చుచున్న యొక సుందరాంగిని దిలకించి బద్ధానురాగుఁడై ప్రచ్ఛన్నముగ నొక పొదమాటున డాగియుండి వారల సంభాషణక్రమమంతయు నాలించి యామె కణ్వమహాముని చంద్రుని పెంపుడుకుమార్తె యని యెఱిఁగి మోహమును నిలుపజాలక మరల మానిచంద్రునియొద్ద కరుదెంచి యాబాలిక వృత్తాంతమంతయును దెలుపవలయు ననియును తన కామె నొసంగి పరిణయము గావింపవలయునని ప్రార్థించెను.

కణ్వమహామునియు నాతని గూర్చుండ నియమించి "ఓయీ యీలతాంగి యొక మహారాజు కుమార్తె. ఆభూపాలుఁడు శాత్రవునితో బోరాడుచు క్షత్రియోచితముగ రణరంగమున మరణించెను. ఆతని భార్యయు వీరనారీమణి యగుటచేతను సాధ్వీలలామ యగుటచేతను పతితో సహగమన మాచరించెను. అంతఃపుర రక్షకుఁడగు నొక వృద్ధుడీ బాలికను సంవత్సరప్రాయముగల యీబాలికను గొని శత్రువుల కంటబడకుండ దప్పించుకొని యీ కీకారణ్యమును బ్రవేశించి దుర్గమంబగు నిద్రానిని దరింపనేరక అధికాయాసంబున నొక వృక్షముచెంత నీబాలికను డించి మార్గాయాసశ్రమంబున నీల్గెను.

తదనంతరము కుశపత్రసంగ్రహణార్థ మరిగి నాశిష్యులు కొంద రీమెను గాంచి యాశ్రమపథంబునకు దోడ్కొనివచ్చి నాకుం జూపిరి. దివ్య దృష్టి నామె చరిత్రంబంతయు నెఱిఁగి సద్వంశసంభవురా లగుటవలనను, ఆమెను గాంచినంతనే పుత్రికావాత్సల్య ముదయించుటచేతను ఆమెను పెంచి పెద్దగా జేసితిని. ఇప్పు డామెను దగినవాని కీయ సంకల్పించుకొనియుండ నీ వరుదెంచితివి ఆమెను నీకొసంగుట కెట్టియాటంకమును లేదుగాని బహు పత్నీకుఁడవై ముందు నాకుమార్తె ననాదరింపనని వాగ్దాన మొసరింపవలయును. ఇట్లైన నామెను సంతోషపూర్వకముగ నీ కర్పింతును." అని బల్కెను.

భూపాలతిలకుం డామునితిలకుఁడు గోరినయట్లు వాగ్దాన మొసంగి యిందీవరాక్షియను నామెను పరిణయమాడెను.

తదుపరి కొన్ని దినంబు లటనుండి పిమ్మట బురంబునకుఁ బోవ మునిచంద్రు ననుజ్ఞగొని భార్యాసహితుఁడై బయలుదేరెను. ఆ విపినంబున పయనము సాగించుచు ప్రకృతిచిత్రముల భార్యకు జూపుచు రమణీయ ప్రదేశములనెడ నెడ విశ్రమించుచుండెను. ఒక్కనా డొక విమల పులినతీరంబున డిగ్గి గుడారముల నేర్పరుప సైనికుల నాజ్ఞాపించెను. క్షణంబున నా తటాకతీరమంతయును శృంగారములగు గుడారములతో నిండిపోయెను. అం దత్యంతసుందరమైన యొక గుడారమున భూపాలుఁడు జాయాసహితుఁడై విశ్రమించెను.

నిశాసమయమున నొక బ్రహ్మరాక్షసుఁ డరుదెంచి సురక్షితమై వెలయుచున్న భూపాలుని గుడారమును ప్రవేశించి భార్యతో వినోదముగా నున్న భూపాలుని సమీపించి నా సరోవరతీరమున నాయానతి లేక విశ్రమించినందులకు నిన్నిపుడు భక్షించి నాయాకలి బాధ దీర్చుకొందును. అని బల్కుచు నాతని సమీపించెను. అంత భూపాలుఁడు వడవడ వడంకుచు భీతచిత్తుడై యారక్కసుని పద

ములపై వ్రాలి ఓయీ! కొలదికాలము క్రిందటనే యీ తరుణీమణిని పరిణయమాడి యుంటిని. ఇంకను మనసుదీర సీలతాంగితో నొక్క మాసమైనను హాయిగ నుండలేదు. కావున నన్ననుగ్రహించి రక్షింపుము. వలయునెడల నీకుఁ దగిన నితరజంతువుల మాంస మెంతయైన నొసంగువాఁడను. అని దీనముగా వేడుకొనెను. ఆరాక్షసుఁడు కఠిన హృదయుడై యాతని మాటల పాటించ కూరకొనియుండ నాతని తన్వీమణి యారక్కసుని పదములపై వ్రాలి ఓ కరుణార్ద్రహృదయా! నాపల్కు లాలింపుము. జననీజనకులు లేనిదాననై పశితనమునుండియు పెక్కులగు కష్టములబడి యుంటిని. ఇప్పటి కీతని చెట్టబట్టి సుఖించు చుంటిని. సంసారసుఖముల నొక్కమాసమైనను హాయిగ ననుభవించి యుండలేదు. ఇంతలోననే నావిభుని సంహరించి నాకు దుస్సహమగు వైధవ్యదుఃఖ మొనగూర్పకుము. నేను నీకుమార్తెగా భావించి నను రక్షింపుము. అని దీనముగా వేడుకొనియెను. అంత నారక్కసుఁడు కొంతవడి యోజించి రాజా! నీబ్రతుకున కొక్కయుపాయము జెప్పెద నాలింపుము. ఒక బ్రాహ్మణకుమారుని తల్లిదండ్రు లిరువురును బట్టుకొనియుండ వధించి నాకు బలిగా నొసంగుము. అటులైన నిను రక్షింతును. తడవుసేయక నేటరేపట నాకు బలియొసంగవలయును. లేకున్న నిన్ను నీరాజ్యమును గూడ నంతరింపజేయుదును. అని బల్కి భూపాలుని సమ్మతించుమ ట్లొనరించి యథేచ్ఛ జనియెను.

చంద్రావలోకుఁడు భటులను నలుమూలలకు బోయి విశేషముగా ధనమిత్తుమని యాశగొల్పి యొక విప్రకుమారుని దోడ్కొనిరండని బంపెను. వా రనేకస్థలముల ద్రిమ్మరి యొక కుగ్రామమున నతిబీదలై పలువురు బిడ్డలతో నున్న బ్రాహ్మణదంపతులగాంచి వారికి యొక గ్రామ మిప్పించుటకును దమ కుమారులలో నొకనిని దల్లిదండ్రులు బట్టుకొనియుండ రాక్షసునకు బలిగా నొసంగుటకును సమ్మతిపరచి దోడ్కొని వచ్చిరి.

చంద్రావలోకుఁ డాబాలకుని బ్రహ్మరక్కసునకు బలిగా నొసంగి తన జీవముల గాపాడుకొనియెను. బలియొసంగు సమయమున నాబాల కుడు జీవముల గోలుపోవుచుంటినే యని విచారింపకుండ నవ్వెను. విక్రమార్కభూపాలా! ఆతఁడెందులకు నవ్వెనో దెలుపుము. దెలుప కున్న వెనుకటిశాపమే యనిన విక్రమార్కుఁడు ఓయీ! కడుపార గనిన తండ్రియు నవమాసంబులు గర్భమున ధరించి కనిపెంచిన జన నియు, న్యాయాన్యాయవిచక్షణశీలుండగు భూపాలుఁడును గూడ తనకు వ్యతిరేకులై యుండిరని దలంచి నవ్వెను. అని భేతాళుఁడు యెప్పటియట్లు వటవృక్షశాఖల జేర నరిగెను.



# నలువురువిప్రులకథ



విక్రమార్కుఁడు మగల వటవృక్షముచెంతకేగి భేతాళునిపట్టి తెచ్చు చుండ నాతఁడు విక్రమార్క భూపాలా! శ్రమనివారణార్థ మొకచక్కని కథ దెల్పెద నాలింపుమని యీక్రింది కథ యిట్లు వచింపదొడంగెను.

తొల్లి బ్రహ్మస్థలాగ్రహారమున నగ్నిస్వామి యను విప్రపుంగవుఁడు గలడు. ఆతనికి నలువురు కుమారులు గలరు. వారందరును విద్యాసక్తి లేక బాలురతో క్రీడించుటయుందే కాలమును గడపుచుండిరి. అంత నొక్కనాడు యగ్నిస్వామి కుమారుల నెల్లరరావించి తనవద్ద గూర్చుండబెట్టుకొనియిట్లుజెప్పెను. "విద్యావిహీనుఁడు పశుతుల్యుఁడు. విద్య దలిదండ్రులు పెట్టనిసొమ్ము. విద్యావంతుఁ డెచ్చటికేగినను పూజింపబడును. తనచేత విద్యగలవా డెచ్చటికేగినను విద్యాప్రాబల్య ముచే సులభముగా జీవయాత్ర సాగించుకొనగలఁడు. విద్యావంతుఁడు భూపాలురచేతనైనను మన్నింపబడును. విద్యావిహీనులైయున్న మిమ్ముంబొడగాంచినంతనే నాహృదయమున నపరిమితంబగు దుఃఖ ముదయించుచున్నది. నేను వృద్ధుఁడను జీవించినంతకాల మీ పృథివి పైనుండబోను ; యెప్పటి కెట్టికష్టము రానున్నదో యెవ్వఁడెరుగును; నేను గతించిన నింక నింటియందు గృహకృత్యములకైన వలయు ధన మును మీరు సంపాదింపనేరకున్న సంసార మెట్లు జరుగును. కావున నాపలుకులాలించి విద్యాభ్యాసమునకై యెటకేనిబోయి బాగుగా విద్య నేర్చుకొనుఁడు"

మరునాఁ డరుణోదయంబుననే జనకునిచే ప్రబోధింపబడిన యా నలువురు విప్రబాలురును బయలుదేరి విద్యాసంగ్రహణార్థ మరిగిరి. కొంతదవ్వేగినపిమ్మట నలువురును దమలోదామిట్లు నిర్ణయము గావించుకొనిరి. నలువురమొక్క విద్యనే యభ్యసించిన మనకు

మిగుల లాభకారిగా నుండజాలదు. నలుమూలలకేగి వివిధములగు విద్యలభ్యసించి మరల పదిసంవత్సరముల కిచ్చటనే గలసికొందుము. మితి దీరులోపల నెవ్వఁడరుదెంచువాఁడు తక్కినవా రరుదెంచునంత వరకు నిరీక్షింపవలయును. మితిదాటిన వత్సరంబునకైన రాకున్నచో తక్కినవారాతఁడు మరణించినట్లనే భావింపవలయును. ఇట్లు నిర్ణయము గావించుకొని నలువురును నలుమూలల కరిగిరి.

*　　*　　*　　*　　*

పదిసంవత్సరములు గడచిపోయెను. ఆనలువురగన్నదమ్ములును మరల నాపురంబుననే గలిసికొనిరి గాని ఒక్కరును తా మీవిద్యనభ్య సించితినని యితరునితో జెప్పుకొనలేదు. కాని తాము గురువులకు తమపై నదభిప్రాయము గలుగుటకై యెంతగా శ్రమపడియుండిరో సహపాఠులగువారితో తాము విహరించుటాదిగాగల విషయము లన్నియు జెప్పుకొనుచుండిరి. అంత వారు నలువురు పురబహిఃప్రదేశ మునకు బోయి విహరించుచు నాటిరాత్రి యచటనే గడుప నిశ్చయిం చుకొనిరి. సమీపమున నరణ్యముండుటచే వారిలో నొకడు మేలు కొనియుండుటకును మిగిలినవారు నిద్రించుటకును మేలుకొనియున్న వాఁడు తనకు నిద్దురవచ్చిన మిగిలినముగ్వురలో నొకనిని మేల్కొలిపి శయనించుటకును నిర్ణయించుకొనిరి. అందు జ్యేష్ఠుఁడు ప్రప్రథమమున మేలుకొనియుండెను. తక్కిన ముగ్వురును శయనించిరి.

ఆతఁ డటునిటు పచారుసేయుచుండగా సమీపమున నొకయెముక గాన్పించెను. అంత నాతఁ డద్దానిని గైకొని తన మంత్రప్రాబల్యమున నాజంతువునకుండవలసిన యెముకలనన్నిటిని రప్పించి కుప్పగానుంచెను. ఇంతలో తనకు నిద్రవచ్చుటచే ద్వితీయుని మేల్కొలిపి తా నిద్రిం చెను. ద్వితీయుఁడును సోదరునిచే ప్రోవుచేయబడిన యెముకలనన్ని టిని సరియైన స్థానమునసంచి యొక యస్థిపంజరమును తయారుచేసి

యంతలో తనకు నిద్దుర వచ్చుటచే మూడవవానిని మేలుకొలిపి నిద్రించెను. మూడవాడాయస్థిపంజరమునకు మాంసముకండరములు మున్నగున వన్నియు గలుగునట్లొనర్ప నది యొక సింహమై విగతజీవియై పడియున్నట్లు దోచుచుండెను. అంత తనకు నిద్దుర వచ్చుటచే నాలవవానిని మేలుకొలిపి నిద్రించెను. ఆతడా సింగమునకు ప్రాణప్రదాన మొనరించెను. సింగమంతట నిద్రనుండి మేల్కాంచినట్లుగా లేచి యానలువురి సోదరులను బొరిగొని యథేచ్ఛ జనియెను. విక్రమార్క భూపాలా! ఆనలువురిలో నెవ్వడు మిగిలినవారిని జంపిన పాపమనుభవింపవలయును దెలుపుము. తెలిసియు దెలపకున్న వెనకటి శాపమే యని భేతాళుడు బలుక విక్రమార్కుడోయీ! ఆయ్యది సింహముగా నెఱింగి యది జీవించిన తమ్ము జంపగలదని యెఱిగియుండియు ప్రాణప్రదాన మొనరించిన నాలవవాడే తక్కినవారిని జంపిన పాపఫలమనుభవింపవలయునని బల్కిన విని భేతాళుడు వటవృక్షము జేరనరిగెను.



# వీరబాహుని కథ



భేతాళుని వెంబడించి విక్రమార్కుడు మరల నాతని బంధించి మూపునం దిడుకొని జడదారి సమీపమున కతిత్వరితగతి నరుగుచుండగా భేతాళుఁడు విక్రమార్కునితో నో భూపాలతిలకా ! ఏల వృథా శ్రమ జెందెదవు. శ్రమనివారణార్థ మొక కథ జెప్పెద నాకర్ణింపుము. అని బల్కి యిట్లీ క్రిందికథ జెప్పదొడంగెను.

తొల్లి అయోధ్యాపురంబును వీరకేతుండను భూపాలుం డఖండ వైభవంబున బరిపాలించుచుండెను. కొలది కాలముదనుక నాతని పరిపాలనంబున ప్రజ లతిసౌఖ్యంబున దమ జీవయాత్రల సాగించిరి. కాని కాలకర్మవశంబున వీరబాహుఁడను చోరనాయకుడు లోకకంటకుఁడై ధనికుల బీడించుచు బీదసాదలకు దోడ్పడుచుండెను. భూపాలుఁడాతని బట్టి బంధించిన వారికి గొప్ప బహుమానము లొసంగెదనని ప్రకటించెను. సైనికులకు గొప్పగొప్ప యుద్యోగము లొసంగి యాదరింతునని ప్రకటించెను. కాని నిసుమంతయు లాభకారి గాదయ్యెను.

ఆపురీవరంబున నున్న ధనదత్తుఁడను వర్తకునకు రత్నావళియను కుమారీమణి గలదు. ఆమె రూపమున రంభాద్యప్సరసల మించియుండుననియు వినయాదిసద్గుణముల నీడులేనిదనియును జనులెల్లరును గీర్తింపుచుందురు. గ్రామములోని పిల్ల లెవ్వరైన దుష్పథముల నడచిన వారి తల్లిదండ్రు లెల్లప్పుడును పిల్లలతో రత్నావళిని జూచి బుద్ధి తెచ్చుకొనరాదా! ఆమె యెప్పుడైన నిట్లల్లరిపను లొనరించుచుండునా ? యని బలుకుచుందురు.

ధనదత్తుడును దనకుమార్తె కనువైనభర్త నన్వేషింపవలయునని యనేక దేశములనుండి రూపాధికులును విద్యావినయసంపన్నులును అగు

వైశ్యకుమారుల రూపపటంబుల దెప్పించి రత్నావళికిఁ జూపి వీరిలో నీ యిచ్చవచ్చినవాని వరింపుమని బల్కెను. ఆమెయు నాపటంబుల నన్నిటిని జాగరూకతతో బరిశీలించి తనకందున్న వరులెవ్వరును దన కనుకూలురని దోపనందున నన్యమనస్కయై యుండెను.

అట్టియెడ పట్టణంబున వీరబాహునివలన ప్రజలకమితమగు సలజడి గల్గినందున వీరకేతుండు ప్రచ్ఛన్నవేషుఁడై తగినవారల పెక్కుస్థలముల నిలిపి రాత్రియందు స్వయముగ గస్తిదిరుగ నారంభించెను. వీరబాహుండును భూపాలుఁడు గస్తిదిరుగుచుండెనని యెఱింగియు భీతిల్లక నినుమడించిన వీరావేశంబున పెక్కుస్థలములయందు చౌర్యముగావించుచుండెను. ఇట్లుండ నొక్కనాడు భూపాలుఁడు ఒక వీథివెంట బోవుచుండ వీరబాహుఁడెదురుగా నరుదెంచెను. వీరకేతుఁడు తనభటులవలన వీరబాహుని చహారా వినియుంకుటచే నాతనిగుర్తించి "ఓరీ! నీ వెవ్వఁడవు? ఎందుల కిట్లర్ధరాత్రమున ద్రిమ్మరుచుంటివి. నీ వృత్తాంతము సవిస్తరముగా వచింపవలయును." అని అదలించిబల్కెను. అంతట వీరబాహుఁ డించుకంతయు భీతిల్లక "నే నీ గ్రామమును సంరక్షించుచుండు కాళికాదేవికి ముఖంబుగూర్చు సేవకులలో నొక్కండను. పురంబును పరిశీలించి రమ్మని దేవి యాజ్ఞాపించుటచే నిట్లరుదెంచుచున్నాడను." అని ప్రత్యుత్తరమిచ్చెను. భూపాలుఁడా వచనంబుల నించుకంతయు విశ్వసింపక మాయోపాయంబున కాళికాలయమునకు దోడ్కొనిపోయి యందు వానిని బంధించి తానీవలి కరుదెంచి సమీపమున పొదలమాటున డాగియున్న సైనికుల ప్రోగుచేయుచుండెను.

ఇంతలో వీరబాహుఁడు తన మొలయందు గుప్తముగా నుంపబడిన యొక చిన్నిశంఖమును దీసి పూరింపగా నా సవ్వఁడి విని తమనాయకుని కనిపెట్టుచు ద్రిమ్మరుచున్న వీరబాహుని యనుచరులు సత్వరముగా నరుదెంచి కాళికాలయద్వారముల భేదించి తమనాయకుని

గాపాడిరి. ఈ లోపున భూపాలుఁడును సైన్యయుక్తుఁడై యచటి కరు దెంచెను. వీరబాహుని యనుచరులకును వీరకేతుని సైన్యంబునకును పోరొనగూడెను. ఇరుదెరంగుల వారియందునను పెక్కురుమడసిరి. ఎట్టకేలకు వీరబాహుఁడనుచరసహితంబుగ పట్టువడెను.

భూపాలుఁడు ప్రజాకంటకుఁడగు చోరుఁడు నేటికి పట్టుబడెనుగదా యను సంతసంబున నా చోరుని పురవీథుల నూరేగించి కొరత వేయవలసిన దని యాజ్ఞాపించెను. భటులాతని నట్లూరేగించుచుండగా ధనదత్తుని కుమార్తెయగు రత్నావళి యా వీరబాహునిగాంచి యాతని మోహించెను. పరుగుపరుగున తన జనకుని యొద్దకుబోయి తానా వీరబాహుని వలచితిననియు నాతనికి తన్నర్పింపవలయుననియు వేడుకొనెను. తోడనే ధనదత్తుడు కుమార్తెతో "తనయా! ఎట్టివానిని వరించితివి. ఈ తడింకొకటి రెండుగంటలలో నురిదీయబడును. అట్టివానిని వరించి నీ వేమి సుఖపడగలవు. వేరొకని వరింపుము. ఆతనికి నిన్నర్పింతును." అని పెక్కువిధంబుల బుజ్జగించుచు బల్కెను. రత్నావళియు నాతని దక్క నన్యులవరింపనని పట్టుబట్టుటచే భూపాలునియొద్దకు బోయి మొర వెట్టుకొని వీరబాహుని విడిపింపవలయునని ధనదత్తుడు బయలుదేరెను. ధనదత్తుడెంతగా బ్రతిమాలినను లెక్కలేనంత ద్రవ్యమిత్తునని నను భూపాలుఁడు వీరబాహుని విడువనని బల్కెను.

వీరబాహుఁడు కొరతవేయబడెను. రత్నావళియు యాస్థలమున కరుదెంచి వీరబాహునితో "ప్రియా! నిన్ను వరించితిని. నన్ను భార్యగా నంగీకరించితినను" మని వేడుకొనియెను. వీరబాహుడును మొట్టమొదట నేడ్చి తదుపరి చిరునవ్వున రత్నావళితో నిన్ను నీ కోరిన ప్రకారము భార్యగా నంగీకరించితిని అనిబల్కి చనిపోయెను. రత్నావళియు నాతని దేహమున కుచితసంస్కారముల గావించి పతియైన వీరబాహునితో గూడ సహగమన మాచరింప నుద్యుక్తురాలయ్యెను. ఆమె చితి

లో నురుకుటకు సంసిద్ధయై యుండ పరమేశ్వరియట ప్రత్యక్షమై కుమారీ! రత్నావళీ! నీ పతిభక్తికే నెంతయు సంతసించితిని. నీ విభుఁడు గ్రమ్మర జీవించునట్లను గ్రహించితిని. సాహసింపకుము'' అని బల్కి యాంతర్హితురాలయ్యెను. తదనంతర మాదంపతులు చిరకాలము సుఖంబుగ గడపిరి.

విక్రమార్కభూపాలా! యీ చోరాగ్రేసరు చరిత్రమంతయును వింటివిగదా! ఆ చోరుఁడు రత్నావళి తనతో నాడినపల్కు లాలించి మొట్టమొదట నేలవిచారించెను, తదుపరి యెందులకు నవ్వెను, దెలుపుము. తెలిసియు దెలుపకున్న వెనుకటిశాపమే యని భేతాళుఁడు బల్కిన విని విక్రమార్కుఁడు "ఓయీ! రత్నావళికిట్టి నడియౌవన మందుననే వియోగదుఃఖము సంభవించును గదాయని విచారించెను. తదుపరి తన్ను మున్నెన్నఁడునుగని యుండని బాలిక తన్ను మోహించి నందులకై నవ్వెను." అని బల్కెను. ఆ పల్కులాలించి భేతాళుఁడు యెప్పటియట్లు వటవృక్షమును జేరబోయెను.



# ధర్మపాలకుని కథ

విక్రమార్కుడు మరల భేతాళుని బట్టుకొని భుజమునం దిడుకొని వచ్చుచుండగా నాతఁడు విక్రమార్కునితో నిట్లనియెను. మతిలేని యీ జడదారి పల్కులు నిక్కువములని భావించి యేల యీలీల శ్రమనొందెదవు. విధి నతిక్రమింప విధికైన దరంబగునే,—అయినను శ్రమని వారణార్థ మొక చక్కనికథ దెల్పెదనాలింపుము." అని బల్కి యిట్లీ క్రిందికథ జెప్పెను.

విశాలపురంబను పురీవరంబున తొల్లి నర్థదత్తుఁడను భూపాలుడు పరిపాలించుచుండెను. ఆతఁడు ప్రజలను కన్నబిడ్డలవోలె పరిపాలించుచు చిరకాలము గడపెనుకాని యంత్యదశయందు తనయనంతరము రాజ్యమేలుట కొక్కకుమారుఁడైనను లేకపోయెనుగదా యను విచారమాతని నావరించియుండెను. సంతానవాంఛతో నాతఁడు పెక్కులగు పుణ్యకార్యము లాచరించెను. ఎట్టకేలకు ఆతనిపుణ్యము ఫలించెనో యనునట్లు మహారాణి గర్భముధరించి యొకశుభదినమున నొకకుమార్తెను ప్రసవించెను. అర్థదత్తుడును సంతోషితస్వాంతుఁడై యుండెను. ఆతఁడు కుమార్తెగాక కుమారుఁడే జన్మించిన నింకను యధికముగ సంతోషించియుండును. అయినను కుమార్తె జన్మించినదను యీసడింపులేక యాబాలిక నతిగారాబముతో బెంచెను. క్రమక్రమముగా నాబాలిక దినదినాభివృద్ధినొంది సంపూర్ణ యౌవనవతియైయుండెను. ఇట్లుండ నర్థదత్తుడును దన కుమార్తె నడుగవచ్చిన రాకుమారులందరితోడను నాకుమార్తెను మీలో నెవ్వడొక్కరాత్రియైన నెడబాయకుందుమని వాగ్దాన మొసంగునో వానికే నాకుమార్తె నొసంగెదనని బల్కుచుండెను. పెక్కురు రాకుమారులట్లు వాగ్దాన మొస

రింపలేమని వెనుక కేగిరి. ఎట్టకేలకు ధర్మపాలకుడను రాకుమారుఁడట్లు వాగ్దాన మొనరించి యామెనుద్వాహమాడెను.

ధర్మపాలకుఁడు భార్యను దన పట్టణమునకు గొనిపోయి యొక్క రాత్రియైనను నెడబాయక వర్తించుచుండెను. ధర్మపాలకుఁడు పగటి యందుగూడ సాధారణముగా నామె నెడబాయక నామెతోడనే సరససల్లాపములాడుచు కొంతకాలముగడపెను. ఒక్కనాడు కార్యాంతరనిమగ్నుఁడై భార్యచెంత కేగక ధర్మపాలకుఁడు దినమంతయు దర్బారులోననే గడపెను. ఇంతలో నాతని భార్య యొక విప్రబాలకుని సౌధాగ్రమునుండి దిలకించి మోహించెను. ఆ విప్రబాలకుఁడు గూడ నీమెను దిలకించి గాఢముగ ప్రేమించెను. ధర్మపాలకుఁడు మరుదినమునుండియు దన భార్యప్రవర్తనమునందింతమార్పు గలుగుట గనిపెట్టి కారణమరయుచుండెను. విప్రబాలకునితో పొత్తులభింపమి విరహాభరంబున నామె మృతిజెందెను. విప్రబాలుడును యామెపై గల మోహమున నామె మరణించినట్లు విని మరణించెను. తన భార్య మరణకారణమును గుర్తెఱిగి ధర్మపాలకుఁడుగూడ మృతిజెందెను.

విక్రమార్కభూపాలా ! యీ ముగ్వురిలో నెవరి మరణమున విశేషమున్నది. దెలిసియుండియు తెలుపకున్న వెనుకటి శాపమే యనిన భేతాళునకు విక్రమార్కు డిట్లనియెను. "ఓయీ ! కాముకీకాముకులు మరణించుటయందు విశేషమేమియును లేదు. ఒక్కరాత్రి విభుడు దరిలేనంతమాత్రమున నన్యపురుషుని మోహించినకాంతకై జీవముల విడచిన భూపాలుని మరణముననే విశేషమున్నది." అని బల్కిన విని భేతాళుఁ డెప్పటియట్లు వటవృక్షమును జేరబోయెను.



# ఒక తాపసికథ



విక్రమార్కుఁడు మరల నావటవృక్షముచెంతకు బోయి భేతాళుని పట్టి తెచ్చుచుండఁగా నాతఁడు విక్రమార్కున కీక్రిందికథ యిట్లు చెప్ప సాగెను.

తొల్లి కళింగదేశమున యజ్ఞశాలంబను గ్రామంబు గలదు. అందు సోమసుందరుఁడను నొకవిప్రసత్తముఁ డుండెను. ఆతని కొక చక్కని కుమారుఁడు గలఁడు. ఆవిప్రబాలుఁడు పదునాఱువత్సరములలోపుననే వేదవేదాంగముల నేర్చి తల్లిదండ్రుల కెంతయు ముదంబు గూర్చెను. తమకు చిరకాలంబునకు గలిగినవాఁడగుటచేతను ఆతఁడు తమ కేక పుత్త్రుఁడగుటచేతను తల్లిదండ్రు లిరువురును దమ పంచప్రాణముల నాతనియందే యుంచుకొని జీవయాత్ర సాగించుచుండిరి.

ఇట్లుండ నొక్కనాఁడు ప్రారబ్ధవశమున నాబాలకుఁడు మృతిఁబొందెను. తల్లిదండ్రు లాతనికొరకై బిట్టుగా దుఃఖించుచు నొడ లెరుంగక పడియుండ నిరుగుపొరుగువా రరుదెంచి శవ మింట నుండుట గూడదని సోమసుందరుని భార్యను నోదార్చి కడుప్రయాసమున నా శవమును రుద్రభూమికి గొనిపోయిరి. సోమసుందరుఁడును, యాతని భార్యయు మిగుల విచారించుచు నాశవముతో రుద్రభూమికి బోయిరి.

చితిపేర్చి బాలకు నందు పరుండబెట్టిరి. సోమసుందరుఁడు విచారించుచు కుమారా! జరాభరంబున కృశీభూతాంగుఁడనై యున్న నాకుత్తరక్రియ లాచరింతువని దలంచి గంపెడాశతో నుంటినిగాని విపరీతంబుగా నిటు నీకు నేన కుమారుఁడనై యుత్తరక్రియ లాచరింపవలసివచ్చినదే యని పెద్దయెలుంగున నేడ్చుచు చితి కగ్ని దగుల్పకుండెను.

ఆసమయంబున నొకతాపసి యామార్గమున బోవుచు, యాబాలుని సుందరాకారమును గాంచి యాతని దేహమున ప్రవేశింపవలయునని దలంచి పరకాయప్రవేశమంత్రంబున నాబాలుని దేహమున ప్రవేశించెను. అట్లాతఁడు ప్రవేశించుటకుబూర్వ మొకసారి యేడ్చి తదుపరి నవ్వి యాబాలుని దేహమునఁ జొచ్చెను. చితిపైనున్న బాలుఁడు జీవించినతోడనే సోమసుందరుఁడు, కిడుంగడు సంతోషితస్వాంతుఁడై, కుమారుని యాలింగన మొనర్చుకొని గృహమునకు దోడ్కొని పోయెను.

విక్రమార్కభూపాలా! వింటివిగదా యీకథ. ఆతాపసి బాలకుని దేహమును ప్రవేశించుటకు ముందు యేల విచారించెను. తనుపరి యేల నవ్వెను. తెలుపుము. తెలిసియుండియు దెలుపవేని వెనుకటి శాపమే యనిన భేతాళునకు విక్రమార్కుఁ డిట్లనియెను. "ఓయీ! తనపూర్వదేహముపై గలయభిమానముచెంపున విచారించెను. అయినను మంచిసుందరమైన దేహము లభించెనుగదా యని సంతసించి తరువాత నవ్వెను." అని బల్కుటయు భేతాళుఁ డావిక్రమార్కుని మౌనవ్రతమునకు భంగ మగుటచే మరల వటవృక్షమునకు జేరఁ బోయెను.



# శశిప్రభకథ

వెండియు విక్రమార్కుఁడు వటవృక్షముచెంత కేగి భేతాళుని బట్టుకొని బంధించి దనమూపున బెట్టుకొని వచ్చుచుండగా నాతఁడు భూపాలుని వినుమని యీక్రిందికథ జెప్పెను.

పూర్వకాలమున నేపాళదేశంబున కీర్తికేతుండను భూపాలుఁడు పరిపాలించుచుండెను. అతనికిని మహారాణియగు చంద్రప్రభకును శశిప్రభ యను కుమారీమణి యుండెను. శశిప్రభ లోకవిఖ్యాతభువనైక సుందరి. సంప్రాప్తయౌవని. ఒక్కనాఁ డాలలితాంగి సఖీజనపరివృతయై యుపవనంబున ద్రిమ్మరుచు నొక్కవిప్రకుమారుఁ దిలకించి ఆతని మోహనాకృతి గాంచి మోహించెను. ఆతని గాంచినంతటినుండియు యాలలితాంగికి నిద్రాహారములు కరవయ్యెను. తన్ను లాలింప నరుదెంచిన సఖులతో మనసిచ్చి మాటలాడకుండెను. ఆవిప్రబాలుని ఎట్లు కలిసికొని సుఖింతునా యని యనవరత మాలోచించుచుండెను.

ఆమెను గనుగొన్న సుందరుఁడు ఘనస్వామి యను వైదికకులజుడు. ఆతఁడును శశిప్రభను గాంచినంతటినుండియు పరితాపభారమున కృశించుచుండెను. ఆఘనస్వామి యొక్కనాఁడు శశిప్రభపై మనంబు నిలిపి విచారించుచున్న సమయమందు మూలస్వామి యనుసిద్ధుఁ డొకఁడచటి కరుదెంచి యాతని సమీపమున గూరుచుండి యిట్లు ప్రసంగించెను.

సిద్ధు—ఓయీ! రాకాసుధాకరసదృశమైన నీమొగంబున విన్నదనము తాండవించుచుండుటకు గల కారణమేమి?

ఘన—నిక్కముగా నామోమున విన్నదనము తాండవించుట లేదనియే నాయభిప్రాయము. తమ కట్లేల దోచుచున్నదో తెలియజాలకుంటిని.

సిద్ధు——కుమారా! నాయెడ దాపరిక మెందులకు. విపరీతమగు వింతభావము లున్నటుల స్పష్టముగా ముఖమున దోచుచున్నది. నీ వొక్కటి వాంఛించి యయ్యది యెట్లు లభించునాయని యాలోచించు చున్నట్లు దోచుచున్నది. నీవాంఛిత మెరిగించిన నయ్యది సమకూరున ట్లొనరింప ప్రయత్నింతును.

ఘన——(నమస్కరించుచు) దేవా! తమరుదివ్యజ్ఞానసంపన్నులవలె దోచుచున్నది. నన్ననుగ్రహింపవలయును. నన్ను రక్షింపవలయును. ఈపురీవరంబును బరిపాలించెడి భూపాలుని కుమార్తెయగు శశిప్రభ యను కన్యాలలామను దిలకించియుంటిని. ఆబిబ్బోకవతిపై నామనంబు లగ్నమైయుండెను. అందనిఫలంబుల కరుగిలు సాచినవాని చందమున బీదవాఁడనైన నేను మహారాజుకుమార్తెపై మోహముంచి వలవని వలపునబడి తపించుచుంటిని. ఇదియె నావృత్తాంతము.

సిద్ధు——కుమారా! విచారింపకుము. మోహము యుక్తాయుక్త ముల పరికింపనీయదు. తారతమ్యములు, యుచ్చనీచతలు పరికింప నీయదు. కానిమ్ము. ఆలతాంగికి నీయందనురాగ మున్నటుల దెలియ వచ్చెనా?

ఘన——అంతఃపురవర్తిని యగు నాలతాంగితలంపు లెట్లుండెనో నా కెట్లెరుగవచ్చును?

సిద్ధు——ఎట్లెరుగవచ్చునని యింట గూర్చున్న దెలియవచ్చునా? తెలిసికొనుటకై ప్రయత్నింపుము. దాసీజనము లేరా? వెనుక నీ వామెను దిలకించిన యుద్యానవనంబు లేదా? నిక్కమున కామె మనంబు నీపై దగిలియున్న నీ విచట నెంతగా దురపిల్లుచుంటివో యటులే యామెకూడ నీకై విచారించుచుండును గాని యూరకుండు నని భావించితివా? పొమ్ము. ముమ్ముం దావిషయమును చక్కగా దెలిసికొనుము. లేనియెడల నీ వంతఃపురమున కేగినయెడల ప్రమా దము రాగలదు.

ఘన—ఆ లతాంగియంతిపురము ప్రవేశించుటకు మార్గమున్నదా?

సిద్ధు—మనసున్నయెడల మార్గము లేకుండునా? మున్నెందరు రాచకన్నియలు దమ మనోవల్లభుల రజ్జుమార్గమున దమ శయనాగారములలోనికి రప్పించియుండలేదు. కావున నీవా విషయమై చింతింప నవసరములేదు. ప్రప్రథమమున నామెకు నీపై యనురాగ మున్నదో లేదో దెలిసికొనిరమ్ము. ఆవల దాని ననుసంధింపజేయుట కనువైన మార్గ మాలోచింతము.

ఘన—చిత్తము.

అనంతరమా ఘనస్వామి యుద్యానవన సమీపమున కరిగి యా శశిప్రభ యెచ్చటనైన గాన్పించునేమో యను నాత్రతతో నలుమూలల బరికించుచుండెను. ఆమెయు నంతఃపురమున గూరుచుండుటకు మనస్కరించక యుపవనంబునకరిగిన నచ్చట దనచిత్తచోరుడుగాన్పిం చునేమో యను నభిప్రాయమున సఖీజన పరివృతయై యచ్చటికరుదెంచెను. అచ్చట నీరదాగమప్రాప్తికై నలుదెసల బరికించుచు వేచియుండు చాతకపక్షిచందమున వేచియున్న ఘనస్వామిని దిలకించి పులకితాంగియై యాతనివైపుననే దృష్టినిల్పి యితరంబు గననొల్లక నేత్రద్వయంబు కలిమికి సార్థకంబుగా నాతని నోయగ వీక్షించుచు యటులనే నిలిచియుండెను. సఖీజనులలో నతిచతురయగు కమలయను నది యా లతాంగియింగిత మెఱింగి రహస్యముగా నామెతో నిట్లని యెను. 'చెలీ! నీ యింగిత మెఱింగితిని. ఇచట నిందరిలో యిట్లుప్రవర్తించుట మంచిదిగాదు. గావున మన మంతఃపురమునకేగి యనంతరము మన యంతఃపురమున కాతని రప్పించుకొనుట కనువైనమార్గ మాలోచింతము. అతని నెట్టులైన నీరాత్రికి నీ యంతఃపురంబునకు దోడ్కొనివచ్చెదను. అనిబలికిన కమలపలుకుల కలరి చెలీ! ఎప్పుడో రాత్రియని నీవు వక్కాణించుచున్నావు. రాత్రివరకీ దేహము నిలుచు

నట్లు దోచుటలేదు. ఈ విరహంబును గడచి రాత్రివరకు జీవించినగదా యావల ప్రియునితో గలియుట యంతవరకెట్లు నిలువగలను. ఇచ్చట నిలచియున్న నాతని సుందరాకారమైన వీక్షించి కొంతసంతసము నొందవచ్చునని దలంచియుండ దానికిగూడ నీవంతరాయము గల్గింపనెంచుచుంటివా? యిదినీకు న్యాయమా? కడుంగడుగూర్చు చెలివైనను నాకీమాత్ర ముపకార మాచరింపజాలవా? యని యా శశిప్రభ పలుకుటయు కమల "అమ్మా! దాసిముండలనోట నువ్వుగింజనానదు. లేని దానికే చిలువలు పలవలు గల్పించి గోరంతలు కొండంతలుగా వర్ణించి దమ ప్రియులతోడనో—హితులతోడనో—లేకున్న దమకెదురుపడిన యెవ్వరితోనైనను వృత్తాంత మాద్యంతము వినిపింపకమానరు. రెండవకంటివాని కీవృత్తాంతము దెలిసినయెడల నానోటినుండి యానోటికీసంగతి యంతయు దవానలముభంగి నిముషమున వ్యాపించును. కార్యభారమింక నాతలపైనుంచుము. పైగా నాతడు నిను సాభిలాషముగ వీక్షించెనో లేదో దెలిసికొనకుండ తొందరపడుటవలన ప్రయోజనముండునా? ఆతఁడు త్రిజగన్మోహినివైన నిను వలచుటొక లెక్కలోనిదిగాదుగాని స్త్రీలు బేలహృదయలై తమ వాంఛితమును వెల్లడించిన పురుషులు చులకనగా జూతురు. ఇదే నేనేగి యాతనితో వలయురీతిని సంభాషించి యాతని యింగిత మెఱిఁగివచ్చెదను. నీ వంతఃపురమున కేగుము. నీవాలించితివో లేదోకాని యీ దాసిముండ లొకరితోనొకరు యీనడిమధ్యాహ్న సమయమున వనవిహారములేమిటని వెక్కిరింపుగా బలుకుచుండిరి. ఎంత గోప్యముగా నుంపదలంచినను యిట్టి వ్యవహారములు సాధారణముగా గుట్టుగా నుండజాలవు." అని పెక్కువిధముల బోధించి శశిప్రభను సమ్మతింపజేసి యంతఃపురమునకంపెను.

కమల యనంతరము ఘనస్వామిని జేరంజని యాతనితో సల్లాపములాడ ప్రారంభించెను. స్వామిగారికి నిన్నటినుండియు నిద్దురలేనట్లుగా

నున్నది కన్నులెఱ్ఱబాఱియున్న వే యని పరిహాససూచకముగా బల్కెను.
ఘనస్వామియు అగును నిద్దురలేనిమాట వాస్తవమే కాని యది నాస్వ యంకృతాపరాధ మెంతమాత్రమును గాదని నొక్కి వక్కాణింప గలను.

కమల—అనగా తమ్మొక్కరు ప్రేరేచుటచేగాని—యొకరి పనిచేయు టయందు నిమగ్నులై యుండుటచేగాని నిద్దుర లేదనియేకదా తమ యభిప్రాయము.

ఘన—కాదుకాదు. ఒకరికి సంపూర్తిగా లోబడుటచే.

కమల—ఇప్పటి కవగతమైనట్లున్నది. మన్మథునకు లోబడి యొక కాంతకొఱకై రేయెల్ల దిరిగియుండిరిగాబోలును. అయినను కాంతనైన నా కెందులకీగొడవయంతయు—

ఘనస్వామియు నామె శశిప్రభతో మంతనమున మాటలాడుట దిలకించి యున్నవాఁడగుటచే నామెను దాటిపోనీయ గూడదనియును నామెతో స్నేహముజేసి యామె యనుగ్రహమున శశిప్రభ పొందు జెందవలెననియు నిశ్చయించుకొని యామెను వెడలిపోనీయక నిల్పి యామె కిట్లనియెను. నీవు చెప్పినది కొంతవాస్తవ్యమే కాని కొంత యసత్యముగూడ నున్నది.

కమ—అనగా మన్మథునకు లోబడితిననుట సత్యేతరమా?

ఘన—కాదుకాదు. అదియే నిక్కువముగాని స్వవశతదక్క సంపూర్ణముగా నొడ్లకు లోబడినవాఁడు రేయెల్ల ద్రిమ్మరు టెట్లుసంభవించును. అదియే సత్యేతరమని నాయభిప్రాయము.

కమల—(పెద్దపెట్టున నవ్వుచు) కావలసిన కాంతకొఱకై గాలు గాలిన పిల్లవలె ప్రతివాడును దిరుగుచుండును గదా? నీ వొంటిగా నెందులకు గూర్చుంటివి. నీకు తిరిగి తిరిగి కార్యము సాధింపవలయు నని యాందోళనము లేదా?

ఘన—అందని ద్రాక్షపండ్లకర్రలు సాచి తిరిగి యత్నించిన కార్యసాధనమగునా? కాదని తోచినది గావుననే తిరుగలేదు. కాని నామాట యటుంచుము. కోటలోని విశేషము లేమియు జెప్పితివి కావుగదా!

కమల—చతురముగా అందని ద్రాక్షపండని జెప్పి యాకాంతపై రైనను దెలుపక దప్పించుకొనచుంటివే అట్టి నీకు కోటలోని విశేషములు రవంత పైకిబోయిన మాపీక లెగిరిపోవు విశేషములను దెలుపుమని యెట్లడుగుచుంటివి.

ఘన—అట్టి ప్రమాదజనితములగు విశేషముల జెప్పవలదు. సామాన్యములైన వేమైన నున్న యెడ దెలుపుము. మీ రాకుమార్తె క్షేమముగా నున్నదా? పోనీ యీమాత్రము సంగతియైన జెప్ప వచ్చును గదా?

కమల—చెప్పదలచుకొన్నపుడెద్దియైనను జెప్పవచ్చును. లేని యెడల నేదియును జెప్పరాదు. అయినను మా శశిప్రభ క్షేమముతో నీకేమి సంబంధమున్నది. రాజుగా రుండగా దేవిగా రుండగా వారి క్షేమసమాచారము లడుగక రాకుమార్తె క్షేమ మేలయడిగితివి. వారి క్షేమసమాచారముతో నీకేమియు సంబంధములేదా?

ఘన—అబ్బా యెంతచదివితివి. రాకుమార్తెయొద్ద నీ వుంటివి గనుక రాకుమార్తె క్షేమముగా నుండెనా యని ప్రశ్నించితిని. ఇంత మాత్రమున భూపాలునిక్షేమముతో నాకు నిమిత్తము లేదంటినా? పోనిమ్ము అందరును క్షేమముగా నుండిరా?

కమల—మొదట నీ వెవ్వరిక్షేమ మడిగితివో యామె సమాచారమే దెల్పుదును. తక్కినవారి సంగతి నీకెందులకు.

ఘన—అనగా నాకామె సంగతియే కావలయుననియే గదా నీ యభిప్రాయము.

కమల—నాయభిప్రాయమే కాదు. నీయభిప్రాయముకూడ నంతి యేగదా? వినుము. ఆమె యెట్లున్నదో ప్రత్యక్షముగా నీవే తిల కించి యుంటివిగదా? నేను జెప్పుటెందులకు.

ఘన—నే నామెను చూచితినా? యెప్పుడు? ఎక్కడనుండి.

కమల—పాపము. యేమియు నెరుగవు. నోట వ్రేలిడిన కరువజా లవు వెన్నయిడిన మ్రింగజాలవు. ఎక్కడనుండి చూచితివో యెప్పుడు చూచితివో నేను చెప్పవలయునా? నాకంత యగత్యమేమున్నది. కావలసియున్న రాకుమార్తె నడుగుము. ఆమెయే చెప్పగలదు.

ఘన—ఆమెయేజూచినదా? నీతో జెప్పినదా? నేను దన్ను జూచుచుంటినని జెప్పినదా! కాదుకాదు. నీవు పొరబడుచుంటి వేమో ఆమెయే నన్ను జూచియుండవచ్చును. కాని నే నామెను చూడలేదు.

కమ—అయ్యో! అట్లుగాదు. తాము తనవంకకు జూచుచుండ తాను మిమ్ము జూచినది. అట్లే చెప్పినట్లు జ్ఞాపకము.

ఘన—ఆమె యారోగ్యమునుగూర్చి చెప్పుమన నిదియంతయు నెందులకు.

కమల—ఆమెను చూచితివిగాన ఆమె యెట్లున్నదో నీకు నే జెప్ప నక్కరలేకయే దెలియునుగదా?

ఘన—మధ్యాహ్న ముద్యానవనమున కరుదెంచెనుగదా? యెందు లకు వచ్చియంత త్వరితముగా వెడలిపోనేల?

కమల—ఆ ప్రశ్న మిమ్ముల నడిగిన మీరేమందురో తెలియ కున్నది. అంత త్వరితముగా వెడలిన దేమని ప్రశ్నింతురా? ఇక్కడనే గూర్చుండవలసినదని మీయభిప్రాయమా. అనగా ఆమె యిక్కడనే యున్న తనివిదీర నామెను జూచుచుందురుగాబోలును. పోనిండు ఇప్పుడు మరల నేనేగి యామె నిచ్చుటకు గొనిరమ్మనిసెలవా?

తమ యిచ్చవచ్చినంతసేపును యిచ్చటనే యుండవలసినదని యామె కెటిగింతునా?

ఘన—మాటమాటకును తప్పుబట్టుచున్న నీతో మాటలాడుట బహుకష్టముగానున్నది. ఎట్లు మాట్లాడినను దానికిరాద్ధాంతసిద్ధాంతము లొనరించుచు దానికి పూర్వపక్షసిద్ధాంతము లొనరించు చున్నావు.

కమల—తమ కంత కష్టమెందులకు. వెడలిపోయెదను లెండు (పోబోవును)

ఘన—కమలా! కమలా! వెడలిపోకుము. అడుగవలసినదాని నడుగనైతిని. మీచెలి చిక్కియున్నదేమి.

కమల—నిన్నటినుండి తిండిలేకున్న నిద్దురలేకున్న చిక్కక బలిసి యుండునా?

ఘన—నిన్నటినుండియా? ఎందువలన? నిద్రాహారములు లేనప్పుడు వనవిహార మెందులకు. వనమునకు వచ్చియు నొకటిరెండు నిముషములైన నిలువక వెడలిపోవు టెందులకు? వింతగానున్నదే.

కమల—నాకును వింతగనే యున్నది.

ఘన—ఆమె మన సెవ్వనిపైననో లగ్నమైనటుల నాకు దోచు చున్నది.

కమల—నాకును అటులనే తోచుచున్నది. కాని—కాని—

ఘన—కానియేమి

కమల—పోనిండు. తమ కెందులకాగొడవయంతయు. ఆమె యెవ్వనినో వలచినదనియేదలంపుడు. అదియెటులుంగుటవలన తమకేమి ప్రయోజనము. యెవ్వనినోయటుంచుడు, మిమ్మేవరించినదనుకొనుడు. అప్పుడుమాత్ర మేమిలాభము.

ఘన—లాభమే లేకుండునా? మనసున్నమార్గము లనేకము లుండును.

కమల—మనసున్నను లేకున్నను ఎదుటవాని మనసెటుల తెలి యును. అట్టిసమయమున మార్గమున్నను లేకున్నను నొక్కటియే గదా ?

ఘన—అట్టి త్రిజగన్మోహిని తనకుదానై వరింప వలదనునట్టి ప్రవరాఖ్యుడెం డైన నుండునా ?

కమల—మిమ్మేవరించినదనుకొనుడు అప్పుడు మీరేమిచేయుదురు.

ఘన—అంత యదృష్టము పట్టిన రెక్కలుగట్టుకొనియైన నామె యంతఃపురంబుపై వ్రాలియుందును.

కమల—ఏమో !

ఘన—కమలా ! ఇంకను దాపరికమెందులకు. ఆమెను గాంచి నప్పటినుండియే మన్మథుని శరజాలములకు గురియై నవయుచుంటిని.

కమల—పెద్దఎత్తులోననేయున్నావే.

ఘన—అవును. నేటరేపటనెట్టులైనను యామె యంతఃపురమున కేగవలయునని సంకల్పించుకొంటిని.

కమల—ఆమెకు తనపై యనురాగములేనిచో.

ఘన—అటులైన నామెను కడసారియొకమారు దిలకించి హాయిగా మరణింతును. ఇదియే నానిశ్చయము.

కమల—అంత యగత్యమేమున్నది.

ఘన—అంత యగత్యము లేకుండజేయుమనియే నిన్నిప్పటినుండి యుగోరుచున్నాను.

కమల—మాలోనేమున్నది. ఇంక నాకు సెలవిండు పోయివచ్చె దను నే నరుదెంచుపని కాలస్యమైన మరల మా రాకుమార్తె కోప గించును.

ఘన—మంచిది. కాని మీ రాకుమార్తె యెవ్వని వరించినదో దెల్పితివి కావుగదా !

కమల—తమ రరుదెంచి యామెవలననే యావృత్తాంతమును తమరే స్వయముగా దెలిసికొనుఁడు. యింతకంటె చెప్పదగిన దేమి యును లేదు.

అని బలుకుచు కమల తరలిపోయెను. ఘనస్వామియు యచటి నుండి కదలి సిద్ధయోగియున్న తావునకు బోయి నమస్కరించి తన కును యంతఃపుర పరిచారికయగు కమలకును జరిగిన సంభాషణాక్రమ మంతయును దెల్పి కర్తవ్య ముపదేశింపుఁడని వేడుకొనియెను. అంత నా యోగిపుంగవుఁడును యాతని రహస్యమందిరములోనికి దీసికొని పోయెను.

మరునాఁ డుదయమున భూపాలుఁడు నిండుకొలువున నుండ నొక ప్రతీహారి జనుదెంచి యొక యోగిపుంగవుఁడును యొక వనితయు దర్శన మపేక్షించి ద్వారముకడ నిరీక్షించుచున్నారని దెల్పెను. భూపాలుఁ డును వారిని తత్క్షణము లోనికిగొని రా నాజ్ఞయిడెను. ప్రతీహారి నిష్క్రమించి యోగిపుంగవుని వనితను దోడ్కొని సభాతలంబున కరుదెంచెను. భూపాలతిలకుఁ డా యతిచంద్రుని విధివిధానంబున నర్చించి సుఖాసనోపవిష్టుని గావించి "తమరాకచే మా గృహము పవిత్రమయ్యెను. తమ పాదపద్మముల నర్చించుట జేసినందున కొంత వరకు కృతార్థుఁడ నైతినని సంతసించుచుంటిని. మహానుభావులరగు తమ యూరక విచ్చేయరుగాన తమ యభిమత మెద్దియో వచింపవేడె దను. దేవరవాంఛిత మెట్టిదైనను దీర్చుటకు సంసిద్ధుఁడనై యున్నాను. సెలవీయ వలయును." అని వినయవిధేయతలతో బల్కెను. ఆపల్కు లాలించి నరేంద్రచంద్రమా! ఈ లతాతన్విని నా యనుంగుశిష్యుఁ డైన నొక నృపాలసూనుఁడు నాయొద్ద దిగవిడచి మరల కొలది దినము లలో నరుదెంతునని బల్కి దేశసందర్శనార్థ మరిగియుండెను. ఇంత కును రాలేదు. తీర్థయాత్రకు బోవనెంచుటచే నీమెను యెచ్చటడించి

పోవుచునాయుని విచారించుచుండ నీవు సద్గుణభూయిష్ఠుఁడ వని విని నీ యంతఃపురంబున నీమెను డించి పోయిన నీమె కెట్టిలోపమును జరుగ బోదని దలంచి యిచ్చటికి కరుదెంచితిని. నావాంఛిత మెరిగించితిని. పిమ్మట నీచిత్తమునవచ్చిన ట్లొనరింపుమనుటయు భూవిభుఁడు కడుం గడు సంతసంబున నామునిపుంగవుని పదంబులకు బునరభివందన మాచరించి మహాత్మా! తమచే నాజ్ఞాపింపదగువాడను గదా! తమ పల్కుల కెదురాడుదునే అవశ్య మటులనే వర్తింతును. నాకుమార్తెతో సమముగా జూచుకొందును. తమ మనంబున శంకింప నగత్యము లేదుయని బలికి ప్రతీహారిచే కుమార్తెకడ కా వనితను బంపెను. యోగిపుంగవుఁడును భూపాలునిచే నాతిథ్యమంది యాదిన మచట గడపి నిజేచ్ఛ జనియెను.

పాఠకమహాశయులకు ఆజడదారి సిద్ధయోగియనియు నాతనిది ఘనస్వామియొక్క మారురూపంబనియు వేరుగ జెప్పవలయునా! సిద్ధయోగి యుపదేశించిన యొకానొక మంత్రప్రభావంబున ఘనస్వామి పగలెల్ల స్త్రీరూపముననుఁ రాత్రిభాగమున బురుషుఁడుగను ప్రవర్తించుచుండెను. శశిప్రభాఘనస్వాము లిరువురును నమ రహస్యంబు వెల్లడిగాకుండ కొన్ని నెలలు నిరంతర కేళీవినోదంబుల దేలిరి.

అట్లు గొన్ని మాసములరిగెను. ఘనస్వామి యొక్క స్త్రీరూపంబునుఁ బొడగాంచి మంత్రినూనుఁడు చింతాకులస్వాంతుఁడై యామె నెట్లైనను వివాహమాడవలయునని సంకల్పించుకొనియెను. ఆతనివాంఛాంకురము క్రమక్రమముగా కొలదికాలముననే వృద్ధినొందెను. అన్నపానముల సరకుగొనక విరహాభరంబున సంతత మేకాంతముననుండుచు యాలతాతన్వి పోయగమే దలంచుచుండెను. కుమారుని వృత్తాంత మంతయును మంత్రివినుఁ బడియెను. కుమారునకా కుటిలాలకనిచ్చి వివాహము గావించుమని భూపాలుని నడుగుటకు నోరాడక గొన్ని

దినంబులు వేగించెను. అప్పటికి కుమారుని స్థితిగతులన్నియు విపరీత మయ్యెను. సదా కుమారుని గనిపెట్టుకొని యుండవలసివచ్చుటచే నా స్థానమునకు బోవుట మానెను.

ఇట్లుండ నొక్కదినమున పెక్కులగు రాచకార్యములు నిలిచియుండు టచే భూపాలుఁడు మంత్రిని బిలువనంపి యాతనితో నిట్లనియెను. అమాత్యపుంగవా! తమరాస్థానమునకు రాకుండుటచే వ్యవహారము లన్నియు పాడగుచుండెను. ఏదోయొక మహత్తరకార్య ముండుటచే తమరరుదెంచుట మానియుందురని దలంచెదను. శరీరమున నారోగ్య ముగా లేదుగదా? అదేమి తమముఖంబు నేడు వింతగా గాన్పించు చున్నదేమని ప్రశ్నించెను. మంత్రియు ఇంకసాహసింపకున్న తనకుమా రుఁడు జీవించుటకు గత్యంతరములేదని దలంచి భూపాలున కిట్లనియెను. "దేవా! యేమని విన్నవింతును. తమకుమారీమణితో సంచరించు చున్న యా కుటిలాలకనుగాంచి మోహించి నా కుమారుడిప్పుడు పరి తాపభారమున కృశించుచున్నాడు. చావుబ్రతుకులమీదనున్న యా తనివిడువ సాహసింపనేరక సభకు రాజాలనైతిని. ఆమె లభింపకున్న కుమారుఁడు జీవింపడని తోచుచున్నది. వైద్యులుకూడ నట్లే యభిప్రా యమిచ్చియున్నారు." అని బలుకుటయు భూపాలుఁడును చింతా క్రాంతుఁడై చేయునదిలేక మంత్రిపుంగవునితో నిట్లనియెను. ఓయీ! నీకుమారుఁడొకటియు నాకుమారుఁ డొకటియునుగాదు. గావున నాతనివాంఛిత మవశ్య మీడేర్పవలయును. ముందెటునుండి యెటు వచ్చునోయనిమాత్ర మిసుమంత యాలోచింపవలసియున్నది. ఆ జడ దారియరుదెంచి యాననితను తనకప్పగించుమనినప్పు డాతనికే బ్రతి మాలి జరిగినదంతయును దెల్పి మన్నింపుమని వేడుకొందము. కావున కుమారునకు ధైర్యము గరపుము. వివాహమునకు శుభముహూర్తము కూడ నున్నదని జెప్పుము. కాదు కాదు నీవుజెప్పిన యాతఁడు నమ్మ

కుండునేమో నేనగు రెంచి యాతనితో నీవృత్తాంతమంతయు దెల్పెదను. అనిబల్కి మంత్రిపుంగవునితో నేగి మంత్రికుమారుఁడగు సుబుద్ధికి ధైర్య మునొసఁపి వచ్చెను.

తదనంతరము భూపాలుఁడు కమలను బిలువనంపి జరిగిన యావద్వృత్తాంతమామెకు దెల్పి కుమార్తెతోనున్న సుందరికి సుబుద్ధిపై మనసు నిలుచునట్లొనరింపుమని యాజ్ఞాపించెను. కమలయు సంతరంగమున నపరిమితంబుగా భయంబుజెంది వల్లెయని భూపాలునితో బల్కి శశిప్రభయంతఃపురంబునకు జనియెను. కమల శశిప్రభతో నిట్లనియెను. అమ్మా! నీవు కోరినపూరుషుఁడు నీకు లభించెను. కాని యిందొక దొసగువాటిల్లినది. మంత్రిసూనుఁడు స్త్రీరూపముననున్న ఘనస్వామినిగాంచి మోహించెను. భూపాలుఁ డీమెనాతనికిచ్చి పరిణయము గావింప సంకల్పించుకొనియెను. ఇట్టియెడ నాటంకముబెట్టిన చెట్టగలుగుట నిశ్చయము. పైగా నీకు గర్భము నిలచినట్లుగూడ దోచుచున్నది. కావున నీవాతనితో మాటలాడి యీవివాహమునకు సమ్మతింపజేయుము. తదుపరి నెదోయొక మాయోపాయమున సుబుద్ధికిని యీసుందరికిని సంయోగము గలుగకుండునట్లు జేయుదము. ఇంతట దైవ మనుకూలుండైన మనకుగూడ కొంతమేలు గలుగవచ్చును. అని బల్కి యామెను సమ్మతింపజేసి ఘనస్వామినిగూడ తమ మంత్రాంగములో జేర్చుకొని మువ్వురును యెదో నాలోచించుకొనిరి.

కమలయు భూపాలుని డాయంజని యిట్లనియె "ప్రభుకులతిలకా! ఎట్టకేలకా సుందరి సుబుద్ధిని పరిణయమాడుట కంగీకరింపజేసితిని. కాని యామెకొక్క నియమమున్నదట, యేమందురా! వివాహమైన యనంతరము వరుఁడు తీర్థయాత్రల నారుమాసములు గడపినగాని యాతనితో గలియుటకంగీకరింపదట. కావున వివాహముజరిగినపిమ్మటామె నియమము నిలుపుట కంగీకారమైన నీవివాహమునకామె యాటంక

మొద్దియును లేసని బల్కెనది. పైన దేవరచిత్తము." అని వినయవిధే యతలతో బల్కువాక్యముల నాలోచించి అటులనే జరిగింపవచ్చునని ప్రత్యుత్తరవిచ్చి వివాహమునకై ప్రయత్నము లొనరింపసాగెను.

ఒక్క శుభముహూర్తమున సుబుద్ధిసుందరులవివాహ మతివైభవ ముగా జరిగెను. సుబుద్ధియు సుందరితో నెప్పుడు గలియుదునాయని యాత్రపడుచుండ భూపాలుఁడరుదెంచి యామెనియామమును గూర్చి దెల్పి యాదినముననే యాత్రార్థమరుగుమని హితబోధగావించెను. భూపాలుని యానతిచే కట్టుబడిసుబుద్ధి యాత్రార్థమై యరిగెను. సుం దరియు సుబుద్ధియొక్క జ్యేష్ఠభార్యయైన కళావతియొక్క యంతఃపుర మున నివసించునట్లు నిర్ణయింపబడియెను. గొన్నిదినంబు లెట్టివిశేషాం శములును లేక ప్రశాంతముగ గడచిపోయెను.

కళావతి సుందరినిగాంచి యామె దేహమంతయును పురుషుని శరీ రమువలె నుండుట దిలకించియు సందేహింపక యొక్కనాఁడేకతమ గూర్చుండి తనలో తానిట్లు వితర్కించుచుండెను. ఆహా యీసుందరి యందము నా డెందమునుగూడ కలంచివైచుచుండెను. యిట్లుండ నావిభుని చిత్తము గలంచియుండుట కాశ్చర్యమేమి. ఇట్టి సుందరి పొందు లభించియుండ యింక నావిభుడు నను కన్నెత్తియైన జూచునా! ఇంక నాకేది దారి. నుపభర్తకై ప్రాణాలాడియో లేక యీసపత్ని తోత్తున కూడిగము సేయుచు మగని యనుగ్రహము సంపాదించి యాతనితో క్రీడించుట యెండె జరుగవలయును. అని యేమేమో యాలోచించుకొనుచు సుందరి మగవాఁడై యున్న యెడల హాయిగా నాతనితో స్వేచ్ఛగా క్రీడించుచు సౌఖ్యంబుగ నుండునుగదా యని యించుక బిగ్గరగా పల్కెను. ఆసమీపమున నేదో పని యుండుటచే సుందరి యాపల్కు లాలించి యించుక మందహాసమొనరించెను. కళా వతియు దనపల్కులామె వినియెనని యించుక సంకోచించియు మరల

నామెకు దనయెడ ననుమానము జనింపకుండుటకై సుందరీ! నీ సౌంద ర్యము నన్నే యాకర్షించుచుండుటచే సుమీ యట్లంటిని యని క్రమ్ము కొనియెను. సుందరియు అంతనుండి క్రమక్రమముగా నామెతో కలసి కట్టుగా ప్రవర్తింపుచు నామెనుగూడి విహరించుచుండెను.

కళావతి సుందరి మగవాడైన నాభాగ్యమేమని కొనియాడనని పలుమరు దలంచుచుండెను. సుందరియు యందుల కనుగుణ్యముగా నేను బురుషుఁడనైన నాతో బలుకవుగదా యని పరిహాసమాడుచుం డెను. ఇట్లుండ నొక్కనాడు కళావతి సుందరితో సుందరీ! ని న్నెడ బాసి యున్నచో నెదో ప్రియునియెడబాసి యున్నట్లు దోచునుసుమీ యని బల్కెను. అంత సుందరియు అటులైన నేను పురుషుఁడనై యుందునని నీభావమా? ప్రశ్నించెను. అంత నామెయు నీవు పురు షుఁడవని గాదు. కాని యని యెదో బలుకబోవుచుండ సుందరియు నీకొరకు నను బురుషుని గమ్మందువా? అటులైన నిముషమున బురు షుఁడను కాగలను. అని బలికి యూరకుండెను. కళావతియు ఇంత కంటె కోరదగిన దేమున్నది. అంత సుందరి పురుషుఁడను కాగలను గాని నీవు వెనువెంట నేగికురించెదవేమో సుమీ యని హెచ్చరిం చెను. ఇటుల రహస్యాగారమున సరసల్లాపంబుల నాదినమంతయు గడపిరి.

మరునాఁ డుదయమునుండియు కళావతి సుందరుని బురుషునిగమ్మని పదేపదే ప్రార్థించెను. కాకున్న జీవముల వాయుదుననియెను. యెట కేలకు సుందరి సమ్మతించి నాటిరాత్రికి దాను పురుషుఁడనగుదునని జెప్పెను. సుందరియు నాడు సేవకుల కందరకు నాదినమున సెల వొసంగి యింటికి బంపివైచెను. మరికొందరి కేవో పనులు గల్పించి నాటిరాత్రి తమశయనాగారమునకు సమీపమున నొక్కరును లేనటు జేసివైచెను. అనంతరము శయనాగారమును ప్రవేశించి కళావతి గోరి

నట్లుగా బురుషుఁడై యామెతో క్రీడించెను. ఆమెయు ఘనస్వామిని యుల్లంబు పల్లవించునటుల వర్తించి సంతృప్తమానసయై యుండెను. ఇట్లు నాలుగుమాసములు గతించెను. సుబుద్ధి యాత్రనుండి జనుదెంచు కాలము సమీపించెను. ఘనస్వామి కళావతికంతయు బోధించి యొకనాటిరాత్రి యామెతో నంతఃపురమువిడచి చనెను. మంత్రి మొదలగు వారావృత్తాంతమంతయు నెఱుంగక కళావతీసుందరినిజంపి యెందో పారవైచి తనగుట్టు వెల్లడియగుట తప్పదనియు అందువలన రచ్చకీడ్పింపబడి మరణింపవలసివచ్చుననియు దలపోసి యెందో బలాత్కారముగ జచ్చెననియు సిద్ధాంతపరచుకొనిరి. అయినను వారల శవములైన గాన్పించునేమోయని పురమంతయు వెతకించిరి. కాని లాభమిసుమంతయు గాన్పింపదయ్యెను.

శశిప్రభకు గర్భము నిలిచెను. దినదినమునను గర్భచిహ్నములు వృద్ధియగుచుండెను. ఈపెనుముప్పునుండి దనచెలికత్తెను దప్పింపవలయునని సంకల్పించుకొని ఘనస్వామి యెందైన గాన్పించునేమోయని పలుమారు గ్రామమంతయు దిరుగుచుండెను. ఒక్కనాడు తొల్లి రాజేంద్రుని సభారంగమునకు సుందరిని దోడ్కొనివచ్చినయతి గాన్పించుటయు నాతని గుర్తించి శశిప్రభవృత్తాంతమంతయును దెల్పి కర్తవ్యమేమని ప్రశ్నించెను. అంత జడదారి వేరుదారిగానక తనయొద్దనున్న యొక శిష్యునిజూపి యీతనిని మీశశిప్రభ భర్తగా నంగీకరించినచో నీయాపద వాయగలదు. గావున వీనిని యుపవనంబు దోడ్కొనిపోయి యామెకుజూపి మరల శీఘ్రముగా నితనిని దోడ్కొనిరమ్ము. అవల యామె యభిమతమారసి కర్తవ్యమాలోచింతమనియెను. కమల యట్లొనరించెను. అంతియెగాక ఆశశిప్రభయు నీశిష్యుఁడునుగూడ పరస్పరమొకరిపైనొకరు వలపుగొనియున్నారనిగూడ వచించెను.

మరునాఁడు జడదారి తన శిష్యునకు రాజపుత్రుని వేషము వేయించి తనతో భూపాలుని యాస్థానమునకు గొనిపోయి భూపాలునితో తానానాఁడు డించిపోయిన వనితనుఁ గొనివచ్చి తనతో నరుదెంచిన రాకుమారున కీయవలసినదని జెప్పెను. అంత భూపాలుఁడు నడచిన వృత్తాంతమంతయు దెల్పి యపరాధము క్షమించుమని ప్రార్థించి యావనితకు బదులుగా దనకుమార్తె నాతనికిచ్చి పరిణయము చేయుటకు సమ్మతింపవలసినదనియు ప్రార్థించెను. జడదారియు కొంతవఱకు కోపాటోపము జూపి యెట్టకేలకు భూపాలుఁడు వచించినట్లు శశిప్రభను రాకుమారునకిచ్చి పరిణయము గావింపుమని శాశించెను. భూపాలుఁ డట్లొనరించి యాతని యనుగ్రహమునకు బాత్రుడయ్యెను.

‘ సిద్ధయోగిశిష్యుఁడు శశిప్రభను దోడ్కొనిచనియెను. తదనంతరము గొన్నిదినంబులకు సిద్ధయోగిచెంతకు ఘనస్వామి యరుదెంచి శశిప్రభ తనకు భార్యగా నుండవలసినదిగాని యితరునకు గాదని నగవుపెట్టెను. ”

విక్రమార్కభూపాలా! శశిప్రభచారిత్రమంతయు వింటివిగదా? ఆశశిప్రభతో ప్రప్రథమమున గలిసికొనిన ఘనస్వామి భర్తయా? లేక యాసిద్ధయోగిశిష్యుఁడగు నాతఁడుభర్తయా? దెలిసియుండియు దెలుపకుండిన నీశిరంబు వేయువ్రక్కలగునుసుమీయనిన భేతాళునకు విక్రమార్కుఁడోయీ! ఇందు వివరింపవలసినది యెంతయూలేదు. ఆకన్యకామణిని తండ్రి యెవ్వనికి దారాపూర్వకముగా కన్యాదానమొసంగెనో యాతఁడే భర్త. ” అని బల్కెను. ఆపల్కులాలించి భేతాళుఁడు మరల యెప్పటి వటవృక్షమును జేర నరిగెను.



# వావి లేని కథ

* విక్రమార్కుడు యిరువదినాలుగవసారి మరల భేతాళుని పట్టు కొని బంధించి భుజముపైనుంచుకొని తొలికోడివేళయగుటచే భేతాళుని త్వరితముగా జడదారియొద్దకు గొనిపోవసంకల్పించుకొని సత్వరముగా నడచుచుండ భేతాళు డీక్రింద కథజెప్పెను.

తొల్లి యొక భూపాలుడు దనరాజ్యమును గోలుపోయి భార్యతోడను, కుమార్తెతోడను గలిసి యరణ్యమార్గము ప్రయాణము చేయుచు కాశికాపురంబునకు బోవనెంచెను. కాని యొక విపినమందు భూపాలుడు పులివాతబడి మరణించెను. భార్యయు కుమార్తెయు భూపాలుని యాకస్మికమరణమునకై బిట్టుగా విచారించి యింక నచ్చోట నిలుచుట క్షేమకరముగాదని యెంచి సమీపముననున్న గ్రామ మేదైన జేరుకొనవలయునని ముందునకు బయనము సాగించుచుండిరి.

వారివెనుక కొంతదవ్వులనుండి యొకవిప్రుడును యాతనికుమారుడును యరుదెంచుచుండిరి. ఆ మనుజు లిరువురును తమకు గాన్పించు పదచిహ్నములబట్టి తమకంటె ముందుగా నిరువురు స్త్రీలు బోవుచున్నట్లు నిశ్చయించుకొనిరి. అంతట కుమారుడు జనకా! ముందు పోవువా రెవ్వరో మనకుదెలియకున్నను వారునిస్సహాయులై సీవనంబున నరుగుచున్నట్లు దోచెడిని. మనమును వంటచేయుటకైన నెవ్వరును లేక యీయడవులందు కష్టపడుచున్నాము. నాపోవు కాంతల కెట్టి యుపకారమైన నాచరించి వారిని మన మిరువురమును పెండ్లి యాడుదము. అందువలన వారికి తోడు లభించినట్లగును. మనకును కొంతలాభకారియే యగును.'' అని బల్కెను. ఆపల్కులాలించి

---

* పీఠికలో జెప్పినటుల కొన్ని కథలు విడువబడెను. వానిని భట్టివిక్రమార్కుని కథలు అను గ్రంథమున జూడుడు.

తండ్రియు సమ్మతించి కుమారునకు సవిమర్శకముగా నాపదముల గుర్తులనుజూపి నిం దొక గుర్తు పెద్దదిగా నున్నది. రెండవది చిన్ని లేబ్రాయువుజవ్వని పదగుర్తువలె దోచుచున్నది. గొప్పలగు పదగుర్తులు గలకొమ్మ వయసుమళ్ళినదై యుండవచ్చును. కాన యామెను నేను గైకొందును. చిన్నవగుపదములగుర్తుగల యామెను నీవు గైకొనుము. అని బలికి ముందేగుచున్నవారల గలసికొన త్వరిత గమనంబున నడువుమని కుమారుని త్వరపెట్టెను.

కొంతదవ్వరుగునంతకు వారాస్త్రీలను సమీపించి పెద్దదగుపదములగుర్తుగల లేబ్రాయువు నాతనితండ్రియు చిన్నవగు పదగుర్తులు గల యువతిని కుమారుడును పరిణయమాడిరి. పిమ్మట వారిరువురకును సంతతిజనించెను.

విక్రమార్కభూపాలా! వింటివిగదా! యీకథ. తండ్రికుమారులకుదయించినవారు దమలోదా మెవరుసను బిలుచుకొనవలయును దెలువుము. తెలిసియు దెలుపకున్న వెనుకటిశాపమేయనిన విక్రమార్కునకెద్దియును దోపనందున మౌనవ్రతుడై నడువసాగెను.



తానువైచిన యిరువదినాల్గు ప్రశ్నములకును సమాధాన మొసంగినందులకు సంతసించి భేతాళుడు విక్రమార్కునకిట్లనియెను. ఓయీ! నిష్కారణముగా నీవంటి యుదారపూరుషుడు మరణింపరాదు. శాంతిశీలుడను నీజడదారి కాళికాదేవి నుపాసించి నన్ను దన దాసునిగా జేసికొన గోరెదను. అంతనామెయు—యాతని స్వప్నమున ప్రత్యక్షమై కృష్ణచతుర్దశినాడు దన్నుపాసించి సకలలక్షణ సంపన్నుడగు నొక భూపాలునైనను యష్టసిద్ధులనొందిన కాపాలికునైనను దనకు బలియొసంగిన నీయభిమత మీడేర్తునని బల్కి యంతర్హితురాలయ్యెను. అంత

టినుండియు నీశాంతిశీలుఁడు దగినభూపాలునికై వెతకివెతకి నినుగాంచి దన కార్యానుకూలమునకై యనుదినమును నీసభారంగమున కరుదెంచుచు నీకతనిపై నమ్మికపుట్టునట్లు మెట్లునటించినదియు నీవ యెరుంగుదువు. ఇపుడు నను నీవుగొనిపోయినతోడనే నను మంత్రబుద్ధిని జేసి గూర్చుండబెట్టి నిను సమీపకాసారమున స్నానముచేసి రమ్మను. అనంతరము పూజావిధానమంతయు ముగించి కాళికకు సాష్టాంగనమస్కార మాచరింపుమని యాజ్ఞాపించును. అంత నీవు సాగిలబడినంత నీ శిరంబును ఖండించును. ఆతఁడు క్రూరచిత్తుఁ డగుటవలన నాతని సేవింపనోపను. కావున నాపల్కు లాలింపుము. ఆతఁడు నమస్కరింపు మనిన యది యెట్లుచేయవలయునో చేసిచూపుమనుము. ఆతడు నమస్కరించుచుండ నీ చంద్రాయుధముచే నాతని ఖండింపుము. కాళికకు పూజావిధానమున లోపము గలుగనందునను, సిద్ధుడైన నీతని బలిగానొసంగుటవలనను నీకుప్రత్యక్షమై నన్ను నీకర్పింపగలదు. సద్గుణరాశి వగు నిను సేవించుదలంపుననే యిట్లు వక్కాణించుచుంటిని. అనిబల్కి మిన్నకుండెను.

విక్రమార్కుఁడు భేతాళుని దోడ్కొనిపోయి, శాంతిశీలున కప్పగించెను. ఆతఁడును విక్రమార్కుని నుచితాలాపంబులదేర్చి, స్నానమాడి దేవీప్రసాదమునఁగొన నంసిద్ధుడవై యుండుమని నియోగించెను. విక్రమార్కుఁడాతని చెప్పినట్లొనరించెను. తదనంతరము విక్రమార్కుని దేవికి సాష్టాంగనమస్కార మాచరింప నియోగించెను. విక్రమార్కుఁడును తనకు సాష్టాంగనమస్కారము చేయుట దెలియదనియు—చేసిచూపవలయుననియు వేడుకొనెను. సంయమీంద్రుఁడును మదినిసుమంతయును సంశయింపక యట్లొనరించెను. అంత విక్రమార్కుఁడు దన చంద్రాయుధంబున నాతని కంఠము త్తరించి కాళికాదేవిని తృప్తిపరచెను. దేవియు సంతృప్తచిత్తయై ప్రత్యక్షమై భూపాలునాశీర్వదించి భేతా

ఖుని యాతనికప్పగించి యంతర్ధానమయ్యెను.

భేతాళుఁడు విక్రమార్కునితో దేవా! తమరు నన్నిప్పుడువదలంచిన యప్పుడ యరుదెంచి భవదభీష్టము నెరవేర్చుచుండెద. ఇంకనాకనుజ్ఞ నయ సేయుఁడనెను. విక్రమార్కుఁడాతనికి సెలవొసంగి పూర్వదిక్భాగమున నరుణోదయమగుట గాంచి పురంబుప్రవేశించి యంతఃపురమును జేరనరిగెను.

ప్రథమభాగము సమాప్తము.

విక్రమార్కుని కథలని ప్రజలుచెప్పుకొను కథలన్నియు సంపుటీకరింపవలయునని యభిలాష జనించుటచే మరికొన్ని కథలను ద్వితీయభాగమున వ్రాయుచున్నాడను.



ద్వితీయ భాగము

# కళావతికథ.

అఖండ శేముషీవిశేషుండగు విక్రమార్కుఁడు సకలప్రధానదండనాధ సామంతమండలేశ్వర సమూహంబును, వేదవేదాంగవిదులగు గురువిప్రజనానీకంబును, బంధుమిత్రసందోహంబును, గవిగాయక పాత్రవైతాళిక ప్రకరంబును దన్ను పరివేష్టింప నిండుగొలువున గూరుచున్న సమయంబున నొకయతిపుంగవుఁడు — దనదేజంబున దిక్కులెల్ల నూతనకళలవిరాజిల్లునట్లొనరించుచు సభారంగమున కరుదెంచెను. విక్రమాదిత్యభూపాలుడా మునిచంద్రునిగాంచి సత్యాదరంబున నెదురుగాజని దోడ్కొని సముచితస్థానంబున నుపవిష్టునిగావించి విధివిధానంబున బూజించెను. ఆమునిపుంగవుండును సంతోషితాంతఃకరణుండై భూపాలుని వేదోక్తంబుగా నాశీర్వదించి తనతోగొనివచ్చిన యమూల్యములగు రత్నముల కానుకగా సమర్పించెను.

అంత భూపాలుఁడు దేవా! తమ నామముచే నేయక్షరములు పవిత్రమయ్యెను? తమనివాసమెచ్చట? ఎచ్చటికేగుచు ననుగరుణింప నిట్లరుదెంచిరి? తెలిపి యాశోన్నునాచీనులకు విందొనర్పవలయు" నని బల్కెను. ఆపల్కులాలించి యాయతిచంద్రుడు రాజచంద్రున కిట్లనియెను. "ఓయీ! ఇదినానివాసమని యెట్లుజెప్పగలను. స్థిరత్వములేకయెల్లపుడును దేశమున దిరుగుచుందును. నను సదానందుడని వాకొనుచుందురు. సమీపమునగల తీర్థములకుబోవుచు— అనన్యసామాన్యవిక్రముండవైన నిను దర్శించిపోవలయునని యిట్లరుదెంచితిని. లోకమున నినుబోలు భూపాలుఁడు మున్నెన్నడును లేడు. వర్తమానమున లేడని వేరెచెప్పవలయునా? యికముందుగూడ నీకలియుగంబున నీయట్టివాడు గలుగబోడు. దేవేంద్రాదులకుగూడ నీకుగలిగినయంతటి

వైభవంబు పాలుళక్కిగావున నినుదర్శింపవలయునని జనుదెంచినాడను." అనిబలికినవిని యధికతరసంతోషిత స్వాంతుఁడై భూపాలుఁడా యతి పుంగవునకును యాతని శిష్యులకును దగినరీతి మజ్జనభోజనాదులొనగూర్ప దగినవారల నియమించి యతిపుంగవునితో నిట్లనియెను. దేవా! మధ్యాహ్నికముల దీర్చుకొనినపిమ్మట గొంతతడవుతిరిగి సంభాషింతము. తమకాహ్నికముల దీర్చుకొనుటకు గాలాతీత మగుచున్నదికాదే" అని బలుకుటయు యతిచూడామణియు వల్లెయనిలేచి పురోహితునిగృహంబున కరిగెను.

మరల సభారంగమంతయు జనంబులతో గ్రిక్కిరిసియుండెను. ఎల్లరును యోగిపుంగవునకును భూపాలునకును జరుగనున్న సంభాషణ మాలింప కుతూహలంబున నట సమావేశమైరి. సభారంగమున నున్నవారందఱును భూపాలుఁడింకను నేడేల రాకుండెనని గొందఱును, జడదారిని దోడ్కొనివచ్చుట కరిగియుండెనేమో యని గొందఱును, జడదారి సభారంగమున కరుదెంచిన పిమ్మటగాని విక్రమార్కుఁడు సభకు రాడని గొందఱును, బలుకుచుండిరి.

ఇట్లొకింతకాలము గడచినపిమ్మట వేత్రహస్తులు జనుల నటునిటు దొలగజేయుచు మాటలాడవలదని వారించుచు భూపాలుఁ డరుదెంచుచున్నవార్త నెఱిగించుచుండిరి. అనంతరము సముచితపరివారము దన్ననుసరింప భూపాలుఁడు పాదచారియై సదానందయోగి పుంగవునితో సభారంగమున కరుదెంచెను. అనంతరము భూపాలుఁడు తమ్ము సన్మానించుటకు లేచి నిలువంబడియున్న జనులగూర్చుండ నియమించి సదానందుని యుచితాసనాశీనుఁ గావించి తాను సింహాసన మధిష్ఠించెను. తదుపరి గొంతతడవు భూపాలుఁడు సదానందుని వేదాంతోపన్యాసము నాలించి సంతృప్తమానసుఁడై యిట్లనియెను. దేవా! తాము పెక్కులగు దేశములగాంచి యుంటిరి. ఆయాదేశములయొక్క

విశేషములన్నియు దమకు కరతలామలకము లనుట నిర్వివాదాంశము గదా! కావున దాము గనుగొనిన చోద్యము లెవ్వియైన యున్న యెడల దెలుపవలయును."

అంత సదానందుఁడు విశ్వవిశ్వంభరా ధీశ్వరుండైన విక్రమాదిత్య భూపాలున కిట్లనియెను. "పెక్కులగు దేశములజూచి యుంటిని ఒక్కొక దేశమున నొక్కొక చోద్యముగలదు. వానినన్నిటి వివరింపనేల? ఒకచో లాటదేశంబున గను పట్టునత్యంత చోద్యంబు వివరింతు నాలింపుము. అద్దానిని సాధింపనీవ సమర్థుండవు. నీ యట్టివారుగాక యన్యు లకయ్యది యందరాని ఫలంబు. సావధానుఁడవై యాలింపుము. లాట దేశంబున నొక యరణ్యసీమయం దొక గొప్ప వల్మీకముగలదు. అద్దానియం దొక కన్యకామణి వసించుచుండును. ఆ వల్మీకముపై నామె హ స్తమొక్కటి గాన్పించుచుండును. ఆ కాంతామణి వృత్తాంతమా ద్యంత మెఱిఁగించెద నాలింపుము. భుజగజగద్విభూషణంబు నా నొప్పు పుష్పపురంబును బరిపాలించు ధనంజయుండను భూపాలతిలకుండు దన గానకళావిశారదత్వమున పార్వతీదేవిని సంతుష్టినొందించి యామె యనుగ్రహంబున కళావతియను కన్యాలలామను గాంచెను. కళావతీ జననకాలమున గగనవాణియెల్ల రాశ్చర్యపడునట్లుగా నిట్లనియెను. ఈ బాలసమీపవనంబున గల వల్మీకంబున నిలిచి దనకరంబును వల్మీక ముపై నిలిపినప్పు డేపురుషుండాకరంబును గీలించునో యాతని నంతఃపు రంబునకు గొనివచ్చి మజ్జన భోజనాదుల దనియించి సుఖాసీనుని గావించి తాను వేరొకయాసనము పైన నాసీనయై యాతఁడు తన్ను మువ్మారుపలికింప గలవానికి భార్యయగునుగాని యన్యులకు దక్కదు" యని గగనవాణి వచించియుండెను. భూపాలా! లాటదేశమున వల్మీక ముపై గానుపించునది యీ కళావతిహ స్తమే సుమీ! యని బల్కి మరియు నిట్లనియెను. ఆలతాంగి సౌందర్యమట్టిట్టిదని వర్ణింప

దరంబుగాదు. వేనోళ్ల చిలుకఁదగిన నామెసుగుణంబుల లెక్కింప ననమర్థుడు. చతురాననుడు తననేర్పు జూపింప రచించిన లోకైకమోహన విగ్రహమో యని దోచుచుండు టతిశయోక్తి యెన్నడును గాజాలదు. ఆలతాతన్వి పలుకు లమృతంపుసోనలు, ఆయిందీవరాక్షి వాల్చూపులు చెరకువిల్కాని కరకుటమ్ముల కంటె నతితీక్ష్ణములు, వేయేల ఆలతాంగి మరునిసామ్రాజ్యపదమని జెప్పనొప్పు. మరియు నా లతాంగిని జేపట్టగలిగిన పురుషసింహుఁడు సార్వభౌమపదం బలంకరింపదగినవాడగునని శారదాదేవి యనుగ్రహించియుండెను. ఔదార్యవీర్యభుజశౌర్యసకలకళాచాతుర్యధుర్యుండవైన నీకాబిబ్బోకవతి సాంగత్యలాభం బొనగూడిన సువర్ణంబునకు తావిలభించినట్లంగరయో శోభితంబగుచుండును. అని పలికి మిన్నకుండిన విశ్వంభరాధీశ్వరుండు యతీశ్వరునకిట్లనియెను. "దేవా! తమరు వర్ణించిన యక్కాంతకరంబు జూడనెట్లగును. ఆమెకరంబుగేలఁ గీలించుట కెయ్యది సాధనంబు, పుష్పపురంబున కెవ్విధిబోవుదును, యెన్నియొనగూడినను యామెచే నెట్లు మూడుమారులు మాటలాడింపనగును. పరికించి చూడనియ్యది దుస్సాధ్యమని దోచుచున్నది."

అంత సదానందుఁడు "ఓయీ! ఆమె నెట్లు మాటలాడింపగలనని విచారింపకుము. దారుశిలాలోహాదులకైన జీవనంబిచ్చి మాటలాడింపగల నేర్పు నీకుగలుగు నట్లానర్చెదను. అనంతరము నీ చాతుర్యము దీపింప నా విద్యవలన గార్యముసాధింపుము." అనిబల్కి యాతనికా విద్య ప్రయోగోపసంహారంబులతోడ గూడ నుపదేశించెను. తదుపరి యాపరివ్రాజకుఁడు భూపాలుని యనుజ్ఞ నిచ్ఛఁ జనియెను.

విక్రమార్కుండును కళావతీకరకమల సందర్శన కుతూహలాయత్త చిత్తుండై నిజప్రధానాగ్రగణ్యుండును నాప్తుండును నైన భట్టి మొదలగువారల నెవ్వరికి నెఱిఁగింపక నిశితాయుధమాత్ర సహాయుఁడై శీఘ్ర

రాత్రంబున యోగపాదుకల ధరించి మనోవేగంబున ననేకశైలంబుల మహారణ్యంబుల గడచి చని లాటదేశంబు జేరంజని యరణ్యమధ్యమున మనోహరమైన యొక్క వల్మీకమును గాంచెను. ఆ వల్మీకముపై నొక్క లతాన్వితకరంబు కరకంకణసమన్వితమై యలరారుచుండుట విలోకించి యవిచూడామణి దేవ్యాకరం బయ్యుదిగానోపునని దలంచి, యా పలుకుల యథార్థము గని యుత్సాహంబున మనోహరనవరత్న మణిగణఖచితకంకణాలంకృతంబు నా హస్తంబును బట్టుకొనెను. తోడనే యా నీలవేణి కళాపారీణగావున త్వరలో దనకుం బాణిగ్రహణంబు గలుగుటకిదియె కారణం బని యెఱిగియున్న కతంబున నా భూపాలుని కరంబు కరంబనురాగంబున బట్టుకొని పుష్పపురమునకు దోడ్కొని పోయెను. అప్పురంబున వజ్రవైడూర్యగోమేధిక పుష్పరాగ మరకతమాణిక్య పద్మరాగాది నానానేకరత్నఖచితంబై భగద్ధగాయమానమై సువర్ణసంకలితమై యొప్పారు నొక్క కనకమయ సువర్ణసౌధంబున నాతని విడియించి షడ్రసోపేతంబులగు భక్ష్యభోజ్యంబులు నాతని పరితృప్తి నొందించి కర్పూరవాసనాళమిళితంబు తాంబూలము నొసంగి యొక్క గవాక్షంబు రత్నపర్యంకంబున నాసీనుం జేసెను. తదుపరి యా కళావతి భూపాలుని కట్టెదుట నొక్క కనకమయ పర్యంకంబున గూరుచుండి పరిచారికా జనంబుల కనుసన్నల నావలకు బొమ్మని నియోగించి యొక కట్టుదుకూలమును మునుంగువెట్టుకొని మౌనముద్రాంకితయై యుండెను. అంత భూపాలుండా రమణీలలామ సోయగంబునకు మెచ్చి దనమనంబున మోహముప్పతిల్ల గొంతతడవట్టె యా లతాంగిని గనుగొనుచు నుండి యనంతరమిట్లు దలపోసెను. ఈ లతాంగి నెట్లు మాటలాడించి కౌగలింతును. మరువేదనాభరంబున కన్నులు మూతవడుట లేదు. ఎవ్వరితోనైన మాటలాడుదునా యన నెవ్వరును లేరు. యింకేమి సేయుదును." అని తలపోసి యుట్టకేలకు "ఓరా! ఇంతటివనికై

యేమి సేయుదు నని చింతించుచున్నాడను. ఈ రత్నస్థగితదీపికాకంబ మునకు జీవనం బొసంగి నద్దానిచే నొక కథ జెప్పించి విని యానందించ దగాక౯. యని నిశ్చయించుకొని దివ్యోగంబమునకు ప్రాణదాన మొసంగి కంబమా! కాలమునిలచి నట్లు దోచుచున్నది. ప్రొద్దుపోక కొక కథ జెప్పుము" అని యడిగెను. అంత నా దీపకళికాకంబ మిట్లీ క్రిందికథ జెప్పసాగెను.



# కామమంజరి కథ



విక్రమార్క భూపాలచంద్రమా! సావధానముగ నాకర్ణింపుము. తొల్లి యుత్తరకురుభూములందు నాగపురం బను నొక పురీవరంబు గలదు. ఆ పురీవరం బలకాపురంబు నైనను సౌందర్యంబున నతిక్రమించు ననుట యతిశయోక్తి గాదు. సంతతలక్ష్మీనివాసభూమియై జెన్నారు నా పురీవరంబును ధర్మధ్వజుం డను భూపాలుఁడు పరిపాలించు చుండును. ఆతఁడు ప్రజలను కన్న బిడ్డలవోలె పరికించుచు, ప్రజల కెట్టి యలజడియు గలుగనీక బరిపాలించుచుండుటచే నెల్ల రాతని ననేక భంగుల గొనియాడుచుందురు. నిత్యసత్యవ్రతాచారపరుండును, సౌజన్యుండును సకలసద్గుణగరిష్ఠుండును యగు భూపాలుఁ డేల జనులచే గొనియాడబడకుండును. ఆ ధర్మధ్వజునకు సుగుణమధుపమంజరి యనం దగు గామమంజరి యను కుమారీమణి గలదు. కామమంజరి సకల సద్గుణోపేతయై నెనలేని సౌందర్యరాశియై తల్లిదండ్రులకు గారాబు పట్టియై దినదినప్రవర్ధమానయై సంప్రాప్తయౌవనయై యుండెను. ఆమెను దిలకించి ధర్మధ్వజుఁడు నా కుమారీమణికి రూపాభిజాత్యంబుల నీడు రాగలుగు సుందరుడు లభించిన నే నెంతయు చరితార్థుఁడ నగుదును గదా యని పెక్కుభంగుల జింతించి సింహాళేశ్వరుని కుమారుఁ డగు హేమాంగదు డను రూపజితమకరధ్వజుఁడు తన కుమారీమణికిఁ దగిన వాడని చారులముఖంబున నాలించి తగిన వారలం బుచ్చి రప్పించి యాతనికి దన కుమార్తె నొసంగి శుభముహూర్తమున వివాహము గావించెను.

తదుపరి హేమాంగద కామమంజరు లిరువురును నాగపురంబుననే నొక రత్నఖచితసౌధంబున నివసించుచుండిరి. హేమాంగదుఁడు పెక్కు దినములవరకును, తన జన్మభూమియైన సింహాళంబునకు బోవు దలంపు

లేక యచ్చటనే సుఖంబున గామమంజరితో నుండెను. కొన్ని దినము లరిగిన పిమ్మట నొక్కనాఁ డాతఁడు తన శయనాగారమున గూరుచుండి ప్రకృతి. దిలకించుచు యానందించుచుండెను. ఒక భూరుహంబుపై గూరుచున్న గోరువంకపిల్లల కాప్యాయముగా తల్లి యాహార మందించుచుండుట దిలకించినంతనే హేమాంగదునకు తన జనని యనురాగమున తన్ను బెంచుట జ్ఞప్తికి వచ్చెను. తోడనే యాతనికి జన్మభూమిని సందర్శింపవలయునను కుతూహలము జనించెను. తన యభిమతంబును భార్యకు దెల్పిన నామె తన జననీజనకుల విడచుట కంగీకరింప దేమో యను సందియంబున నాత్మగతముననే యందుల కనువైన యుపాయ మాలోచించుచుండెను.

తన విభుని మోమున నించుక విచారసూచకమగు మార్పు గల్గిన తోడనే గామమంజరి తన విభుని జేరి నాథా! తమరు చింతాక్రాంతులై యున్నట్లు దోచుచున్నది. నావలన నెద్దియేని లోప మున్నచో మన్నింపుఁడు. మజ్జనకుఁడు తమ కెద్దియైన నవమాన మొనర్చియుండిన నాతనిని మన్నింపుఁడు. ఇకముం దట్టివి జరుగకుండ జూచుకొనవచ్చును. తమ సౌఖ్యముల కేమైన లోటుపాటు లున్నయెడల నాతో వచించిన సరిజూచుకొందును. వేయేల తమ పాదదాసినైన నావలన తమరు వలసిన యెట్టి పరిచర్యనైనను గైకొననగును. గాని యిట్లు చింతించుట దగునా? తమ చింతాకారణ మేమో దెలుప వేడెదను." అని వినయ విధేయతలతో బలుకు ప్రియాంగననుజూచి హేమాంగదు డిట్లనియెను. ప్రియా! నీవలన గాని నీ జనకునివలన గాని యెట్టిలోపమును జరిగి యుండలేదు. నామనంబున నితరచింత లేవియును లేవుగాని దన సహపంక్తికి రాక నెన్నడును భుజింప నిచ్ఛగింపని మజ్జనకుని దలంచినను, పసితనమాదిగ నెంతో యాదరంబున బెంచి పెద్దగా జేసిన నా జననిని దలంచినను, నామనంబున నెంతయో విచారము జనించుచున్నది.

వార్తలు నావియోగమున నెంతగా గుందుచున్నారో యను విచారము నన్ననవరతము బీడించుచున్నది. ఇచ్చట నెన్ని సౌఖ్యము లున్నను జననీజనకులను, జన్మభూమిని సందర్శింపవలయునను యభిలాష జనించినది. ఆ తలంపు జనించినదాదిగా నామనంబున నొకవిధమైన విచారముద్భవించినదిగాని వేరొండుకారణమున నెంతమాత్రమునుగాదు. "అని పలికిన విభుని పలుకు లాలించి కామమంజరి విభుని కిట్లనియెను. నాథా! ఇందులకై చింతింప నేల. మనమిరువురమును నేటరేపట బయలుదేరి మీగ్రామమున కేగుదము. కాని నాజనకునకుమాత్ర మీసంగతి దెలియనీయకుడు. ఏలనన యేకపుత్రికనగు నన్ను విడచుటాతనికి మిగుల కష్టముగా నుండును గాన మన పోకడ కనుమతింపడనియే నాయభిప్రాయము. మీకు మీగ్రామమరిగివచ్చుట కనుజ్ఞయొసంగిన నొసంగుననియే భావింపుడు. మీరేగినపిమ్మట మీయర్ధశరీరమనగు నేను మీకొరకు చింతించుచు నిచ్చట క్షణకాలమైనను నిలువజాలను. గావున రహస్యమార్గమున నీయంతఃపురంబునుండి దప్పించుకొని బయటబడి తరువాత మీగ్రామమున కేగుటకై యత్నింతము. మనకు ప్రయాణమున నుపకరించు వస్తుసంగ్రహణభారము నాపై నుంచుడు. మనకు రెండుగుర్రములనుగూడ తయారుగా నుండునట్లొనరించెదను. ఈదినముననే నూరు మాటుమణగినపిమ్మట బయలుదేరుదము." తదనంతర మాకామమంజరి యుచితలగుభూషణములను సంగ్రహించుకొనియెను. ఒకటిరెండుదినములవరకును సరిపడు రుచ్యములగు భక్ష్యములను జాగరూకతతో పదిలపరచెను. హయపాలకునితో మాటలాడి రెండు వడిగల గుర్రములకు జీనువైచి సిద్ధముగా నుంచుట కేర్పాటు చేసెను. అమూల్యములగు గొన్ని రత్నములను కొంతధనమును సంగ్రహించుకొనెను. ఇట్లు సర్వమును సిద్ధపరచుకొని విభునకు దాను దన ప్రయత్నమున నించుకంతయు లేకుండ నవరించిన

సంగతి నెఱిగించి యర్ధరాత్రమున విభునితోఁ గూడ రహస్యద్వార మున బయటికి కరుదెంచి తమకొఱకు సిద్ధముగా నుంపబడిన గుఱ్ఱముల నెక్కి పయనము సాగించిరి. కామమంజరి గావించిన యేర్పాటువలన నారాత్రి యంతఃపురమున నెట్టి యలజడియు కలుగలేదు. మరునా డుదయమున వాడుకప్రకార మేలలేచియుండలేదని చెలులొకరితో నొకరు చెప్పుకొనసాగిరి. కొందరు సాహసించి వారి శయనాగారమున కరిగి నయ్యది వెలుపల బంధింపబడుటచే వారందు లేరని ధృవపరచు కొనిరి. మరికొందరు దంపతు లిరువురును యుషఃకాలముననే లేచి యుపవనమున కరిగియుందురని పల్కిరి. ఇట్లుననే జాము ప్రొద్దెక్కి నది. కాని యెవ్వరికిని వారు వెడలిపోయిన జాడ గాన్పింపలేదు.

క్రమక్రమముగా కామమంజరియు హేమాంగదుడును గాన్పిం చుట లేదని భూపాలునకు దెలియవచ్చెను. తోడనే పలువురు భటుల నాతడు వారిని వెతుకబంపెను. ఒక్కొకరొక్కరుగ సాయంసమయము వరకును దిరిగి యెందును వారిజాడ గానక పురంబున కరుదెంచిరి. ఒక్క భటుడు గుఱ్ఱపుడెక్కల నానవాలుగాగొని కొంతదూరమరిగి జూచి యవి యొక యరణ్యమార్గమును బట్టుట గమనించి భూపాలుని సముఖమున కరుదెంచి దాగనిక దానినంతయు నెఱిగించెను. హయ శాలలో రెండుగుఱ్ఱములు గాన్పింపకుండిన సంగతి నీవరకే భూపా లుడు వినియుండుటచే దన కుమార్తెయు నల్లుడును గుఱ్ఱములనెక్కి వెడలియుందురని నిర్ధారణ మొనరించుకొనెను. భటుడు గుఱ్ఱపు డెక్కల గుర్తులు అరణ్యము లోనికి బోవుట సూచించుటచే వారా మార్గమునబోయి యుందురని యూహించుకొనియెను. తదుపరి కొందరు సైనికులను ఒక సేనానాయకును యా గుర్తుల ననుసరించి యరణ్యమున బ్రవేశించి దన కుమార్తెను కనుగొని యామెను యల్లుని పురంబునకు దోడ్కొనిరా నియమించెను.

కామమంజరియు హేమాంగదు లిరువురును నారేయెల్లనించు కంతయేని విశ్రాంతి దీసికొనకుండ పయనము సాగించిరి. మరునాడుద యమున నొక కాసారముచెంత హయములనుడిగ్గి కాలోచితకృత్య ముల దీర్చుకొని తమతో గొనివచ్చిన భక్ష్యముల భజించి యించుక విశ్రమించిరి. కామమంజరి విభునితో "నాథా! ఇచట తడవునిలు చుట క్షేమముగాదు. ఈవేళ కంతఃపురమున మనము లేకున్న సంగతి యెల్లరకును దెలిసియేయుండును. తోడనే మజ్జనకుఁడు మనల నన్వే షించుటకై కొందర నియోగింపకమానడు. మనలను వారు కలసి కొనలేనంతటి సురక్షితస్థానమును జేరువరకును విశ్రమించిన క్షేమము గాదుగదా" యని బలుకుటయు, నాతఁడును వల్లెయని మరల పయ నమునకు సిద్ధపడియెను. ఇరువురును దమ హయములను రెట్టించిన వేగముతో నడిపించుచుండిరి.

భూపాలునిచే పంపబడిన సైన్యము గుర్రపుడెక్కల గుర్తులను పరి శీలించుకొనచు వెన్నాడుచుండెను. సైనికులును త్వరితగమనంబున నే యరుదెంచుచుండిరి. భగవద్విలాసమెట్లుండునో? ఒకరు ఆపదలేకుండ సురక్షితముగా సింహళమునకేగ యత్నించుచున్నారు. వేరొకరు వారిని మార్గమధ్యమున బట్టుకొన సంకల్పించియున్నారు. తుద కేమగునో?

మరియొకదినమువరకును యాదంపతులు పయనముసాగించిరి. పాపము కామమంజరియధికముగానలసిపోయెను. ఇంతయేలవారిగుర్రము లడుగుదీసి యడుగైనను నడువజాలనివయ్యెను. అందుచే వారొక సరోవరతీరమున గుర్రములనుండి దిగి నాటికందు విశ్రమింప నిశ్చయించు కొనిరి. తాము పట్టణమును విడచి పెక్కు యోజనము లరుదెంచి నందున దమ్మన్వేషించువారు దమ్ము సులభముగా గలసికొనలేరను ధైర్యముతో నట విశ్రమించిరి. రెండురాత్రులనుండి నిద్దుర లేక

పోవుటవలనను ప్రయాణమున మిక్కుటముగా బడలియుండుటచేతను దంపతు లిరువురును త్వరలో నిద్రాదేవియొడి హాయిగాబరుండిరి.

'. సైనికులును ఈదంపతుల నెట్లైనను బట్టుకొని భూపాలుని సముఖమునకు దీసికొనిపోయి బహుమానము లందవలయునను యభిలాషతో శీఘ్రగమనమున నరుదెంచుచుండిరి. సైనికులు గుర్రములను యంచెలమీద మార్చుచుండుటచే వారికంటె త్వరితగమనముననే వచ్చుచుండిరనుట నిర్వివాదాంశము. ఎట్టకేలకు సైనికులు కామమంజరీహేమాంగదులు విడసియున్న సరోవరముచెంత కరుదెంచిరి.

గుర్రపుడెక్కల సవ్వడి నిద్దురలో నాలించి కామమంజరి మేలుకాంచెను. తోడనే నలుమూలల దిలకించెను. ఎట్టెదుట గాన్పించు సైనికుల గనియెను. నిముషమైన తడవుసేయక దన ప్రియుని ప్రక్కనే యున్న ఖడ్గమును గైకొని తురగారూఢయై ముందునకు బోయి వచ్చుచున్న సైనికుల నెదుర్కొనియెను. సైనికుల కామెను బట్టుటకే యధికార మున్నదిగాని వధించుట కనుజ్ఞ లేకుండుటచే నామె నేమియు చేయజాలకపోయిరి. పెక్కురు ఆమె కత్తి కెరగావలసి వచ్చునేమో యను భీతితో వెనుకకు పరుగులిడిరి. మరికొందరు ధైర్యమున నిలచి యామెను పట్టుకొనజాలక యామెచే హతులగుచుండిరి. సేనానాయకుc డామెతో రాకుమారీమణి యనవసరముగా సైనికులను కత్తి కెరజేయకుము. మాకు నీతో బోరాడుట కాజ్ఞ లేదు. నిన్ను పట్టుకొని రావలసినదనియే మా ప్రభుc డాజ్ఞాపించి యున్నాడు. కావున మే మిట్లరుదెంచితిమి. గావున మారుబలుకక మాతో నరుదెంచుము. అని సవినయముగా బల్కెను. అంత కామమంజరి సేనానితో నోయీ! నేను వెనుకకు దిరిగి రాను. నన్ను దీసికొనిపోవ సంకల్పించుకొనినచో చచ్చిన నాశరీరమునే దీసికొని పోగలరుగాని బ్రతికియుండగా దీసికొని పోజాలరు. నన్ను బట్టుకొనుటకై మీరు యుద్ధముసేయక తప్పదు

గదా? యుద్ధమున మీరో నేనో దెగుట నిశ్చయముగాని యిరువురమును జీవింపముగదా? నను జంపి భూపాలుని సముఖమునకు బోయి నీవేమి చెప్పగలవు. వృథాగా నిప్పుడు నాచే దెగుటకై యేల సిద్ధపడియెదవు. పొమ్ము పురమునకు బొమ్ము నాజనకునితో తిరుగ త్వరలో నరుదెంతునని దెలుపుము. తనతో దెలిపిన నాపోకడ కనుమతింపడేమో యని యిటు లాచరించితినని బల్కుము. నాతప్పుల మన్నించుమని వేడుకొంటినని బల్కుము. అని బల్కెను. ఆపల్కులాలించి సేనాని వెనుకకు మరలెను. కామమంజరియు యప్పుడే నిద్దుర నుండి లేచి తనకై నిరీక్షించుచున్న జీవితేశ్వరుని జేరఁబోయెను.

హేమాంగదుఁడు ప్రప్రథమమున గామమంజరికిని భటులకును జరిగిన సంకులసమరమున నుద్భవించిన ధ్వనులచే మేల్కాంచి సహాయమునకై ప్రియురాలిని సమీపింపనెంచెను. కాని యంతలోననే యుద్ధమాగిపోవుటవలన నాప్రయత్నము నుండి విముఖుఁడయ్యెను. అంత గామమంజరి జనుదెంచి నడచిన వృత్తాంతమంతయు దెలిపెను. హేమాంగదుఁ డెంతయో సంతసించి ప్రియురాలిని యామె ధైర్యసాహసముల గొనియాడెను. తదుపరి యాదంపతులు గుఱ్ఱములపై ప్రయాణము సాగించినచో మరికొందరు తమ్మనుసరింతురేమో యను భయంబున పాదచారులై పయనము సాగింప మొదలిడిరి.

అట్లు నిరంతర ప్రయాణములచే నలసి సొలసి తుట్టతుదకు వారొక పట్టణమును ప్రవేశించి అందు హేమాంగదు డొక టంకమును జేతగొని పట్టణమునుండి యన్నమును గొనివచ్చెద నంతవరకీ కాళికాలయమున గూరుచుండుమని భార్యకు బోధించి తాను పురంబును ప్రవేశించెను. ఆతఁడు పురంబు ప్రవేశించిన దెట్టి విషమఘడియయో గాని యాతని కెక్కడను గూడు లభింపదయ్యెను. ఎట్టకేల కాతడు పణ్యవీథిఁ బోవుచుండగా నొక వేశ్య యాతని సౌందర్యము

గాంచి మోహించి యాతని నెట్లైనను గూడవలయునని యుబలాట పడి తల్లిని బ్రార్థించి యాతనిని గొని రమ్మని బంపెను. అంత నాజర రయు—ఆతనికడ కేగి సవినయముగా నాతని లోనికిఁ గొనిపోయి షడ్రసోపేతముగా నాతనికి భోజనమిడెను. తదుపరి యావేశ్యయు నాతని సరస సల్లాపంబుల నాతని పెద్దయుం బ్రొద్దునిలిపెను. హేమాంగదుడును; కాలకర్మవశంబున; తాను గామమంజరిని దోడ్కొని వచ్చుచుంటి నను మాటయు తా నన్నముగొనిపోవుటకై పురంబులోని కరుదెంచినాడ ననుమాటయు మరచి యావేశ్యతో సల్లాపములాడుచు వెనుకటి సంగతుల మరచి యుండెను.

అట కామమంజరియు దనవిభుఁడన్నముగొని త్వరలో నరుదెంచు నను యాశతో గొంతవరకు నిరీక్షించెను. ఎంత తడవైనను యాతఁడు రాకుండుటచే నతని కేదో యాపదగల్గి యుండునని నిశ్చయించుకొని చేయునది లేక విచారించుచుండెను. ఆసమయమున నా కాళికాదేవి నర్చించు యొక వృద్ధురాలు పూవులు యక్షితలు మున్నగు పూజా ద్రవ్యములను నైవేద్యమునకై గొన్ని భక్ష్యములను యొక పళ్లెరమం దిడుకొని యాలయమును బ్రవేశించెను. ఆమెయు దేవి నర్చించి వెడలి పోవు సమయమున గర్భాలయమున కిసుమంత దూరమున గూరు చుండి విచారించుచున్న గామమంజరిని దిలకించి కరుణార్ద్రహృదయయై యామెచెంత కరిగి కుమారీ! విచారింపకుము. నాకు బిడ్డలు లేరు నిన్ను నాకుమార్తెగా భావించుకొందును. నాయింటి కరుదెమ్ము అని బల్కుచు సమీపించి బాగుగా పరికించి కుమారీ! పరికింపగా నాకలిగొని యున్నట్లు దోచుచున్నది. ముం దీభక్ష్యముల నారగింపుము. పిదప యీ సమీపముననే యున్న మాగృహమున కరిగి యన్నమును భుజింపవచ్చును. అని భక్ష్యముల నామె కొసంగెను. కామమంజరి యధికముగా నాకలి బాధచే పీడింపబడుచుండుటచేతను,

ఆవృద్ధాంగన యాదరపూర్వకముగా భక్ష్యముల నొసంగుటవలనను తన యాకలి దీరుటకు వేరొక్క యాధారమును లేకుండుటచేతను యాభక్ష్యముల భుజించి సమీపకాసారోదకమును ద్రావి తృప్తినొంది యా యవ్వకు దన పూర్వచరిత్ర మంతయును దెల్పి తల్లీ! నన్ను కుమారీ యని పిలచితివి. అవశ్యము నీకు గుమార్తె నయ్యెదను. ఈపురమందు నావిభుఁ డెక్కడనుండెనో గనుగొని యాతని నను గలుపుము. ఇంతియె నావాంఛితము. నీ యిచ్చవచ్చినట్లు మెలంగుచు నీయింట నే నుండుట కంగీకరించిన యట్లే యుందును. అని దీనముగా బలికెను. అంత నాయవ్వయు కుమారీ! ఈపట్టణమున నీవిభు డెచ్చట నున్నను వెతకి కనుగొనగలను. మరల నిన్నాతనితో తప్పక గలిపెదను. ఇంతకంటె నుభయతారకమైన పుణ్యకార్యముండునా? నీవిభుఁడు గాన్పించునంతవరకు నీవు మాయింటనే యుండవలయును. నీ కిచ్చట నెట్టి లోపమును గలుగబోదు. నీవు నీ జనకుని గృహమున నెట్లు తిరిగితివో యెంత సౌఖ్యముగ నుంటివో యిచట గూడ నట్లే యుండవచ్చును. పరమాత్ముని యనుగ్రహమువలన ధనము వలసినంత గలదు కాని యేమిలాభము అనుభవించుట కొక్క యాడుబిడ్డ యైనను లేదు. గావున యన్యథా భావింపకుము. అని బల్కుచు యామెను సమీపమున నున్న దన గృహమునకు దోడ్కొని చనియెను.

కామమంజరికి వలయు సౌకర్యములన్నిటిని గూర్చి యా పూజారి వృద్ధాంగన పెక్కువిధముల నామెకు పతివియోగదుఃఖము దోపనీకుండుటకై ప్రయత్నించు చుండెను. పెక్కులగు నీతికథల నామెకు జెప్పుచు, మంచిమంచి పుష్పాదుల నేరితెచ్చి మాలికలుగా నొనర్చి యామె కిచ్చుచు గృహకృత్యములందున నామె యుత్సాహముతో పాల్గొనుచుండ బిడ్డా, నా కంఠమున జీవుదుండగ నీవు కష్టపడవలసిన యగత్యము లేదు. అటుపైన నెట్లుజరుగునో యిప్పుడాలోచనీయము

గాదు. ఊరక నీ శరీరము శ్రమనొందజేయకుమని యాదరణపూర్వక ముగా బలుకుచు యామె దనపూర్వచారిత్రము నంతను దలచుకొని విచారించుచుండు నప్పుడు, ఆ వృద్ధాంగన తొల్లినలమహారాజంతటి వాఁడు భార్యను విడచిపెట్టి పోయెననియును తిరుగ నాతఁడు దనకు శుభదినము లరుదెంచినపుడాలుబిడ్డల కలసికొనెనని బల్కి యట్టులే నీవును పూర్వజన్మకృతపాపఫలం బనుభవించిన పిమ్మట దైవమనుకూలు డై యుండు నెడల మరలవిభుని యాదరణకు పాత్రురాలవయ్యెదవని యుదాహరణపూర్వకముగా జెప్పి యామెకు దుఃఖోపశమనముగావించుచుండెను. కాని, స్వగ్రామమున కరగి మరల శీఘ్రకాలమున జను దెంతునని ప్రియుడుబల్కిన నాతని వియోగ మొక్కదినమైనను సహింపలేనిదై గదా తల్లిదండ్రులవిడచి యాతనితో బయలుదేరెను; అట్టికామ మంజరి పతివియోగము గల్గిన యీ సమయమున యా వృద్ధురాలి మాటలకు దుఃఖోపశాంతి బడయఁగలదా. ఒక్కనాడు కామమంజరి యా వృద్ధాంగనను బిలిచి అమ్మా! పతివియోగము భరింపజాలకున్నాను. ఈతనితో నరిగిన సంతతానందవార్ధి నోలలాడుదునుగదా యని బయలుదేరి యట తల్లిదండ్రులకు గోపము గల్గించునదాననైతిని. మరల వారికి నా మోము జూపుట కిచ్చగింపను. పతిని రెండు మూడుదినములలో గలసికొనుటో లేక పతిపాదపద్మముల హృదయంబుననిల్పి యాతనినే ధ్యానించుచు హాయిగా జీవముల త్యజించుటో జరుగవలెనుగాని వేరొండు మార్గమెద్దియు నాకు గాన్పించుటలేదు. నీకు నిక్కముగా నాపై యనురాగమున్నయెడల నా పతిని గనుగొనుటకై యత్నింపుము. లేకున్న వో నా మృతికైన నంగీకరించి యొక చితి పేర్పింపుము. "అని దీనాననయై బల్కెను. అంత నా జరతయు నేనీ దినమున పట్టణమంతయు వెతకివచ్చెదను. అతఁడీ పట్టణముననేయున్న యెడల నెట్టులైనను గనుగొనగలను. గావున చింతదక్కి యుండుము."

అని యామె నోదార్చి పట్టణమునకై బయలుదేరెను.

గృహంబున నిలచియున్న కామమంజరియు నా వృద్ధురాలు పతి జాడ నరసివచ్చిన యెడల కాళికాదేవికి బలిహారముల నపరిమితలెబుగా నిత్తుననియును, దనమేనిపై నున్న భూషణములన్నియును నిలువుదోపుగా నర్పింతుననియును మ్రొక్కుకొనియెను. ఆ వృద్ధురాలిని విశేషముగా సన్మానించి యామెను దమతోగూడ సింహళమునకు దోడ్కొనిపోవలయు ననియు నిశ్చయించుకొనియెను * * * * కొంతకాలము గడచెను. కాని యా వృద్ధురాలింకను గృహంబున రాలేదు. కామమంజరి యామె తడయుటచే కార్యమును సాధించి గాని వెనుకకు దిరుగదను నిశ్చయంబున చింతదక్కియుండెను.

ఆ వృద్ధురాలును ప్రతివీధికినిబోయి యచట దనకగుపడిన వారిలో నొక్కనిజేరి యయ్యా! రెండుదినములకు క్రిందట నొక్కపూరుషుఁడు రాజలక్షణసమన్వితుఁడు యీ వీధి నరుదెంచి నట్లాలించి యుంటివా యని ప్రశ్నించుచు నాతఁడట్టి వాడెవ్వడును వచ్చి నట్లాలింపలేదని ప్రత్యుత్తరమీయ వేరొకవీధి కరుగుచు నిట్లే ప్రతివీధియు గలియదిరిగెను గాని గానంతయు లాభము లేకపోయెను. ఎట్టకేల కామె దన మనంబున నిట్లని దలపోయసాగెను. కట్టా, యా బాలిక ఎంతయో దుఃఖించుచున్నది. ఇట్టి పరమానురాగము గల భార్యను మరచి యాతఁడుండెను. కట్టా యాతడెంత కఠినహృదయుడో గదా? ఇంకేమి సేయుదును. నేడెట్లైనను నీ విభుని గనుగొని వచ్చెదనని నమ్మికబుట్ట వచించి యిట్లరుదెంచితిని. కాని యాతని పోకడనుగూర్చి యిసుమంతయు దెలియదయ్యెను. యీ వర్తమాన మామెకెరిగించినచో నామె శోకమునకు మేరయుండునా? ఆమె దుఃఖమునుజూచి సహింపగలనా యేమిసేయుదును. అని చింతించుచు గృహంబున కరుదెంచి కామమంజరికి దాపోయి వచ్చిన తెరంగంతయు వినిపించెను. ఆ పలుకు

లాలించి మొదలునరకిన మహావృక్షము చందమున నామె భూమిపై ప్రాలి మూర్ఛిల్లెను. తదుపరి గొంతవడికి మూర్ఛదేరి జరతాంగనతో కాళికాలయపురోపకంఠమున నొకచితిఁ బేర్పింప నియోగించి కాళికా దేవిని విధివిధానమున బూజించి ప్రాణవిభుని ధ్యానించుచు యా జర తాంగనకు దనమేని సొమ్ములెల్ల యొసంగి—యా యగ్నిగుండమున బడి మృతిజెందెను. కొన్ని నిముషములలో నీ వార్త పట్టణమున వ్యాపిం చెను. పెక్కురు జూడనరుదెంచిరి.

ఆ గుంపునఁజూచి హేమాంగదుడును తనప్రియురాలగు వేశ్యతో గూడ నక్కడి కరుదెంచెను. అంత నాతనికి కాళికాలయము సంద ర్శించిన తోడనే పూర్వస్మృతి గలుగుటయు—నక్కడనున్న వారివలన గామమంజరి యా యగ్నిలో బడి జీవముల విడచెననియు విని చింతా చరంబున గామమంజరిని దలంచి మూర్ఛిల్లి కొంతవడికి తెప్పరిల్లి వేశ్య వారించుచున్నను లక్ష్యముసేయక త్వరితగతి నా యగ్గిగుండమున బడెను. ఆ వేశ్యయు నాతనివిడచి నిలువజాలక యందుదుమికి మరణిం చెను. గామమంజరిని తొలుత నాదరించిన యా పూజారి విధవయు కట్టా! యీ పట్టణమున నామెపతియుండ నిచ్చటలేడని యామెకు జెప్పుటవలన గదా వీరుముప్పురును మరణించిరి. ఇట్టియకార్య మొన ర్చియు జీవింపనేల యని దలపోసి యాయనలజ్వాలలో నురికెను.

అంత కాళికాదేవి ప్రసన్నురాలై యా నలువురిని క్రమ్మర జీవిం చునట్లను గ్రహించెను.

విక్రమార్క భూపాలా! కథవింటివి గావున యా నలువురిలో నెవ్వ రిసాహస మధికము దెలుపుమని యా దివ్యోగంబము ప్రశ్నించెను. అంత విక్రమార్కుడు చిరునవ్వున వారనధూటి సాహసమధికమని ప్రత్యుత్తరమిచ్చెను. అంతదనముసుగునావలకు దీసివైచి, భూపాల శిరోమణీ! అప్రాణులకు జీవమిచ్చి మాటలాడింపగల పాండిత్యము

గల్గిన నీవిట్లు తప్పుగా సమాధాన మీయదగునా? భర్త కానరాక కామమంజరి గతించెను. భార్యకై హేమాంగదుఁడు మరణించెను. ఆతనిపై గల మోహమున వారాంగన మరణించెను. కాని యా వృద్ధురాలు అతిసాహసమున—వాంఛరహితముగా గుండమున దుమికినది గాదే యందువలన నామెసాహసమధికమని తలంపవలయును గదా? యని బలికి మరల దుప్పటి ముసుగిడుకొని పరుండెను.



# రాజశేఖరుని కథ



తిరుగ కళావతీ లలామను మాటలాడింపవలయుననుయుద్దేశ మున విక్రమార్కుడు మరల కర్పూర కరండమునకు జీవనమొసంగి యుద్దాని కిట్లనియెను. ఓకరండమా! ప్రొద్దుపోకడ కొక చక్కని కథ వినిపింపుము. మాటలాడుట కెవ్వరును లేకుండుటచే కాలము నిలచి యున్నటుల దోచుచున్నది. అని బల్కిన యాకరండము దేవరకు మది మెచ్చగల కథల వినిపింపదగిన నేర్పు నాయందుండునా అయి నను దేవర మెప్పు వడయుటకై ప్రయత్నించెదను. వినుండని యీక్రింది కథ యిట్లని జెప్పనారంభించెను.

తొల్లి వంచకపురంబును విక్రమకేసరి యను భూపాలుఁడు పరిపా లించుచుండెను. అతనికి పట్టపుదేవియైన యుమావతీదేవియందు రాజ శేఖరుఁడను కుమారుఁడు జన్మించెను. ఆతఁడు జగదేకసుందరుఁడై బల పరాక్రమ సంపన్నుడై, వివిధాయుధకళాకుశలుఁడై సంప్రాప్తయౌవ్వ నుఁడై వివిధశాస్త్రపారంగతుఁడై జనుల స్తుతికి పాత్రుఁడయ్యెను. రాజ శేఖరపూరుషసింహు డుచితపరివారమును వెంటగొని మృగయావినో దార్థ మరణ్యమున కరిగెను.

ఆవనమధ్యంబున వీరవిహారము సలుపుచు చనిచని యొక్కయెడ సర్వాలంకారసుందరంబగు శర్వాణి మందిరంబుఁ గనుంగొని యమ్మహా శక్తికి దండప్రణామం బాచరించి తత్ప్రదేశంబున నొక్క యోగినీ మణి శుకశారికలతో వేదాంతగోష్టి సలుపుచుండుట దిలకించి యామెను జేరంజని భక్తి తాత్పర్యంబు లుప్పిరిగొన నామె పదపంకజాతములకు నమస్కరించెను. అంత నాయోగినీతిలక మాతనికి విభూతి నొసంగి సమీపమున నున్న పులితోలుపై గూర్చుండమని నియోగించెను.

'రాజశేఖర భూపాలపుంగవుఁడు సుఖాసీనుఁడై యున్నయెడ నొక

కీరంబు భూపాలుని సమీపమున వ్రాలి సరసవచనల నాతని దేల్చుచు పెద్దయుం బ్రొద్దుగడపెను. అనంతర మాతఁడు తనకా కీరంబు లభించిన జాలునను భావంబు సూచించులాగున నాయోగనితో మాటలాడెను. ఆతని భావంబామూల చూడముగా నెఱిఁగి యాతని కిట్లనియెను. భూపాలకులావతంసా! ఈ కీరరాజము యరువదినాలుగు విద్యలెఱిఁగిన ప్రోఢ త్రికాలవేది. భూతభవిష్యద్వర్తమానముల దెలుపగల సదసద్వివేకశాలి. వలయునెడల దీనిని గైకొని పొమ్ము; భూపాలుర భోగంబున కుపయోగించు యమూల్యవస్తువులు మాబోటి యోగినీ జనములయొద్ద నుండుట దగదా? యని బలుకుచు యాకీరంబును యొక నవరత్నసంఘటిత పంజరమున నునిచి యాతనిచేతి కందించెను. భూపాలకుమారుండును సంతోషితస్వాంతుఁడై యోగినీమణి ననేక విధంబుల బొగడుచు గృహాభిముఖుఁడై చనుచు నొక్కయెడ సేనల విడియించి విశ్రాంతి గైకొన నిశ్చయించి గుడారముల బన్నుటకు నియోగించెను.

భూమీశుండు ఒక సుందరమైన గుడారమున నొక హంసతూలికా తల్పంబున బరుండి సమీపంబున నున్న కీరరాజమును గనుగొని కీరమా! త్రికాలవేదిగదా నీవు! నీయట్టి మిత్రము లభించుటచే నాజన్మము నిక్కముగా పవిత్రీభూతమయ్యెను. నీవు నా భావిఫలంబు లెట్లుండునో యించుక వచింపరాదె. యనంగుమిత్రుని సంతోషింపజేయుట నీ విధ్యుక్తధర్మము గదా? యని బల్కెను. అంతన నా రాజకీరము భూపాలకుమారా! అవఁతీపురాధీశ్వరుని కుమారీమణి యగు కర్పూరమంజరి భువనైకసుందరి. ఆ లతాంత నిన్ను మనసార ప్రేమించి నీకై పరితపించుచున్నది. అట్టి కాంతాశిరోమణి లభింపనుండుటచే నీవు ధనతముడ వయ్యెదవు. సువర్ణమునకు దావి లభించినట్లు రత్నమునకు కాంచనసాంగత్యము గల్గినట్లు మీ దాంపత్యము లోకమున పొగడ్త

కొన్నను. అని బలికి యింకను యేమో జెప్పబోవుచుండగా భూపా లుడు కీరమా! ఇది యెట్లు సంఘటించును. ఆమె నన్నొకపరియైనను జూచియుండలే నరిగదా దూరస్థ రాజ్యమున నున్న నాగుణములను గాని రూపమును గాంచి వినుటగూడ తటస్థింపని యామె నన్ను బ్రేమించునా? ఇయ్యది యసంభవముగాదా? చెప్పినవానికి వివేకము లేకున్న వినెడివానికైనను వివేక ముండవలదా! నీపలుకుల నెంతమాత్రమును విశ్వసింపజాలను. అని పలుకుచుండ నా కీరరాజము దేవా! నా పలుకులయం దిసుమంతయైన నసత్యము లేదు. ఇయ్యెడ కా రామామణి బంపిన చెలికత్తె లరుదెంతురు. వా రరుదెంచినంతనే దమ సందియము దొలంగగలదు. అని బల్కెను.

అంతట భూపాలుడును సమీపమున సంచరించి స్త్రీజన మంజీరధ్వను లాలకించి సమీపవర్తియగు నొక్కసేవకునితో నా వనితల సముచిత గౌరవంబున నియ్యెడ దోడ్కొనిరమ్మని నియోగించెను. పరిచారకు డేగి మరునిముషముననే గొందరు స్త్రీజనంబుల నాతనిపాలికిం గొని వచ్చెను. భూపాలుడు వారికి సముచితాసనములు కనుసన్నల జూపిన నా వనితలు సుఖాశీనులైరి. అంత రాజకీరము ఓలతాతన్వీ! నీవు మంచిసమయమున కరుదెంచితివి. నీ వచ్చిన కార్యమంతయు మీ భూపాలునకు విన్నవించి నా పలుకు యథార్థమెటుంగ గోరియున్న యాతనికి సంతస మొనగూర్చుము. చల్లకువచ్చి ముంత దాచు టేలనని బల్కెను.

అనిన కీరరాజంబు పల్కు లాలించి విస్మయానందకందళిత మానసయు, మందస్మిత సుందరవదనారవిందయునై యయ్యిందు వదన క్షమాపతి నందను నవలోకించి యా మూలచూడంబుగా మదీయవిజ్ఞాపనంబు దత్తావధానుడవై చిత్తగింపుమని యిట్లనియెను. "సకలసంపదల కాకరమై యలరారు నవంతీపురంబును సత్యధర్ముడను భూపాలుడు

పరిపాలించుచుండెను. ఆ విభునకు పట్టమహిషియగు లీలావతియందు కర్పూరమంజరి యను కన్యాలలామ యుద్భవించెను. శుక్లపక్ష క్షపాకరుని మాడ్కి దినదినాభివృద్ధినొంది యక్కన్యాలలామ తల్లిదండ్రుల, సఖులనయన చకోరంబులకు చంద్రరేఖయై యొప్పారుచుండెను. కడుం గడు గారాబమున పెంపబడిన యా కర్పూరమంజరి యిపుడు యౌవ్వనవతియై మూర్తీభవించిన శృంగారరసాధిదేవత చాడ్పున వెలుఁగుచుం డెను. ఆ రమణీశిరోమణి సఖులతోఁగూడ నొక్కనాడు శృంగారవనాంతవీధి రతికాంతు నర్చింపనేగి యయ్యెడ శుకపికతతులకు శృతిశాస్త్ర పురాణాసత్కథాసార ముపన్యసించుచున్న నొక్క శారికను ఁదిలకించెను. అంతకర్పూరమంజరి యా శారికను బట్టుకొనవలయునను కుతూహలంబున నద్దాసిని జేరంబోవ చిలుకలన్నియు నామెం గనుంగొని యెగసి పోయెను. కాని యా శారిక యెగిరిపోవుటకు సమర్థతకలదయ్యును యెగురక వంచెనచే నామెకు జిక్కవడిన యట్లు కర్పూరమంజరి చేతికి దొరకెను. ఆ గోమువంకను కర్పూరమంజరి పెక్కువిధముల లాలించి నీకు యే విధంబున నీ బహుకళాకుశలత్వముగల్గెను. యెచ్చటిదానవు. నా యుపవనంబున కెట్లు చెంచితివి. వచింపుమని బల్కెను. ఆ పల్కు లాలించి యా శారిక ఓ తన్వీమణీ! సరస్వతి దేవి తనకుమారికగా జూచుకొని యాదరించెదురా చిలుకచే పెంపబడి నానా కళాకుశలత్వమువడసి త్రికాలవేదిని యనంగా శృంగారవనాంతరంబుల సంచలించుచుందును. "ఇదియె నా వృత్తాంతమనుటయు. నా కర్పూరమంజరి శారికా! నీవు త్రికాలవేదివైనచో నా కనుకూలవరుం డెచ్చట లభించునో యాతని రూపాభిజాత్యంబు లెట్టివో వివరింపుము" అని బల్కెను. అని బలుకుటయు నా శారికా గాంతామణి! సమానరూపాభి జాత్యగుణంబుగల్గి సర్వవిద్యాపారగుఁడై యున్న వంచకపురీవర మేలు భూపాలుని కుమారుఁడు రాజశేఖరుఁడు నీకు విభుఁడగును." అని వక్కాణించియుండెను.

అంతటినుండియు కర్పూరమంజరి భవదీయరూపాభివర్ణన మీా శారికచే పలుమారు వినియు సంతృప్తినొందక నిను గనులకు సాఫల్యము గల్గునట్లుగా గనుంగొనవలయుననియు దనజన్మము సార్థకపడునట్లుగా నీతోడ గలియవలయుననియు దలంచుచు పంచబాణవంచితయై పరితపించుచుండెను. అట్టియెడ జెలులమైన మే మెల్లరమును కట్టా! యీామె యీా శారిక మాటలాలించి కదా యిట్టికంతుని బారికిజిక్కి పరితపించుచుండెను. యేమిసేయుదుమని పెద్దయుం బ్రొద్దు విచారించి యెటు సేయుటకును దోపక భూపాలునిసన్నిధికిం బోయి మా సఖ సంతాపమంతయు నెఱింగించితిమి. అంత నా భూపాలుండు చిరునగవున తమ్ము నగారసంబుగ దోడ్కొని రావలయునని నన్ను బనిచెను.' ఇంక నే జెప్పవలసినదే మున్నది. మా కర్పూరమంజరి ననుగ్రహించుటకై తమ రరుదెంచిన సకలసంపద లొనగూడినట్లు సంతసిల్లుదును.'' అని బలుకుటయు నా రాజశేఖరుండు దనసమీాపంబున రత్నఖచితపంజరంబున నున్న కీరంబు గనుంగొని కీరరాజమా నీ పలుకు లమృతవుసోనలు. మఱియు శిలాశాసనంబుల భంగి యథార్థములు. ఇట్టినిను సామాన్య కీరము గాదలంచిన నన్ను మన్నింపుమని పెక్కుభంగుల ననునయాలాపంబులాడి పరిణతపరిణయోత్సాహుండును సర్వసన్నాహుండును ననగ తానేక రాజశేఖరుండునునై యా రాజశేఖరుండా ప్రొద్దె కదలి కదళికా కదంబ నింబజంబీరజంబుతమాల హింతాల లవంగలుంగనారంగమాతులుంగ సురంగాది మహామహీరుహానితాంతాంతమైన యవంతిపురోపకంఠంబున విడిసెను. అంత నా యోపాలలామయు భూపాలుని దోడ్కొని నగరు ప్రవేశించెను.

అట్లు అంతఃపురంబును ప్రవేశించిన చతురిక నతనుతాపంబున పరివేదనం బడుచున్న కర్పూరమంజరికా రాజశేఖరుని యాగమనవృత్తాంతమంతయు నెఱింగించి యామెను సంతోషసాగరతరంగడోలికల నూయింగ

నూపి సత్యధర్మమహీకాంతునకు రాజశేఖరు నెదుర్కొని దోడి తేవలయునని విన్నవించెను. అమ్మహీకాంతుఁడును పురంబును యలంక రింప దగువారిని బనిచి నిఖిలబంధుజనసమూహంబు వెంబడి మంత్రి సామంతజనంబులు దన్ననుసరింప చతురంగసైన్యము దోడురా వేత్ర హస్తులు బారాబరులు సేయ రాజశేఖరుఁడు విడిసియున్న ప్రదేశంబు నకుఁ జని సముచిత సత్కారంబుల యథావిధి జరిపి తనతో నాతని దోడ్కొని వచ్చి యొక దివ్యసౌధంబున నాతని విడియించెను.

అనంతరము పురోహితానుమతంబున నొక్క దినమున శుభము హూర్తమున సత్యధర్మ మహీధవుండు కర్పూరమంజరిని విధివిధాన పూర్వకంబుగ రాజశేఖరునకు గన్యాదాన మొసంగెను. పరిణయ మహోత్సవము యథావిధిగా జరిగింపబడెను. రాజశేఖరుండు గొన్ని దినంబు లా పురీవరంబున నుండి యనంతరము సత్యధర్మ మహీపాలుని యనుమతి వడసి సహధర్మచారిణీయుక్తుండై వంచకపురంబున కరిగెను.

ఒక్కనాడు కర్పూరమంజరీ రాజశేఖరులు శారికాకీరంబుల నొక్కొక పంజరంబున నునిచి యొక భూతశాఖ దగిలించి సమీపతరు లతానికుంజమున గూరుచుండి సరస సల్లాపంబుల బ్రొద్దు పుచ్చుచుం డిరి. అంత కీరంబు శారిక కిట్లనియెను. శారికా! నాయజమానుఁడును నీ యజమానురాలును గలసికొని మకరకేతన క్రీడాచాతుర్యంబున బ్రొద్దుపుచ్చుచుండిరి. మనముగూడ నాపోల్కి సుఖంపదగును గాని యిటు లొక్కొక పంజరంబున నుండుట నాకు నింతయు బాగుగా గాన్పించుటలేదు. అని బలికిన విని శారిక యించుక కోపంబున బురు షుల నమ్మరాదు. పూరుషు లధికపాపకర్ములు వారలను నమ్మి వర్తిం చిన యాడుదాని గతి దుర్గతియని వేరె వచింపవలయునా? యని బల్కెను. అంత కీరము శారికా! యూరక పూరుషుల నిందింపకు. పూరుషులు నీవనిన యంతటి పాపకర్ములుగారు స్త్రీలన్నానో చెప్పరా

నంతటి పాపకృత్యములకైన వెనుదీయరు. వారికంటె నెక్కుడగు పాపాత్ములు పూరుషులలో నుండజాలరు. ఇట్లు యిరువురు వాక్కలహములాడుచుండ సమీపముననున్న రాజశేఖరకర్పూరమంజ లిరువురును యచ్చటికి జనుదెంచి మీరేల కలహమాడుచున్నారని ప్రశ్నించిరి. అంతశారిక దనకును శుకంబునకు జరిగిన వివాదమంతయు నెఱింగించెను. అంతరాజశేఖరుడు శారికా! మంచిది పూరుషులు దుర్మార్గులని నీ వెట్లు నిర్ణయించితివి జెప్పమనిన శారికదేవా! మనీయవచనంబుల కనుగుణంబుగా నొక్కకథ గలదాలింపుడని యీ క్రింది కథ యిట్లు జెప్పసాగెను.



# ధనగుప్తుని కథ



తొల్లి కాంచనపురంబున నుండు ధర్మగుప్తుఁడను వైశ్యశిఖామణికిం ధనగుప్తుండను కుమారుఁడుగలఁడు. ధనగుప్తుకు తండ్రిమరణానంతరము దుర్మదాంధుఁడై దన సొమ్మెల్ల వమ్మొనర్చుకొని తినుటకొక్క పూట కైనను దిండిలేకుండుటచే కాంచనపురంబున గొప్పగా బ్రతికినవాడగుటచే నచటి నిలువజాలక యేదోయొక కుగ్రామమ్మైన చేరుకొని పొట్ట పోసికొన నిశ్చయించుకొని బయలుదేరి నిరంతరప్రయాణంబు సల్పుచు మార్గమధ్యమున నెడనెడ లభించు కందమూలాదుల భుజించుచు యెట్టకేలకు కాంచీపురమును జేరుకొనియెను. అందు దనకు దూరబంధుగుడగు శ్రీగుప్తుడను వానియింటఁ బ్రవేశించి—దనతండ్రి మృతుఁడైన సంగతియు దాను ధనమంతయు పోగొట్టుకొనిన సంగతియు జెప్పక యాతని యేకపుత్రికయగు రాగతరంగిణిని పరిణయమాడెను. అనంతరము ధనగుప్తుడు కొన్నిదినముల వరకును భార్యతో సుఖముగా గడిపెను.

ఆ ధనగుప్తునకు మామగారియాస్తి సంతయు స్వైవశ మొనరించుకొని హాయిగా దన యిచ్చవచ్చినట్లు దిరుగదలంపు పుట్టెను. దుర్మార్గులకు దుర్మదాంధులకు మేలొనరించిన వారలకే యెగ్గుసేయు బుద్ధి గలుగుటసహజముగదా? ఆతఁడు పెక్కువిధముల ప్రయత్నించి చూచెను. కాని యత్తవారిధనము హస్తగతమగునట్లు గాన్పింపలేదు. భార్యయొడలిపై నున్న యాభరణము లమూల్యములై నవనియును, మించుమించుగా తనకా జన్మాంతమాధనము సరిపడుననియు దలంచి యుక్తిమై మామను వంచింపనిశ్చయించు కొనియెను. ఆతఁడు మామతో దనగ్రామమునకు భార్యతోగూడ పోవసంకల్పించుకొని నట్లు దెల్పి యాతని సమ్మతింపజేసెను.

ఒక్కనాడు భార్యాయుక్తుడై బయలుదేరి మార్గమధ్యమున రాగతరంగిణి రొండలిపై గల సర్వాభరణములను లాగుకొని యామెను యొకనూతియందు ద్రోసివైచి యామె తప్పక మరణించునను ధైర్యముతో దనగ్రామమునకు బోయెను. ఆ కూపంబుననుండి యధికతర దుఃఖంబున శోకించుచుండ కొందరు పధికులామార్గమున బోవుచు రోదనమాలించి యా కూపంబున నున్న యామెను వెలుపలకుదీసి తరుణీమణీ! నీ వెవ్వతెవు యీ కూపంబులో బడుట కేమి కతంబు. ఎవ్వరు నీ కిట్టిపాటు గల్గించిరి. నీ వృత్తాంతమాద్యంత మెఱింగింపుమని యడిగిరి. అంత నామెయు దనవిభుడే తనికిట్టిపాటు గల్గించినవాఁడని సంపూర్ణముగా నెఱింగియు యది బయలుసేయనేరక తాను విభునితో నత్తవారింటికి బోవుచుండగా దొంగలడ్డగించి తమ్ముదోచుకొనిరనియు దన్ను నూతిలో పారవైచిరనియు దనవిభుఁడేమయ్యెనో దనకు దెలియదనియును దాను కాంచీపురంబున నున్న శ్రీగుప్తడను వైశ్యుని కుమార్తెననియు దెల్పి వారిసహాయమున కాంచీపురమును జేరెను.

ధనగుప్తుడును భార్యయొక్క భూషణములన్నియును దెగనమ్మి జూదమున గొంతధనమును, స్నేహితుల రంజించుటకై కొంతధనమును దన్ను దానకర్ణుఁడని పొగడినవారల కిచ్చుచు కొంతధనమును వ్యయించెను. ఆయమెఱుగని కర్చు అనర్థమూలమగు గాని యన్యమెన్నటికేని యగునా? కొలదిదినములలో నాతఁడు తిరుగ పూర్వపుస్థితి కరుదెంచెను. మరల నత్తవారింటికేగి మామగారి నెటులైనను వంచించి ధనము సంపాదింపవలయునను యభిలాషంబున నిరంతరప్రయాణంబుల కంచిజేరెను. మామగారింటి కేగినతోడనే యాతనికి మొట్టమొదట భార్యగాన్పించెను. తోడనే యాతఁడెంతయో భయపడసాగెను. కాని రాగతరంగిణి నీవు భయపడవలదు. వనములో దొంగలు మనలదోచుకొనినట్లు జెప్పితినని బల్కి యాతనిభయంబు మాన్పెను.

అనంతరమిచట గొన్నినాళ్లుండి రాగతరంగిణి వధించియైనను భూణముల దిరుగగొని పోవలయుననియు సంకల్పించుకొని తిరుగ భార్య దనతో బంపుమని యడిగిన మామబంపడని నిశ్చయించుకొని యొక నాటి సంభోగపరిశ్రమస్ఫురతబొంది దనకౌగిలిలో సుఖనిద్ర జెందిన యా తరుణీమణిని విదల్చి చంపనుంకించి కత్తియెత్తెను. ఆ సమయమున రాగతరంగిణి మేల్కాంచి పెద్ద గోలబెట్టుటచే భీతచిత్తుడై ధనగుప్తుడు మ్రాన్పడియుండ శ్రీగుప్తుడాదిగాగల వారచ్చటి కరుదెంచి ధనగుప్తుని దుర్ణయమునకు నాతని జీవాట్లుపెట్టి నావలకు పారదోలిరి."

అని యీకథను శారిక వినిపించి భూపాలచంద్రమా! పూరుషులు క్రూరులనుట కింతకంటె నధికనిదర్శన ముండవలయునా? ఇద్దానివలన స్త్రీదయామతులై దమదయితులై నాధుల మన్నింతురని లోకమునకు వెల్లడియగుచున్నది. పురుషులు—తమప్రియురాండ్రను గూడ తుచ్ఛధనమునకై యాశించి వధింతురనియు తేటతెల్లమగు చున్నది గదా యనిన విని రాజశేఖరుండు కీరమా! స్త్రీలధికపాపాత్ములని నీ వెట్లు జెప్పగలవని ప్రశ్నించెను.



# విలాసవతి కథ



రాజశేఖర సార్వభౌమా! స్త్రీలు దుర్మార్గులని నిరూపింపదగు కొక్కకథగల దాలింపుడు. తొల్లి సర్వసంపదల కాకరంబైన విక్రమ సింహాపురంబును ప్రతాపమకుటుడను భూపాలుడు పరిపాలించుచుం డెను. ఆ ప్రతాపమకుటుఁడు దన కుమారీమణియైన విలాసవతియను దానిని పాటలీపుత్రరాజ్యమును బరిపాలించు భూపాలుని కుమారుఁడైన సుధర్ముఁడనువాని కిచ్చి యఖండవైభవంబున బరిణయము గావించెను. ప్రతాపమకుటుడు సుధర్మునకు దనపురంబున గల నొక్క దివ్యసౌధం బున జాయాసహితంబుగా నుండుట కొసంగెను. కొన్నిదినముల వరకా సుధర్ముఁడు విలాసవతితో సుఖంబుగ గడపెను.

ఒక్కనాడు విలాసవతి చంద్రకాంత శిలాసౌధంబున నిలచి పరి కించుచుండ దూరంబున పినాకినీ తటంబు గానవచ్చెను. ఆ పినాకినీ తటంబున నిలువం బడియున్న మారసన్నిభుడగు విప్రకుమారుని గను గొని యాతనిపై చిత్తంబు హత్తుకొన వియోగ భరంబున గుందుచుం డెను. అంత నొక్కచెలికత్తెను జేరబిలిచి యా విప్రకుమారుని జూపి యాతని నెట్లైనను యా రామమునకు దోడ్కొనిరా బనిచెను. పని చినతోడనే యామె భూసురోత్తముని పాలికిబోయి కుమారి నినుగాఢ ముగా వలచినది గావున నామె యభిమతంబు దీర్తువుగాక రమ్మని చెప్పి యాతని సమ్మతింపజేసి యుపవనంబునకు దోడ్కొనిపోయి యొక లతానికుంజమున గూర్చుండబెట్టి దనయాగమనమునకై యెదురుజూ చుచున్న విలాసవతి కా వృత్తాంత మంతయు దెలిపెను.

విలాసవతి యా రేయియందు విభానిత్వరితముగా నిద్రబుచ్చి యుప కాంతుని గూడవలయునను యుబలాటంబున నుపవనంబునకు బోయెను. అచట నా విప్రకుమారుడు సర్పదష్టుఁడై మృత్యువై పడి యుండు టదిల

అనంతరమించట గొన్నినాళ్లుండి రాగతరంగిణి వధించియైనను భూష ణములు దిరుగగొని పోవలయుననియు సంకల్పించుకొని తిరుగ భార్యను దనతో బంపుమని యడిగిన మామబంపడని నిశ్చయించుకొని యొకనాటి సంభోగపరిశ్రమస్ఫురతబొంది దనకౌగిలిలో సుఖనిద్ర జెందిన యా తరుణీమణిని విదల్చి చంపనుంకించి కత్తియెత్తెను. ఆ సమయమున రాగతరంగిణి మేల్కాంచి పెద్ద గోలబెట్టుటచే భీతచిత్తుడై ధనగుప్తుడు ప్రాణప్పడియుండ శ్రీగుప్తుడాదిగాగల వారచ్చటి కరుదెంచి ధనగుప్తుని దుర్ణయమునకు నాతని జీవాట్లుపెట్టి నావలకు పారదోలిరి.''

అని యీ కథను శారికవినిపించి భూపాలచంద్రమా! పూరుషులు క్రూరులనుట కింతకంటె నధికనిదర్శన ముండవలయునా? ఇద్దానివలన స్త్రీదయామతులై దమదయితులై నాథుల మన్నింతురని లోకము నకు వెల్లడియగుచున్నది. పురుషులు—తమప్రియురాండ్రను గూడ తుచ్ఛధనమునకై యాశించి వధింతురనియు తేటతెల్లమగు చున్నది గదా యనిన విని రాజశేఖరుండు కీరమా! స్త్రీలధిక పాపాత్ములని నీ వెట్లు జెప్పగలవని ప్రశ్నించెను.

---

# విలాసవతికథ



రాజశేఖర సార్వభౌమా! స్త్రీలు దుర్మార్గులని నిరూపింపదగు నొక్కకథగల దాలింపుము. తొల్లి సర్వసంపదల కాకరంబైన విక్రమ సింహపురంబును ప్రతాపమకుటుడను భూపాలుడు పరిపాలించుచుండెను. ఆ ప్రతాపమకుటుఁడు దన కుమారీమణియైన విలాసవతియును దానిని పాటలీపుత్రరాజ్యమును బరిపాలించు భూపాలుని కుమారుఁడైన సుధర్ముఁడనువాని కిచ్చి యఖండవైభవంబున బరిణయము గావించెను. ప్రతాపమకుటుడు సుధర్మునకు దనపురంబున గల నొక్క దివ్యసౌధంబున జాయాసహితంబుగా నుండుట కొసంగెను. గొన్నిదినముల వరకా సుధర్ముఁడు విలాసవతితో సుఖంబుగ గడపెను.

ఒక్కనాడు విలాసవతి చంద్రకాంత శిలాసౌధంబున నిలచి పరికించుచుండ దూరంబున పినాకినీ తటంబు గానవచ్చెను. ఆ పినాకినీ తటంబున నిలువం బడియున్న మారసన్నిభుడగు విప్రకుమారుని గనుగొని యాతనిపై చిత్తంబు హత్తుకొన వియోగ భరంబున గుందుచుండెను. అంత నొక్క చెలికత్తెను జేరబిలిచి యా విప్రకుమారుని జూపి యాతని నెట్లైనను యా రామమునకు దోడ్కొనిరా బనిచెను. వని చినతోడనే యామె భూసురోత్తముని పాలికిబోయి కుమారి నినుగాఢముగా వలచినది గావున నామె యభిమతంబు దీర్తువుగాక రమ్మని జెప్పి యాతని సమ్మతింపజేసి యుపవనంబునకు దోడ్కొనిపోయి యొక లతానికుంజమున గూర్చుండబెట్టి దనయాగమనమునకై యెదురుజూచుచున్న విలాసవతి కా వృత్తాంత మంతయు దెలిపెను.

విలాసవతి యా రేయియందు విభానిత్వరితముగా నిద్రబుచ్చి యుపకాంతుని గూడవలయునను యుబలాటంబున నుపవనంబునకు బోయెను. అచట నా విప్రకుమారుడు సర్పదష్టుఁడై మృత్యువుడై పడి యుండు టదిల

కించి కడుంగడు విచారించి వానిపై గల మోహంబు పెంపున నాతనిపై బడి కౌగలించుచు విచారించుచుండ నప్పుడా విప్రబాలకుని శరీరము భూతావేశమగుటయు నా విలాసవతి నిక్కముగా నాతఁడు పునర్జీవితుడైన యట్లుదలంచి యా శరీరమును పెక్కుగతుల కౌగలించి విలపించుచుండెను. అంతట నాభూతావేశమైన శరీరము విలాసవతి ముక్కునుగట్టిగా కరచుకొనియెను. విలాసవతి తనముక్కును వెలికి దీసికొన బలిమిని ప్రయత్నింప నయ్యది యూడిపోయెను. అంతచేయునది లేక విభుడు నిద్రించుచున్న శయనాగారమున కరుదెంచి యా శయ్యాతల మంతయు రక్తమయము గావించి చెలులారా నా విభుడు నా ముక్కు గొరికివేసెను. రండనుచు పెద్దగోలబెట్టెను. చెలులెల్లరును కలవరపడుచు నచ్చటి కరుదెంచిరి. కొందరు భూపాలుయొద్దకు బరువిడి యా వృత్తాంతమంతయు వినిపించిరి.

కొలదిసేపటిలో భూపాలుఁడు కుమారీమణి శయనాగారమున కరుదెంచి కుమారీ కల్పితకథాకర్ణనమున నల్లునియెడ రోషకషాయితలోచనుడై తత్క్షణము యాతని జంప బంపెను. చనిచిన సేవకులా సుధర్ముని వధ్యభూమికిఁ గొనిపోయి వధింప సంకల్పించుకొనియున్న సమీపమున నున్న యొక మునిపుంగవుడు నేర మేమియును లేక యీతని జంప దగదని బల్కుచు గడచిన యథార్థచరిత్ర మంతయు భూపాలునకు తెలియజేసెను. భూపాలుడును యతీంద్రుని పల్కుల యథార్థమారసి కూతుని పురంబున నుండనీయక పారదోలెను.

రాజశేఖరా, వింటిరిగదా యీ కథ స్త్రీలు క్రూరులు దుర్మార్గులు అనుట కింతకంటె నధికమగు నిదర్శనము కావలయునా? యని కీరము పలుకుటయు రాజశేఖరుఁడు కీరమును మిక్కిలిగా ప్రశంసించెను. కర్పూరమంజరి శారికను ప్రశంసించెను.

విక్రమార్కమహీపాలా! వింటివిగదా యీ కథ యిందు స్త్రీ

పురుషులలో నెవ్వ రధికపాపులని ఘనసారపేటిక ప్రశ్నింపగా విక్ర మార్కుఁడు నవ్వుచు మగవారె మిక్కిలి క్రూరులును పాపులును గాని వనితలెంతమాత్రమును గారని పల్కెను. అంత కళావతి ముసుగు దీసివైచి అచేతనవస్తువులకు జీవన మొసంగి మాటలాడింపగల శక్తి గల ధీమంతులు గదా? తమరు అట్టియెడ కర్పూరకరండ మడిగిన ప్రశ్నకు దగినట్లుగా సమాధాన మీయక తప్పు జెప్పనగునా? పురుషు డెన్నటికిని పాపకర్ముడని పలుకగూడదు. గాని స్త్రీ యెట్టి దురిత మాచరించినను పతివ్రతాచరణభంగము గల్గి పలువురచే వ్రేలిడి చూపింపబడునది యగును గాన స్త్రీలే యధిక పాపాత్ములని బల్కి మరల ముసుగువైచికొని పరుండెను.



# పద్మావతి కథ



విక్రమార్కుండు మరల నామెను మాటలాడింప సంకల్పించుకొని సువర్ణకలశమునకు దన మంత్రవిద్యచే సచేతనత్వమును మాటలాడు శక్తియు నొసంగి "కలశమా! ప్రొద్దుపోకడ కేదేని యొక కథ వక్కాణింపుము. యింకను నిద్దుర వచ్చుటలేదు. యెవ్వరితో నైన మాట లాడుదమన నెవ్వరును సమీపంబున లేరుగదా" యని బల్కెను. అంత నా సువర్ణకలశము దేవా! దివ్యాద్భుతచాతుర్యముల నొప్పారు కథల పెక్కుపర్యాయము లాలించియుందురు. అట్టి మీకు ముదం బొనగూర్చు కథ జెప్పగల సామర్థ్యము నాకు లేదు. అయినను తమరు జెప్పుమని యాజ్ఞాపించుటచే దమ యాన మీరక నాకు దోచిన భంగి యొక కథ వినిపింతునని యీ క్రిందికథ యిట్లు జెప్ప దొడంగెను.

తొల్లి వింధ్యాద్రిసమీపంబున వివేకనిధానమను పురీవరంబు గలదు. ఆపురంబున పరిపాలించు క్షోణీనాయకునకు బద్మావతి, గుణావతి లీలావతి యను ముప్పురు కుమార్తెలు గలరు. వారు ముప్పురును జగన్మోహనా కారులు. కళాశాస్త్రపారంగతులు. బుద్ధియందు బృహస్పతి నైన మీర గలవారలు. కడుంగడు జాణలు. యుక్తవయస్కులగు కుమార్తెలు ముప్పురకును పరిణయమును గావించి భూపాలుడు వారిని యధికమగు కానుకలతో నత్తవారింటి కనిపెను.

గుణవతి నత్తింట కాపురము సేయుచుండ నా పురంబున కొక్క పరిహాసకుండు—జారశిఖామణి యనందగువా డరుదెంచెను. అతని సౌందర్యము దిలకించి పురుషులు కూడ విభ్రాంతులై యాలింగన మొనరింప నాశించుచుందురని నింక స్త్రీ లాతని గాంచిన తమంత వలచి యాతనిపై బడుదురని వేరె జెప్పవలయునా? పెక్కేల యా

పరిహాసకుండు హారుని కనుదృష్టి దాకని మరుడని యెల్లరును దలంచు చుందురు.

అతండు యొక్క కాసారముచెంత గూరుచుండి వచ్చి పోవు మెడి లోలాక్షుల దిలకించుచు దనతో జేరినవారలతో పరిహాసంబుగ వారల జూపి పల్కుచు వారలు నవ్వుచుండగా తగు నింటిబిడ్డల జూచి యుచ్చ గిత్తలవలె ప్రాకులాడుచు కేరడ మొనరింపదగునా యని మందలించు చుండును. ఇట్లు లా పురీవరంబున విహరించుచు నొక్క నాడు కామ శాస్త్రకళావేదులైన విటవిదూషకపీఠమర్దకనాగరకులతోడ బహువిధ స్వైరిణీగరాప్రసంగంబుల బ్రొద్దుపుచ్చుచున్న సమయంబున మీ దేశం బున గ్రొత్తలగు వార్త లెయ్యవి. యెవ్వరెవ్వరివల నేయే చోద్యంబులు దెలియనగును నా కెఱిగింపు డనిన వార లా నూతనపరిహాసకుని కిట్లనిరి. ఈ పురీవరమున కించుక దూరమున మహాఘోషపట్టణ మొక్కటి గలదు. అందు విటుల భాగ్యలక్ష్మియో యనందగు త్రిజగ న్మోహిని యొక్కతె గలదు. ఆమె పద్మావతి యన బరగుచుండును. తొలుకరి వానకాలమున దోచు మెఱుంగును పసిడేటి నీటి చేవలు మీరు కడగి శుభ్రపరచి వారిజభవుం డా లలితాంగినిగా నొనరించెనో యనునట్లు వయోవిలాసములచే విటాళి కపరిమితామోద మొన గూర్చుచుండును. ఆమె విభుఁడు ధనుర్బాణయుతుండై రేవవలను భేదము లేకుండ యామె వెనువెంట జరించుచున్నను యాతని నెట్టులో మాయబుచ్చి యుపకాంతుని జేరి యాతని సంతతానందవార్ధిని దేలించుచుండును. ఆమె నేరుపును గొనియాడ నెవ్వనికిని తరంబు గాజాలదు. గనుగొన తలంపు గలదేని యామెకడకుఁ బోయి రమ్మని అనిన విని వారల పలుకు లెంతవరకు సత్యంబులో కనుగొనవలయు నను దలంపున బయలుదేరి మహాఘోషపురంబు జేరెను.

మహాఘోషపురంబు. జేరంజని పురోపకంఠమున నున్న యొక యువ

వనంబు ప్రవేశించి యందున్న శశికాంతశిలాతలంబున గూర్చుండి మార్గాయాస మపనయించుకొని సమయోచితవేషాలంకృతుఁడై యా పురీవరంబు ప్రవేశించి య పద్మావతీ సతిమందిరంబును పౌరజనంబుల వలన నెఱింగి యందు జొచ్చెను. అచ్చట సువర్ణరచితములైనట్టి పంజరంబులనుండి రతిరహస్యముల సముల్లాససంరంభంబున వినిపించు కీరరాజము గాంచి యానందించుచు నా కీరరాజములకు కలకండ మున్నగు పదార్థముల దన కరపల్లవంబుల నందించుచున్న పద్మావతిం గాంచి పెన్నిధిం దిలకించిన పేదచందంబున నా పరివ్రాజకుండు సంతసించెను. అంత నాతఁడు తన మనంబున నిట్లు తలపోయసాగెను. ఔరా! యేమి యీ లలితాంగి సోయగము. సమీపమున నున్న మణిమయరచితసాలభంజికలకు దన భాసురాకృతి రమణీయత యొసంగుచుండెను గదా! ఆహా నవరత్నస్థగితబంగరుపంజరస్థితరాజకీరంబుల మృదుపల్కుల కీరాజీవాక్షి పల్కులు గురూపదేశతుల్యంబులు గదా! లోకముల కెల్ల చక్కనిది నా భార్య యని విర్రవీగు మారుని గర్వము పరిహరింప గాఁబోలు నీ లతాతన్వి నా యజుండు సృష్టించెను. ఈ లోలాక్షిం దిలకించుటవలన నా నేత్రములు నేటికి సాఫల్యము నొందినవి. ఇంక నీ బిబ్బోకవతిని జిత్తము కేళిఁదేల భాగ్యం బింక నా కెన్నఁడు లభించునో యపుడె నా జన్మము సార్థకమగును గదా! భళిరే! యిట్టి యొయ్యారములు గల్గు విలాసవతి త్రిలోకంబులందైన నుండజాలదని దలపోయుచుండ నాకాంతామణి రూప, జితమన్మథుం డగు నాతని యాకారవిశేషాదుల గాంచి సంతసించుచు నీత డెవ్వరు. యీతని సౌందర్యసౌకుమార్యముల బరికించి చూడగా స్వర్గమునుండి భూమీతలంబునకు విలాసార్థమగా దిరుగ నరుదెంచిన యాజయంతుఁడో లేక దేవేంద్రుని పనుపున దనభార్యయే మహామునితపంబో విఘ్న మొనరించుటకు భూతలంబున కరుదెంచి

యామె నన్వేషించుచుండు యానలకూబరుఁడో గావలయును. లేకు న్నచో సామాన్యమానవుల కిట్టి యనుపమానసౌందర్య మలవడునా? మన్మథుడు రూపవంతుఁడని లోకులందురుగాని నిక్కముగ నా నామ మాత్రావశేషుఁ డీతనికి సౌందర్యసౌకుమార్యములదీసికట్టనియే జెప్ప వలసియున్నది. భళీ! యిట్టి సుందరాంగుని ముఖారవిందసందర్శన భాగ్యము నేటికిగదా లభించెను. భళీ! ఈతనితో గామసుఖంబు లనుభవింపనోచిన యాతరుణియే స్తుతిపాత్రము. ఇట్టి విటచక్రవర్తితో గడపు యొక్క త్రుటికాలమైనను జాలదే" అని యేమోదలచుచు సాభిప్రాయముగా నాతనివంక రెప్పవాల్పక జూచుచుండెను. ఆత డును తనవాల్చూపుల నాయింతి సోయగమీక్షించుచుండెను. అంత నాయిరువురి చూపు లేకమయ్యెను. మన్మథుఁడు ప్రసవబాణములతో నుభయులను సమముగా గొట్టుచు పాక్షికవుబుద్ధిలేక సంచరించెను. అంత నాపరిహాసకుండు గనుసన్నల తానరుదెంచిన విషయంబు తేట తెల్లముగా దెలిపిన గుర్తెఱింగి పద్మావతి యాతని మజ్జనభోజనాదుల సంతృప్తునిగావించి తనకు బ్రియసఖుండైన వసంతుండను వానిని బిలి పించి యాతనితో మంతనంబున పరిహాసకు డరుదెంచిన వృత్తాంత మంతయు దెలిపి యాతని పుష్పవనమునను నిచి తనపతియొద్దనుండి దన్నెటులైనను పుష్పవనమునకు జేర్పవలసినదని యుపదేశించి యాతనితో పరిహాసకుని బంపెను.

తదనంతరము విభుండు గృహమున కరుదేరగ నాతనియందు దన కెంతయో మక్కువయున్నట్లు నటించుచు యాతని కెదురేగి గైదండ యొసంగి లోనికిఁదోడ్కొనివచ్చి సుఖాసీనుని గావించి యాతని పద కమలములను కడగి తజ్జలమును శిరమున ధరించెను. ఆతడు దన సతి యొనరించు పరిచర్య లన్నియును నిక్కువమైన ప్రేమతో నొనరించు వానిగా దలంచి సంతసంబున బ్రియురాలిని గౌగలించుకొనెను. అంత పద్మావతియు ఈతడు నాకపటప్రేమను యదార్థముగానమ్మియుండెను,

యింక నీతని క్షణమాత్రమున మోసగించి యుపభర్తను జేరగలనను ధైర్యమున ప్రియుని త్వరితగతి మజ్జనభోజనాదుల దేల్చి యాతనితో సరససల్లాపముల దేల్చుచు యుపవనమునకు దోడ్కొనిపోయెను. అచ్చటి నవమల్లికాకుంజపుంజముల ప్రియుని గౌగలించుచు యాతనికి దనయందు సదభిప్రాయము గలుగున ట్లొనరించుచు యాతఁడు దరి జేరుకొలంది దూరమున కేగుచు వివిధవిధంబుల విహరించుచుండెను.

అట్టియెడ నొక్క పూరుషుఁడు పదములు తొట్రుపడ మోమున దైన్యము దోప యా యుపవనంబున కరుదెంచి పద్మావతి విభుని డాయంజని దీనత్వంబున నిట్టులనియెను. నేను ప్రథమగర్భవతియైన నా భార్యను పుట్టినింటికి దీసికొనివచ్చుచుండగా నీసమీపమున మార్గ మధ్యమున ప్రసూతివేదనబడుచు యామె గుందుచున్నది. తగిన యాదుదక్షత లేకుండుటచే పెద్దప్రాణమునకే మోసమువచ్చునో పిల్లకే యపాయము గలుగునో యను భయంబున నిట్లు పరువిడివచ్చి తిని. దగిన సహాయ మొనరించి రక్షింపకున్న మాకింక బ్రతుకు తెరవులేదు." అని బలుకుటయు నాతని పల్కులు నిక్కువంబులుగా దలంచి పద్మావతీరమణుండు వానికిఁ దోడుపడుట ముఖ్యకర్తవ్య ముగా దలంచి పద్మావతితో నిట్లనియెను. "చూచితివా! యాత నికి గల్గిన యాపద. ఇట్టియెడ నెట్టివానికైన నుపకృతి సలుపుటవలన లగ్గగునుగాన నీవీతనితో నీతని భార్యను గలసికొని బోయిరమ్మని బని చెను. పద్మావతియు ప్రాణవిభుని యపుడు బాయవలసివచ్చుట కెంతయో జింతించుచున్నట్లు నటించుచు నాధా! తమ యాజ్ఞదాట నేరనుగదా? నేడు దమతో విలాసముగా గడపుదమని నిశ్చయించు కొంటిని గాని యావిధి నానుదుట యట్లువ్రాత వ్రాయకుండ నేమి చేయుదును. అయినను శీఘ్రకాలమున జనుదెంచెదను." అని బలు కుచు నానూతనాగంతకునితో నరుగుచుండెను. పద్మావతీరమణుం డును నిదురవచ్చుచుండుటచే శయనింప శయనాగారమున కరిగెను.

పద్మావతి యాతనితో బోవుచు "వసంతకా! ఎంతమంచి యుపాయ మాలోచించితివి. అతనిని తిరుగ సమాధానమిచ్చుటకు వీలులేనట్లు జేసిన నీప్రతిజ్ఞ కెంతయో సంతసించితిని." అంత వసంత కుఁడును యజమానురాలు దన్ను మెచ్చుకొనినందుల కుబ్బుచు శీఘ్రగమనమున నేగి పరిహాసకుని దోడ్కొనివచ్చి యామె నేత్రముల కపరిమితానంద మొనగూర్చెను. ఆపరిహాసకుం డామెతో యిష్టా లాపభోగము లనుభవించి యామె చాతుర్యము గొనియాడుచుండెను.

అంత పద్మావతియు నాతఁడు దన్ను మెచ్చుకొనుచుండుటజూచి ఓయీ! ఇందేమి చాతుర్యము జూపియుంటినని నను గొనియాడు చుంటివి. నాకంటె చతురత్వముగలవారలు యీపృథివిలో నెందరో యుందురు. ఎచ్చటనో యననేల నిచటికి నాలుగైదుమైళ్ళదూరమున భర్మస్థలమను గ్రామముగలదు. ఆ గ్రామమున గుణావతి యను నొక్క యువతీలలామ గలదు. శృంగారరసమంతయు మూర్తీభవించి యాదురూపుదాల్చినట్టు లామె జనంబులకు దోచుచుండును. ఆలతా తన్వి నెమ్మోము పున్నమచందురు దెగనాడుటయేగాక వికసిత పద్మములమేల మాడుచుండును. ఆ లతాతన్వి నెమ్మేను పసిడితీగెను నిరసించుటయెగాక తొలకరిమెఱుంగుల జక్కాడును. ఆలతాంగి పయో ధరంబు కుంభికుంభముల క్రిందుపడజేయుటయెగాక జక్కవకవపోలుపు దెలుపు. ఆలోలాక్షి కనుంగవ గండుమీలనుబ్బడంగించుటయెగాక కమలపత్రముల నెకసక్కెమాడును. వేయేల ఆమెతో బోల్చద గిన మగువలీ యిలాతలంబున నెచ్చటను గానబడరని చెప్పుటతిశయోక్తి గాజాలదు. ఆసతీలలామ్మ దన చాతుర్యముపెంపున దన విభునికెట్టెదు టనే యువపతితో గలియుచుండును. వలయునెడల యరిగి యాచాతు ర్యము దిలకించుము. అని యెఱింగించిన విని యాతఁడత్యాశ్చర్య మగ్నమానసుడయ్యెను. సముచితాలాపంబుల నాతఁడు సంతృప్తి నొంది పద్మావతిని విభునిచెంతకు బంపెను.

# గుణావతికథ



ఆ పరిహాసకుండీ పద్మావతి దన్ననయము వెంబడించియుండి విభు నికండ్లలో కారమునఁజల్లి నాతో రమించియుండె ననియే యేనెంతయు వింతనొంది యుండగా నీ గుణావతి విభుని కట్టెదుటనే విభుని గవయు నట. అది యెట్లు సంఘటింపనేర్చునో గదా! పరికించి చూడవలయు నని దలంచుచు భర్తృస్థల యగ్రహారంబు సేరి నాడు రాత్రియగుటయు నొక్కచో విశ్రమించి మరునాడరుణోదయంబుననే మేలుకాంచి కాలోచితకృత్యముల దీర్చుకొని గుణావతియున్న నివాసంబును పౌరుల వలన విని యా గృహంబును డాయం జనెను.

పరిహాసకుఁడు గృహోపకంఠమున నిలచియుండుట దిలకించి గుణావతీకాంత మిక్కిలి యబ్బుర పాటొందుచు ఔరా! యీత డెవ్వడై యుండును? కళాలేశ్యమైన దరుగని యా శశిరాజా? లేక శివుని కంటి మంటలచే దగ్ధుడుగాని యా చిత్తజాతుఁడా? వారిరువురును గా కున్న నీతఁడెవ్వడో దివ్యపూరుషుఁడు గాని సామాన్యుడుగాడు. నర మాత్రులకిట్టి సౌందర్య మలవడునా? ఈ తని సాంగత్యంబు లభించిన నా యదృష్టము గొనియాడదరమగునా! యని పెక్కువిధంబుల దల పోయుచుండెను.

ఆ పరిహాసకుండును గుణావతిం దిలకించి పద్మావతివలనందావినిన దానికంటె నధికతర సుందరి యగుటచే యీ చతురానను నిర్మాణ కౌశలంబునకు మదిలో మెచ్చి కన్ను సన్నలదానరుదెంచిన తెరంగం తయు నా లలనామణికి దెలియజేసెను. గుణావతియు నాతని నాదరించి మజ్జనభోజనాదుల పరితృప్తుని గావించి యాతనితో నిట్లనియెను. నీవు సూర్యాస్తమయమైన పిమ్మట నరుదెంచి నా యుద్యానవనంబున నొక

బండి గురువెంద పొదలోన గూర్చుండి యుండుము. అపుడు నీకు నా చాతుర్యమంతయు జూపెదను.

పరిహాసకుఁడా దినమంతయును నెట్టెటులో గడపి సాయం సమయమున గుణవతీ యుద్యానవనంబును బ్రవేశించి యామె యుపదేశించి నట్లుగా నొక్క పొదరింట దాగియుండెను. అట గుణావతియు నాథుని రాకకై యెదురు జూచుచు యాతడరుదెంచిన తోడనే నాథా! నన్నిటులొంటిగా విడచి యింతవర కెచ్చటనుంటిరి. ఏకులుకులాడితో భోగించుచు నా మాట మరచియుంటిరి. కానిండు ఆ కులుకులాడితోడనే భోగించుడు. యింక నేనెందులకనియా తనితో నిష్టురములాడి, నన్నంటరాకుడటంచు బలుక ప్రియుండు దనకోపము దీర్ప సమీపమున కరుదెంచుచుండ దానించుక దూరమున కరుగుచు క్రమక్రమంబున నాతని బుష్పవనంబునకు దోడ్కొని పోయెను.

అట ప్రియునకు చిత్రముగా వశమైనట్లు యాతనిచేతికి జిక్క యాతనితో నా యుపవనంబున విహరించుచు బండి గురువెంద పొదలోన దనరాక గోరుచు పరితపించు చున్న మారుమగని గనుగొని యాతని తత్తరింపవలదని కనుసన్నల హెచ్చరించుచు ప్రియునకు దనపై నెట్టి యనుమానమును గలుగకుండ ప్రవర్తించెను. అంతట నాగుణావతి ప్రియుని జూచి నాథా! ఈ సురపొన్న పూవు లధిక సౌరభ్యయుక్తములుగదా! వీనిని గోసి కొనవలయునని బుద్ధి వొడముచున్నది. క్షణమిందు నిలువుము. నేనా పూవుల గోసికొని వత్తునని బల్కుచు యా సురపొన్న వృక్షమును జేరి మెల్లన యద్దాని నారోహణమొనర్చి యతి ప్రయాసమున నొక్కపూవును గోసి వాసనజూచుచు నాథుని వంక మొగంబై నాథా ఈ పూవు పరిమళము వర్ణనాతీతము—అదేమి యించుక నేవు మిముబిడచి పుష్పముల గోసికొన చెట్టెక్కిన నాకండ్ల యెదురనే యెవ్వతెనో బెట్టుకొని భోగించుచుంటిరా! ఇంత దురాగ

తము నీకు ఁదగునా? నన్నింతగా నవమాన మొనరింప నూహించితిరా? అని యతినిష్ఠురముగా బలుకుచున్న తరుణీమణికి నామె నాథుం డిట్లనియెను. ప్రియా! యూరక నన్నేల నిందించెదవు. యిచ్చట నేనిం కొక తరుణితో భోగించుచుండుటలేదు. నీ కది యెట్లు గానబడు చున్నదో కాని యిచట నేనుదక్క మరియొక డెవ్వడును లేడు. బాగు గా పరికించి చూడుము." అనిన విని గుణావతి నాథా! నా కటులనే గాన్పించుచున్నది అదే యా తరుణీమణి మిమ్ము బిగ్గ గౌగిలించుకొని మీ యధరామృతమును గ్రోలుచున్నది. ఆగుడు. నేనదిగి వచ్చుచుం టినని యా వృక్షావరోహణ మొనరించి ప్రియుని సన్నిధికేగి నాథా! నా కనుల కట్లు గాన్పించెనేల. అయ్యది యీ వృక్షముయొక్క మహా త్మ్యమని తోచుచున్నది. మీరుగూడ నీ వృక్షాగ్రమున కెక్కి బరి కించుడు నే నన్యపూరుషునితో నున్నట్లు మీకుగూడ గాన్పించునేమో పరికింతమనుటయు యాతఁడా సురపొన్న వృక్ష మధిరోహించి యొక పుష్పమును గోసి వాసన జూచుచుండెను.

ఈ లోపున గుణవతి బండి గురువెంట పొదక్రింద గూరుచుండిన పరిహాసకుని త్వరితగతి దనుజేర రమ్మని యాతఁడరుదెంచిన తోడనే యాతని సరస సల్లాపవచనంబుల దేల్చి దనకుగల కామశాస్త్ర కళా కుశలత్వము జూపి యాతని మెప్పించెను. ఆతఁడామె చాతుర్యవిశేష మున కెంతయో సంతసించి యామెను నుతింపసాగెను. గుణావతియు దన్ను మించిన నారీమణు లెందరో పృథివీతలంబున గలరనియు అందు నను దన చెలియలగు లీలావతి దనకంటె నధికచాతుర్యము గలదనియు, ఆమె దన విభుడొక వంక బరుండి యుండ రెండవవైపున గల మారు మగనితో సల్లాపము జేయుగల జాణ యని వక్కాణించి యామెనుగనుగొన తలంపుగలదేని సుధర్మానగరంబున నామె గలదు. పోయిరమ్మనుటయు నా పరిహాసకుఁడు వల్లెయని బలుకుచు యామెకడ సెలవొంది వెడలి

పోయెను. అనంతరంబు గుణావతి దన విభునితో గలిసికొని నాథా! మీ కెట్లు గానబడినది. అది యూనుకపొన్న వృక్షముయొక్క మహాత్మ్యమని భావింతుననుటయు నాతఁడును అట్ల నై యుండనోపునని బల్కెను. గుణావతియు నాథునితో ననునయాలాపములాడుచు గృహంబునకు దోడ్కొని పోయెను.



# లీలావతికథ



పరిహాసకుండు లీలావతీ సందర్శనానందకుతూహలాయత్తచిత్తుండై సుధర్మాపురంబున కరుగుచు మార్గమధ్యంబున దన మనంబున నిట్లని వితర్కింపసాగెను. ఆహా! యిటువంటి జగదేకసుందరులగు నీ ముగ్గురు లతాంగులతో సంభోగము నావంటివానికి లభించినదే నాభాగ్యమేమని కొనియాడుదును. కాని ప్రపంచమున నొకరిని మించినవారింకొక రున్నారని చాటుటకు వీరి చారిత్రమే యాదర్శకప్రాయమై యలరారుచుండును గదా? అని తలపోయుచు సుధర్మానగరంబు జేరంజని యంతస్స్మిత సంస్మితవదనుండై లీలావతీ మందిరంబును పౌరజనంబులచే నాలించి తద్గృహంబు జేరంజని నవయౌవ్వన ప్రాదుర్భావయై మారుని యారవ బాణమోయనునట్లు మెఱయుచున్న లీలావతింగాంచి తన్మయత్వంబునొంది ప్రమాన్పడి నిలువంబడెను. ఆలీలావతియు నాతని సోయగమీక్షించి భళిరే నేడట్టి సుందరుని దిలకించితిని. ఆరమానందనుండైన నీతని గనినంతనే లోకమున నేనయందకాడనని యికముందెన్నడును ప్రగల్భము లాడబోను. నిక్కమున కీతండిచ్చటి కరుదెంచుటజూడ నాభాగ్యదేవత నీతనినాతో సంధానపరచుటకు దోడ్కొని వచ్చినట్లు దోచుచున్నది. అని తలంచుచు మనంబున నింతింతనరాని యాత్రత బొడముటయు నాతని కనుసన్నల లోనికి రమ్మనిబిలిచి యాతని వలనపద్మావతీ గుణావతులుదమ చాతుర్యము జూపియుండిరనియు గుణావతిచే నాతడచటికి బంపబడిన వృత్తాంతమును విని యధిక సంతోషాయత్తచిత్తయై ఆతనితో నిట్టులనియెను. నీకు నాచాతుర్యముగూడ జూపెదను. కాని ప్రస్తుతము నీవాడురూపమును

ధరింపవలయును. లేకున్న మోసము వాటిల్లుననుటయు యాతఁడును సమ్మతించి యొక్కనిముషమున నాడురూపుము ధరించి నిలిచెను.

ఇంతలో లీలావతినాధు డరుదెంచెను. అప్పుడు లీలావతి యాకపట స్త్రీని తన నాధునకు మ్రొక్కించెను. ఆతఁడయ్యది నిక్కంపు కాంతగాదలంచి యీమె యెవ్వరు మన గృహమున కేటికి వచ్చెను. యెప్పుఁడరుదెంచెను అని ప్రశ్నించెను. అందుల కనుగుణ్యముగా క్షణమైనను నాలోచింపకుండ నాస్త్రీ దన సోదరియనియు సమీప గ్రామముననుండి నేడరుదెంచెననియు బల్కుచు భోజనమునకు లెండని యాతని త్వరపెట్టసాగెను. అంతనాతఁడును లీలావతి జెప్పిన యసత్యకథనమంతయు నిక్కువమైనదని తలంచి ఓసీ! పిలువక దనంతట దానరుదెంచినదని యీనడింపచేయక యీమె నెట్లాదరింతువో తగినవిధంబున భోజన సదుపాయము లొనర్చుము. నీబంధువుల యెడ నేనంతగా చెప్పవలసిన యగత్యములేదు. అయినను లోటుపాటు లేమైన జరిగిన యపనింద నాతలపై బడునను భయంబున మరల జెప్పుచుంటిని." అని బలుకుచు భార్యయు వదినెగారును వెంబడింప వచన గృహంబునకు జనియెను.

లీలావతి దనవిభునకును మారుమగనికిని (ఆడురూపముననున్న) తృప్తిగా భోజనంబిడి దానును భుజించి వారితో క్రమ్మర శయనాగారమును ప్రవేశించి భర్తకు కర్పూరదాంబూలం బొసంగి సమీపమున గూరుచుండి తాంబూలము వేసికొన యత్నించుచున్న కుహనా సోదరి నివారించి అక్కా! నీకాయాకుల దీసికొను శ్రమయేల నీచెల్లి యలనగు నేనుండ నీవ్వూరక శ్రమపడవలయునా? ఈ యొక్కదినమునకైన నాకునీసేవ గలుగ నేయరాదా! యని బలుకుచు యామెకు కూడ తాంబూలమును తయారుచేసి యొసంగెను. అంత దనమనంబున పరిహాసకుండు ఔరా! యిది యెంతజాణ. తాంబూలమీయని కాంత

సంభోగమున కనర్హురాలని పెద్దలనుచుందురే అట్టిభావము నాకుగూడ దోచునేమోయని దానే దాంబూల మిచ్చుచున్నది. పరాకునన్నైన నించుకంతయు గుట్టుచెడకుండ మాటలాడుచున్నదే" అని దలంచు చుండెను.

ఇంతలో లీలావతి విభుని పాన్పునజేర్చి యాతని పాదః లొత్తుచు నిదురవచ్చిన దానిపోల్కి యచట బరుండెను. అంత కుహ సోదరి చెలియలా! నేను పరుండు టెక్కడయని ప్రశ్నించెను. అ నామెయు అక్కా! ఇటురమ్ము నాప్రక్కనే పరుందువుగాని. సి పడకుము. మరదిగారు నీకు క్రొత్తగాదు! అంతియేకాక నడుః నేనుంటినిగదా యింక సందేహమెందులకు. " అని బల్కెను. లీలావ నాధుఁడును—ఓసీ! అదేల సిగ్గుగానున్నది గాబోలును దానిని బలవం తము సేయుటెందులకు. వేరొకపరువున్నది గదా దానిపైనొక దుప టమును పరువరాదా? యని బల్కెను. అంత లీలావతియు నాపరు పెక్కడనోయున్నది. యిపుడు నేను తీయజాలను. ఒక్క రాత్రి కెందుల కంతకష్టమని యూరకుంటిని." అని ప్రత్యుత్తరమిచ్చెను. అంతనాతఁడు ఎంతకష్టము. త్రాళ్లలోనున్న పరుపు దింపుటకు గష్టమేమి. నేను దింపె దను. దుప్పటి నొకదానిని మాత్రము గొనిరమ్ము. " అని బలుకుచు లేవబోయెను. అంతనా కుహనాసోదరియు యాతని వారించుచు వలదు. యిప్పుడుమీరు నాకొరకై శ్రమపడవలదు. మా చెలియలప్రక్క పండు కొనెదను." అని బలుకుచు లీలావతి ప్రక్కను శయనించెను. లీలా వతియు విభునిచెంత కిసుమంతజరిగి రొయొక్కనిముష మూరకొని అబ్బా ఈదినమున మిక్కిలి యుక్కగానున్నది. కొంచె మావలకు జరుగుడు అని బలుకుచు నాతనిదరినుండి పరిహాసకుని చెంతజేరుచు మరల నాధునితో నేకాంతమాడుభంగి నభినయించి మరల వెనుదిరుగ కొంతతడవు వేగించి మెట్టకేలకు దనకొప్పుననున్న నల్లగలువరే

్ద దను నెపంబున దూరముననున్న దీపముపై బడవైచెను.
యు నెఱుగని దానివోలె నయ్యో దీపమారిపోయెనే అని
. అంత లీలావతీ నాథుకు చెకుముకిదీసి దీపము వెలిగించుటకు
ుత్నము చేయగా లీలావతి యాతని చెంతకరిగి, పోనిండు యిప్పుడు
నిమిందులకు గావలసినప్పుడు వెలిగించుకొనవచ్చునని బలుకుచు
వ తనివారించెను. అటుపిమ్మట కొంత తడవ్వూరకుండి నాథునితో
మ వతి నాథా! కామశాస్త్రమున మాయక్క మిగులప్రౌఢగావున
స యొద్ద గొన్ని బంధనముల నేర్చుకొనవలయునను కుతూహల
నున్నది. నేను నేర్చుకొనినయెడల నివన్నియును దమకు దెలి
యే యగును. అప్పుడు మనమిరువురమును హాయిగా సుఖంప
చ్చునుగదా యని నమ్మికబుట్ట వచించి యాతనిసమ్మతిబరచి కొండి
ునిట్లనియెను. నాకామె వానిని బోధించునపుడు నిద్రాముద్రితుఁడ
నట్లు నటింపుము లేనియెడల నామె సంకోచించునేమోయని
ల్కెను. అతఁడును నట్లేయనిసమ్మతించి యట్లుండెను. అంత లీలా
వతి పరిహాసకునితో వివిధ విధముల గ్రీడించెను. అప్పటికి జాముుాత్రి
మాత్రమే మిగిలియుండెను. అంతట లీలావతి కుక్కుటారవము
లాలించి లేచి నిద్రించుచున్న నాథునిలేపి దన యక్క ప్రయాణమై
పోవలసి యున్నట్లు దెలిపి బండికై బంపించెను.

అనంతరము లీలావతి యాతనికిజెప్పవలసిన వాక్యముల జెప్పి ఆత
నిబండిపై నెక్కించి కొంతదూరమువరకు సాగనంపి గృహమునకు మర
లుచు మరల నెప్పుడైన రావలయునుసుమా యని హెచ్చరించుచు
నాథునితోగూడ వెనుకకు మరలెను. లీలావతి గృహంబునేరి ప్రియు
నకు దనపై నెట్టియనుమానము గలుగకుండ నాతని నూతన విలాసం
బుల పెద్దయుం బ్రొద్దు దేల్చెను.

అని విక్రమార్క భూపాలునకా సువర్ణకుంభము దెలిపి సార్వ
భౌమా! యీముగ్గురువెలదులలో నెవ్వరు కడుంగడుజాణలో యెఱిం